ఆంధ్రప్రదేశ్ లో

# పంచాయతీ రాజ్యం



★

సంకలనం:
సి. ప్రేమ్ ఆనంద్

అనువాదం:
ఎ. బి. కె. ప్రసాద్

★

ఆనంద్ బుక్ హౌస్,
హైద్రాబాద్.

# విషయ సూచిక

[ఈ పుస్తకంలో ప్రచురించడానికి వ్యాసాలు వ్రాసి పంపిన వారికి, యింకా వివిధరకాల సమాచార, సహకారాలను అందించినవారికి మా హృదయపూర్వక కృతజ్ఞత.]

— సంపాదకులు.

# ఈ పుస్తకం గూర్చి

"ఇదొక పెద్ద ముందడుగు. గ్రామీణ ప్రజలకు నిజమైన స్వరాజ్యావిర్భావం అంటే ఇదే. ఏమంటే, ఇకనుండి తమయింటిని తామే చక్కదిద్దుకునే యజమానులవుతారు. తమ అభివృద్ధికి ఏ పద్ధతులు ఉచితమో నిర్ణయించుకొనే అధికారం కూడా గ్రామీణులకే దక్కనున్నది. ఆ నిర్ణయాలను అమలుజరిపే అధికారమున్నూ, వారిదే అవుతుంది. ఇక ప్రభుత్వ పనల్లా సహాయ సహకారాలను అందించడం మాత్రమే. ఈ విషయంలో ముందంజ వేసింది రాజస్థాన్, ఆంధ్రప్రదేశ్‌లు. ప్రజలు గనుక తమకు సంక్రమించిన ఈ నూతనాధికారాన్ని తెలివితేటలతో వినియోగించుకో గలిగితే, ఇతర రాష్ట్రాలు వారి కృషిని మెచ్చుకోవడమే కాకుండా పోటీపడి ఆచరిస్తాయికూడా". షాద్‌నగర్‌వద్ద పంచాయతీసమితికి ప్రారంభోత్సవంచేస్తూ ప్రధాని నెహ్రూ పైవిధంగా అన్నారు. ఈ ఒక్క పంచాయతీ సమితియేగాదు; ఆంధ్రప్రదేశ్ మొత్తంమీద 26 వేల గ్రామాలున్నాయి. 14 వేల పంచాయతీలున్నాయి. ఇవిగాక ప్రజాతంత్ర వికేంద్రీకరణకు సంబంధించిన చట్టాన్ని అనుసరించి 235 పంచాయతీ సమితులు జిల్లాకొక పరిషత్ చొప్పున జిల్లా పరిషత్తులు ఏర్పడ్డాయి. వీటి నిర్మాణంతో, 'ప్రజలందరికీ స్వరాజ్యం' అన్న నామకరణంతో ఆంధ్రప్రదేశ్ చరిత్రలో ఒక నూతనాధ్యాయం ప్రారంభమైంది.

ఈ పుస్తకంలో మేము, మనరాష్ట్రంలోని పంచాయతీ విధానం రూపురేఖల్ని గూర్చి పాఠకులకుస్థూలంగా వివరించి చెప్పడానికి ప్రయత్నించాం. పంచాయతీలంటే ఏమిటి? వాటి ఉద్దేశాలేమిటి? పేదరికంతో సతమత మవుతున్న గ్రామీణ ప్రజానీకానికి పంచాయతీల ప్రాధాన్యత ఏమిటి? పంచాయతీలు విజయవంతంగా పనిచేయాలంటే అందుకు కావలసిన సాధన సంపత్తి ఏమిటి? ఈ ప్రశ్న లన్నింటికీ ఈ పుస్తకంలో సమాధానాలివ్వడానికి ప్రయత్నం జరిగింది. మన గ్రామాల పరిస్థితులనుగూర్చి, వాటికున్న పరిమితులను గూర్చి చివరకు అతిసామాన్యుడికికూడా అర్థ మయ్యే పద్ధతిలో ఇందులో సమాధానా లివ్వబడ్డాయి ఆర్థిక పరిపాలనా విషయాలనుగూర్చి, ప్రజాతంత్ర వికేంద్రీకృత నాయకత్వానికి సంబంధించిన ప్రధాన అంశాలను క్లుప్తంగా చర్చించడం జరిగింది.

అంతేగాదు, గ్రామీణాభివృద్ధి కార్యక్రమాలపై కొంత సమాచారాన్ని కూడా ఈ పుస్తకంలో చేర్చాం. సమాజాభి వృద్ధి పథకాలనుగూర్చి స్థూలంగా వివరించాం. జిల్లాలవారీ ద్వితీయ ప్రణాళికా వివరాలనుకూడా పాఠకులకు అందిం చాము. మూడో ప్రణాళిక ముసాయిదాయిచ్చాం ఆచరణలో ప్రణాళికా సౌకర్యాలనుగూర్చి పాఠకులు తెలుసుకోవడానికి ఇది తోడ్పడుతుంది.

ఈ పుస్తకం సామాన్య ప్రజలకే గాకుండా, పంచా యతీలకు గ్రామాభివృద్ధి కార్యక్రమాలకు సంబంధించిన

ఉద్యోగులకు సహితం తోడ్పడుతుందని ఆశిస్తున్నాం. ఈ పుస్తకంలో పాఠకులకు కొన్ని తప్పులు అవుపించవచ్చు. నూతన గ్రామీణ సమాజాన్ని, నూతన గ్రామీణ నాగరికతను సృష్టించాలన్న లక్ష్యం నెరవేరడంలో ఈ పుస్తకం ఏమాత్రం తోడ్పడినా, యీ పుస్తకాన్ని తీసుకురావడంలో సంపాదకులు పడ్డ కష్టానికితగ్గ ప్రతిఫలం లభించినట్లే వారు భావించగలరు.

హైద్రాబాద్, అక్టోబరు, 1960. సి. ప్రేమ్ ఆనంద్.

# అనాదిగా వస్తున్న పంచాయతీ

మానవ సమాజం తొలిరోజుల్లో, మానవజాతి అనాగరిక దశనుండి నాగరిక దశలో పడ్డప్పుడు — సమిష్టి జీవనం గడిపిన సంఘా లున్నట్లు చరిత్రలో మన కవుపిస్తుంది. సమిష్టి కార్యక్రమం, సమిష్టి యాజమాన్యం, పరస్పర సహకారం, ఒకే లక్ష్యంతో నాటి సమాజాలు నివసిస్తూండేవి, వీటినే ఇప్పుడు మనం పంచాయితీలని వ్యవహరిస్తున్నాం. ఆ విధంగా గ్రామీణ సమాజాలు లేదా పంచాయితీ లనేవి మనకు కొత్తేమీ కాదు. పరస్పర శ్రేయస్సుపైన, పరస్పర శ్రేయస్సుకోసం ఏర్పడ్డ ప్రాచీన మానవ సాంఘిక, రాజకీయ, సాంస్కృతిక సంస్థల ప్రతిరూపాలే ఈ పంచాయితీలు. ఈ రకమైన పురాతన సమాజ విధానానికి కొన్ని ఉదాహరణలు చూపవచ్చు: గ్రీస్‌లో ఏర్పడ్డ "సిటీస్టేట్స్" (నగర రాజ్యాలు). వీటికి సంపూర్ణ మైన స్థానిక స్వపరిపాలనాధికారా లుండేవి. 'సమిష్టిజీవనం' వుండేది. అంతేగాదు, ఒకప్పుడీ "సిటీస్టేట్స్" పార్లమెంటుగాను, ప్రభుత్వం, కార్యనిర్వాహకవర్గం, శాసనసభ, న్యాయ నిర్వాహక వర్గంగానూ వ్యవహరించాయి. పురాతన రష్యాలో "మిర్" అనే మరో ప్రధాన గ్రామీణ సామాజిక వ్యవస్థ వుండేది, భూమిపై సమిష్టి యాజమా న్యానికి సంబంధించిన అద్భుత విషయాలు ఈ విధానంవల్ల బోధపడ గలవు. ప్రాచీన రష్యాలోని గ్రామీణ వ్యవస్థ చాలవరకు భారతదేశం లోని గ్రామీణవ్యవస్థను పోలి వుంటుంది. సమిష్టి వైఖరిద్వారా ప్రతీ సమస్యకు పరిష్కారమార్గాలను కనుగొన్న విషయాన్ని రిగ్వేదంలాంటి హిందూమత గ్రంథాలు ఉగ్గడిస్తున్నాయి, దీన్నిబట్టి తేలేదేమంటే, ప్రాచీనులకు గ్రామాలలో స్థానిక సంస్థలనేవి వుండేవని, ఈనాడు మనం ఏ పద్ధతిలో నడుపుకోవాలనుకుంటున్నామో అదే పద్ధతిలో ఆ సంస్థలు పని చేస్తూండేవని బోధపడ్తుంది, ప్రాచీనుల కిటువంటి స్థానికసంస్థ లున్నట్లు రామాయణ, మహాభారత కావ్యాలలో ప్రస్తావన

వుంది, "గ్రామిక్" అనే గ్రామపెద్ద వుండేవాడు. ఇతన్ని సరాసరి రాజుగాని, ప్రభుత్వంగాని నియమించేవారు. గ్రామ పరిపాలన కంతటికీ ఇతడే బాధ్యుడు. "గ్రామిక్" గ్రామపెద్దల సలహాల ననుసరించి నడుచుకునేవాడు. ఈ గ్రామపెద్దలను గ్రామ ప్రజలనుండే ఎన్నుకొనేవారు. "గ్రామపెద్దల సంఘం", గ్రామిక్, రాజు — ఈ ముగ్గురూ సహకార, సద్భావాలు ఆధారంగా తమతమ బాధ్యతలను నెరవేర్చేవారు. ప్రజలపట్ల తమ ధర్మాన్ని నిర్వర్తించేవారు. ఆ విధంగా మన ప్రాచీన భారత గ్రామీణ వ్యవస్థ, రాజ్యమూ, సంఘమూ వేర్వేరుగా మనగలుగుతూ వుండేవన్నమాట. ఇది నిజంగా అసాధారణమూ, విలక్షణమైనదిగా చెప్పుకోవచ్చు. అయితే ఈ రెండూ — రాజ్యమూ, సంఘమూ కూడా - ఒకదానిపై ఒకటి ఆధారపడి వుండేవి. అదే సమయంలో సమిష్టిజీవన సౌలభ్యంకోసం జనరంజకంగా వుండే జాతీయ విభాగాలుగా వ్యవహరించేవి. ఈ విషయంలో తమకున్న స్వాతంత్ర్యాన్ని కొంతవరకు పరిమితం చేసుకునేవికూడా. ఈ రెండు శాఖలూ (జాతీయ, గ్రామీణ శాఖలు) పరిణామశీలమైన చట్టాలనూ, పద్ధతులనూ అంగీకరించాయి. ఉమ్మడి శ్రేయస్సుకోసం ఉపయోగించే చట్టాలు, పద్ధతులూ ప్రజలకు అర్థమయ్యే విధంగానే వుండేవి. ఈ విజయాలకూ, ప్రాచీన గ్రామ పంచాయితీల పరిపాలనా యంత్రాగం ఇంత ప్రాధాన్యతగలది అవడానికి కారణం ప్రజలే. ఏమంటే సంఘంపట్ల తమ హక్కులేమిటో, విధులేమిటో, వారికి తెలుసు. రెండో విషయం - న్యాయం, నిష్పాక్షపత్యం, సమర్థత, ఇవన్నీ ప్రతివ్యక్తికీ అందుబాటులో వుండేవి. మూడోవిషయం ప్రజల్లో పాలకుడికి నమ్మకం వుండేది. గ్రామాలకు సంబంధించిన అన్ని వ్యవహారాలలోనూ ప్రజలకు సంపూర్ణాధికారాలు యిచ్చేవాడు. అన్నిహక్కులూ యిచ్చేవాడు. కావలసినంత ధనం మంజూరు చేసేవాడు. నాలుగో విషయం — సంఘంలో ఒక వ్యక్తిని మరోవ్యక్తి దోచుకు తినేందుకు వీలులేని పద్ధతిలో ఆర్థిక, పౌర, సాంస్కృతిక జీవనం అభివృద్ధి చెందుతూ వుండేది.

వాస్తవానికి ఈ ప్రాచీన గ్రామీణ సంస్థలే మన చరిత్రను నిర్మించాయి, తీర్చిదిద్దాయి. మన అద్భుత నాగరికత అంతా ఈ గ్రామీణ వ్యవస్థ ఆధారంగా విలసిల్లినదే. వికేంద్రీకృత ప్రాతి పదికపై మన గ్రామాలు అత్యంత సమర్థవంతగా తమ స్వంత విష యాలను విజయవంతంగా నడుపుకోగలవనడానికి అనూచానంగా వస్తున్న ఈ మన ఔన్నత్యతకు ప్రత్యక్ష సాక్ష్యం. సమిష్టి చైతన్యం, భ్రాతృసమానమైన భావం, సంఘ ప్రయోజనాలకంటే ఉన్నత భావంతో బాధ్యతలను స్వీకరించేందుకు అసంఖ్యాక ప్రజలు ఒకచోటకు చేర్చబడ్డారు, ఇందుకు గత చరిత్రే సాక్షీభూతం. అందుచేత, మన పంచాయితీలను, సమిష్టి సంఘాలను పునరుద్ధరించడానికి నవ భారత దేశం పూనుకుంటూంటే, ఆ కృషిని తక్కువ అంచనా వేయడంగాని, ఆ విషయమై అనుమానాలు పెట్టుకోవడంగాని తెలివితక్కువ తనమే అవుతుంది. అలాగాక మనం వాటిని వాస్తవికమైన చారిత్రక దృక్కోణంతో పరిశీలించాలి. అప్పుడు వాటినుండి మంచి ఉపయో గాలను పొందగలుగుతాం. లోపాలనూ విసర్జించగలుగుతాం.

గ్రామీణ పంచాయితీ వ్యవస్థ అనేది మనకు కొత్తేమీ కాదు. వేదకాలంనుండీ వస్తూన్నదే. కాకపోతే మారుతూన్న కాలానికి అనుగుణంగా అప్పుడప్పుడూ ఈ వ్యవస్థా నిర్మాణంలో మార్పులూ, చేర్పులూ జరుగుతూ వచ్చాయి. ఇవి మంచికే జరిగాయి. ఈ పరి స్థితి అంతా బ్రిటిష్‌వాళ్ళు మన దేశానికి వచ్చేవరకు కొనసాగింది. బ్రిటిష్‌వాళ్ళు అడుగు పెట్టారు. ఈ వ్యవస్థను నిర్దాక్షిణ్యంగా అణగ ద్రొక్కేశారు, భారతదేశానికి 1947 ఆగష్టు, 15 న స్వాతంత్ర్యం వచ్చింది. కొద్ది రోజుల్లోనే డాక్టర్ బి. ఆర్. అంబేద్కర్ అధ్యక్షతన దేశానికి కొక ముసాయిదా రాజ్యాంగం తయారైంది, దానిని తరువాత రాజ్యాంగ నిర్ణయసభ ఆమోదంకోసం పంపారు. కాని దురదృష్ట వశాత్తూ, ముసాయిదా రాజ్యాంగాన్ని రచించినవారు రాజ్యాంగంలో గ్రామ పంచాయితీలను గూర్చి ప్రస్తావించడం అవసరం లేదనే భావిం చారు, నిజానికి ఈ రాజ్యాంగ రచయితలంతా, గ్రామాలకు పుట్టి

నిల్లయిన ఈ మహాదేశంయొక్క సుపుత్రులే! కాని వీరు చేసిన ఈ పనికి అసంఖ్యాక ప్రజలు ఆశాభంగం పొందారు. ఈ విషయమై గాంధీజీ దృష్టికి తీసుకువస్తే ఆయన యిలా వ్యాఖ్యానించారు. "ఇది నిజంగా రాజ్యాంగంలో జరిగిన లోపమే. మన స్వాతంత్ర్యం, ప్రజా వాణిని ప్రతిబింబించాలంటే జరిగిన ఈ లోపం తక్షణం ప్రజల దృష్టిని ఆకర్షించాలి. పంచాయితీల అధికారాలు ఎక్కువైనకొలదీ ప్రజలకు మరిన్ని లాభాలు చేకూరుతాయి."

రాజ్యాంగసభకు ముసాయిదా రాజ్యాంగాన్ని సమర్పిస్తూ డాక్టర్ అంబేద్కర్ భారతీయ గ్రామాలను గూర్చి యిలా చెప్పారు:— "ప్రజలు గర్వించదగ్గ గొప్పతనం గ్రామాలలో ఏముంది? అనేక ఇబ్బం దులను అవస్థలను తట్టుకుని అవి బయటపడ్డాయన్న మాట నిజమే. కాని బ్రతికి బయట పడ్డంతమాత్రాన లాభంలేదు. ఏ ప్రాతిపదికపై అవి మనగలిగాయన్నదే ప్రశ్న? గ్రామాలలో స్వార్థం మూర్తీభవించి ఉంది. ఈ గ్రామీణ రిపబ్లిక్ అనేవి భారతదేశ వినాశ నానికి దారితీసేవి. అందుచేతనే, రాష్ట్రీయతత్వాన్ని, కులతత్వాన్ని ఖండించే పెద్దలే గ్రామాలపట్ల కొమ్ము కాయరావడం నాకు విస్మయం కలిగిస్తోంది. ముసాయిదా రాజ్యాంగంలో 'గ్రామ పంచాయి తీల'నుగూర్చి ప్రస్తావించనందుకు, "వ్యక్తే" గ్రామానికి యూనిట్‌గా అంగీకరించినందుకు నాకు సంతోషంగా వుంది."

డాక్టర్ అంబేద్కర్ ప్రసంగానికి చాలమంది విచారం వెలి బుచ్చారు. దీన్నిబట్టి స్వపరిపాలనా సంస్థలైన గ్రామపంచాయితీలపై మన భారత రాజ్యాంగం ఆధారపడి వుండకపోయినట్లయితే, మన అభివృద్ధి ప్రణాళికలు విఫలమవడం ఖాయమనేది స్పష్టంగా తెలుస్తోంది. అభివృద్ధి అవకాశా లుండాలంటే, గ్రామాలకు ప్రజాస్వామ్యం ఎంతో అవసరం. రాజ్యాంగ సభలో రాజ్యాంగ ముసాయిదాపై కూలంకషంగా చర్చలు జరిగాయి. దేశవ్యాపితంగానూ సుదీర్ఘ చర్చలు జరిగాయి. పంచాయితీలను రాజ్యాంగంలో చేర్చనందుకు విమర్శన పరంపరా,

రాజ్యాంగంలో చేర్చాలని పలు సూచనలూ దేశం నలుమూలలనుండి అన్ని వర్గాల ప్రజలనుండి వచ్చాయి.

ఉద్రేకపూరితంగా వాదప్రతివాదాలు జరిగాయి. తుదకు రాజ్యాంగ "చోదకసూత్రాల" (directive principles) లో పంచాయతీలకు సంబంధించిన ఒక కొత్త నిబంధనను చేర్చాలన్న శ్రీ కె. సంతానం సవరణను రాజ్యాంగసభ అంగీకరించింది. ఇక ఇప్పుడు రాజ్యాంగం నాలుగో భాగంలోని నిబంధన 40 (డైరెక్టివ్ ప్రిన్సిపల్స్ ఆఫ్ స్టేటుపాలసీ) ఇలా నిర్దేశిస్తూవుంది. "గ్రామ పంచాయతీల నిర్మాణానికి ప్రభుత్వం చర్యలు తీసుకుంటుంది స్వపరి పాలనా సంస్థలుగా వ్యవహరించడానికి అవసరమైన పాలనాధికారాలను పంచాయతీలకు అప్పగిస్తుంది."

రాజ్యాంగ "చోదక సూత్రాలనేవి" భారత రాజ్యాంగంలో ఒక కొత్త అంశం. ఇటువంటి సూత్రాలను పోలివున్న రాజ్యాంగం మరొకటి వుంది. అదే ఐర్లండు రాజ్యాంగం. ప్రభుత్వాలు తమ విధానాలను రూపొందించుకొనేటప్పుడు వాటికి ఈ సూత్రాలు సహాయ కారిగా (గైడెన్సు) ఉపయోగపడతాయి.

భారత రాజ్యాంగంలో పంచాయితీలను చేర్చడం, గతించి పోయిన మన గ్రామ రిపబ్లిక్‌లకు నవజీవనం పోసి పునరుద్ధరించడమే. బాధ్యతాయుత ప్రజలతో నవభారత నిర్మాణాన్ని సాధించాలన్న గొప్ప సుదూర లక్ష్యాలవైపు ఇది మొదటి మజిలీ అనే చెప్పాలి. పంచాయ తీలు పునర్జీవనం పొందాలంటే, నిరక్షరాశ్యతను నిర్మూలించాలి. ఆర్థిక అసమానతలను తొలగించాలి. ఇవి ఎంతో ప్రధానమైన సమ స్యలు. నిరక్షరాస్యతా నిర్మూలన అనేది ఎంతో ఒక క్రమపద్ధతిలో నిర్విరామంగా పట్టుదలతో కృషిచేస్తేతప్ప కాని పని. పోతే ఆర్థిక అసమానతలను తొలగించడం అనేది చిక్కులతో కూడుకున్న వ్యవ హారం. వైషమ్యం తప్పనిసరి కావచ్చు. కాని ఆర్థిక అసమానత లను తొలగించడంలో క్రమాభివృద్ధిని సాధించాలంటే, వైరుధ్యం లేకుండా చూసుకోవడం అవసరం. పోతే ఆర్థిక అసమానతను తొల

గించడానికి మరో ప్రత్యామ్నాయ మార్గం వుంది. అదే శ్రీ వినోబాభావే మాటల్లో చెప్పాలంటే "ప్రేమైకశక్తి", ప్రేమ అనేది మానవుడికి ప్రకృతియిచ్చిన బహుమానం. అలాగే రాజూ, పేదా, మంచీ-చెడూ, తెలివితక్కువా, తెలివితేటలూ అని లేకుండా ప్రేమా, దాని విలువా అందరికీ ఒకటే. మానవుడు తప్పనిసరిగా ఏదో ఒక రూపంలో ప్రేమదేవతను ఆరాధిస్తూనే ఉంటాడు. మానవుడి పుట్టుకనేది ప్రేమ ఉంటేనేగాని సాధ్యంకాని పని. అలాగే అతడి పెరుగుదలా ప్రేమ వుంటేనే సాధ్యం. అదీ ప్రేమలోవున్న శక్తి. అంటే, ఆవిధంగా సంఘంలో ప్రేమ, ఐకమత్యం, సుహృద్భావాలను సృష్టించవచ్చు. సంఘంలో వీటి పాళ్లు ఎక్కువైనకొలదీ క్రమేణా సంఘానికి తమంతా ఒకటేనన్న భావం ఏర్పడుతుంది. సంఘంలో స్పర్థలు ఎప్పుడైతే నశిస్తాయో, శాంతియుతంగా ఆర్థిక సమానత్వాన్ని పెంపొందించే మార్గాలు అప్పుడే ఇచ్ఛాపూర్వకంగా మనఃపూర్వకంగా ఏర్పడుతాయి.

ఇక్కడ మరో సమస్య వచ్చింది. ఇది సమాజస్థాయిలో నాయకత్వ సమస్య. ప్రజాతంత్ర వ్యవస్థ అనేది ఒకటివుంటే, ఈ సమస్య ఒక పెద్ద సమస్యకాదు. కాని ఒకవైపున నిరక్షరాశ్యత, అమాయకత్వం, పేదరికం మన గ్రామాలను వెంటాడుతున్నప్పుడు, ప్రజాతంత్ర పద్ధతిని కాపాడుకుంటూనే మరోవైపున పార్టీ రాజకీయా లకు అతీతులుగావుండే సుశిక్షితమైన నాయకత్వాన్ని ఎన్నుకోవడం అవసరం. అంతేగాదు, నాయకుడంటే సంఘ ప్రజల విశ్వాసాన్ని కూడా చూరగొనగలవాడై వుండాలి. తగినంత గౌరవం వుండాలి. పలుకుబడి వుండాలి, ప్రణాళికలూ పథకాలూ వేయగలిగి వుండాలి. గ్రామీణుల పూర్తి సహకారంతో ఒక క్రమపద్ధతిలో గ్రామ పరిపాలన నంతా నడపగల సమర్థుడున్నూ అయివుండాలి. ఆశతో నమ్మ కంతో ప్రజల ఉత్సాహాన్ని మెరుగులు దిద్దగల శక్తీ, తెలివీ ఉన్నవాడై వుండాలి. ప్రకృతి అందించిన ఉత్పత్తిశక్తివి పెంచేం దుకు ప్రజలను నిర్మాణాత్మకమైన మార్గాన్ని పట్టించగలవాడై వుండాలి. అదృష్టవశాత్తూ మన గ్రామీణ ప్రజలు సంఘంలోనే, సంఘంకోసం

పనిచేసే అనాదిగా వస్తున్న సంప్రదాయాలనే, ఫణికిపుచ్చుకున్నారు. ఈ సద్గుణాలను పునర్జీవింపచేసి, సమాజాభివృద్ధికి, అందరి మంచికీ వినియోగపడే శక్తివంతమైన సాధనాలుగా మార్చుకోవచ్చు. ఇది ఏమంత కష్టమైన పనిగాదు.

'నేటి' ని 'రేపటి'

నేత్రాలతో దర్శిద్దాం.

# పంచాయతీ చట్టాలు

శ్రీ త్రింబక్ రావ్ దేశ్‌ముఖ్
బి. ఎస్. సి., ఎల్. ఎల్. ఎమ్.
(లా కళాశాల లెక్చరర్)

## తెలంగాణాలో పంచాయతీ చట్టం :

గ్రామ స్వపరిపాలనకు సంబంధించి మొట్టమొదటిసారిగా 1940 లోనే హైద్రాబాద్ రాష్ట్రంలోని పంచాయతీల చట్ట మొకటి వెలసింది. ఈ భాగాన్ని "ఏ" అని పిలిచేవారు. ఈ చట్టంక్రింద దాదాపు 442 పంచాయతీలు వెలిశాయి. కాని ఇవిఅంత సంతృప్తికరంగా పని చేయలేవు. ఆచరణలో కాగితంమీదనే వుండిపోయాయి. ఈ పంచాయితీలు నామినేటెడ్ సంస్థలు. వీటికి ప్రజా ప్రాతినిధ్య లక్షణాలేమీ లేవు. పైగా ఈ సంస్థలకు లభించిన వనరులుకూడా చాలీ చాలనివి.

హైద్రాబాద్ గ్రామ పంచాయతీ చట్టం 1951 లో వచ్చింది. దానితో 1940లో తయారైన "ఏ" చట్టవిభాగం రద్దయిపోయింది. 1951 లో ప్రజాప్రభుత్వం ఏర్పడ్డతరువాతనే ఈ మార్పు జరిగింది. గ్రామ పంచాయతీలకు మొట్టమొదటసారిగా వయోజన ఓటింగ్ పద్ధతిపై ఎన్నికలు జరిగాయి. పంచాయతీలలో కొంతమంది సభ్యులకు - షెడ్యూల్డ్ కులాలను కలుపుకుని — నామినేట్‌చేసే హక్కునుకూడా ప్రభుత్వం తనకు ఉంచుకున్నది. వెయ్యిమంది జనాభాకు అయిదు వేలకన్నా మించకుండావున్న గ్రామానికి పంచాయితీ ఏర్పర్చుకోడానికి హక్కు యివ్వబడింది. అయితే చట్టంలో మరో అవకాశంకూడా కల్పించారు. కొన్ని గ్రామాలు కలిపి పంచాయతీగా ఏర్పడవచ్చు.

నర్నిర్మాణానికి సంబంధించిన అధికారాలను బదలాయించే
న్నికూడా చట్టంలో కల్పించారు. గ్రామ పంచాయితీ విధులను
రిగా అనుసరించవలసినవిగానూ, అధికారాన్ని ఉపయోగించి
సినదిగానూ విభజించారు. కొన్ని పన్నులు వేయడం, శిస్తు
బాధ్యతలను పంచాయితీలకు అప్పగించారు. నయా
పంచాయతీలను ఏర్పర్చడానికి అవకాశంకూడా
ప. అయితే ఆచరణలో అటువంటి పంచాయతీ ఒక్కటీ
ప. చట్టం అమలులోకి వచ్చిన మొదటి సంవత్సరంలోనే
ామ పంచాయితీలు ఏర్పడ్డాయి కాని డబ్బూ, సంపదా లేనం
మరుసటి సంవత్సరమే పంచాయతీల స్థాపనాకార్యక్రమం
యింది. ఏవో అక్కడక్కడా కొన్నితప్ప దాదాపు పంచాయ
ప్రయాణంతా అసంతృప్తిగానే వుండిపోయింది. ఆ తరువాత
ంవత్సరాలు గడచాయి. రాష్ట్ర ప్రభుత్వం 1955 లో పంచాయ
్మణాన్ని తిరిగి చేపట్టింది. ఆ ఒక్క సంవత్సరంలో 1500
తీలు ఏర్పడ్డాయి.

954 లో రాష్ట్ర ప్రభుత్వం స్థానిక స్వపరిపాలనా మంత్రుల
ం సిమ్లాలో జరిగింది. సమావేశానంతరం రాష్ట్ర ప్రభుత్వం,
పంచాయతీల సమస్యనే పునఃపరిశీలించాలని నిర్ణయించింది.
అమలులోవున్న చట్టమూ లోపభూయిష్ఠమైనవి; కార్యనిర్వ
సమర్థతా తక్కువ. వాస్తవానికి ఈ చట్టంక్రింద ఏర్పాటయే
తీలు సరైన పద్ధతిలో ఎన్నికైనవీ కావు; సరైన ప్రాతినిధ్యమూ
ము కార్యకలాపాలకు సంబంధించిన కొన్ని పనులకుమాత్రమే
మితమైపోయాయి. అందుచేతనే రాష్ట్ర ప్రభుత్వం సరికొత్త
రూపొందించింది. ఇది గ్రామీణ ప్రజాస్వామ్య సాధనవైపు
ది. ఈ కొత్తచట్టం పేరు - "హైద్రాబాద్ గ్రామపంచాయతీ
(17 వ చట్టం, 1956). ఈచట్టం గ్రామ పంచాయతీల అధి
ు, విధులను పెంచుతుంది. వాటికి కావలసిన వనర్లను సమ
ర్చడానికి దోహదం చేస్తుంది.

# గ్రామ పంచాయతీ చట్టంలోని ముఖ్యాంశాలు

గ్రామ పంచాయతీ (1956) చట్టం ప్రస్తుతం ఆంధ్రప్రదేశ్‌లోని తెలంగాణా జిల్లాలకు వర్తిస్తోంది. ఈ చట్టంలో 245 విభాగా లున్నాయి. ఇవి 12 అధ్యాయాల క్రింద, 5 షెడ్యూళ్ళ క్రింద విడగొట్టబడ్డాయి. ఈ 12 అధ్యాయాలలోనూ, మొదటి అధ్యాయం కొన్ని ప్రధాన సాంకేతిక పదాల నిర్వచనాలకు సంబంధించినది. ఈ పదాలు 41 వున్నాయి. రెండో అధ్యాయంలో 3 నుండి 36 విభాగా లున్నాయి. ఇది గ్రామ పంచాయతీ నిర్మాణ విషయాలు, పంచాయతీ సభ్యుల ఎన్నిక, వివిధ పంచాయతీల అధికారాలను గూర్చి చర్చిస్తుంది. గ్రామ పంచాయతీ సమావేశాల నిర్వహణకు సంబంధించి కూడా ఈ అధ్యాయంలో వుంది. ఆ తరువాత 37 నుండి 44 వ విభాగం వరకు సంయుక్త సంఘాల చర్చలు, పంచాయతీ కమిటీ ఉద్యోగుల, సిబ్బంది చర్చలను గూర్చి ప్రస్తావించబడింది. ఈమూడో అధ్యాయంలోనే "సర్‌పంచ్, (పంచాయతీ అధ్యక్షుడు) "ఉప సర్‌పంచ్" లకు చెందిన విధులు తెలుపబడ్డాయి. "కర్‌ణహారీ" కార్యాలయానికి చెందిన విశేషాలు కూడా వున్నాయి. పోతే నాల్గవ అధ్యాయంలో 41 నుండి 66 విభాగా లున్నాయి. పంచాయతీ విధులనుగూర్చి ఈ అధ్యాయంలో విపరమైన వివరణ వుంది. గ్రామ పంచాయతీకి దఖలు పర్చబడ్డ విధులు, అధికారాలూ మూడు తరగతులుగా వుంటాయి:-

(1) తప్పనిసరిగా నిర్వర్తించాల్సిన విధులు,

(2) అధికారం వినియోగించి నిర్వహించాల్సిన విధులు,

(3) బదలాయింపు విధులు.

ఈ విధులన్నీ అనేక కార్యకలాపాలకు చెందినవి. గ్రామ పంచాయతీలు తమకున్న వనర్లు, స్థానిక అవసరాలకు లోబడి ఈ విధులను నిర్వహిస్తాయి. ఈ చట్టంలో ప్రత్యేకించి పేర్కొనబడ్డ విధులకు తోడు, పంచాయతీల విధులను, అవసరమని భావిస్తే మరొక ప్రత్యేకాధికారికి బదలాయించే అధికారం రాష్ట్ర ప్రభుత్వానికి వుంది.

అధ్యాయంలోని 67 నుండి 69 వరకు వున్న విభాగాలు
హ్మాలన, శాంతి భద్రతల రక్షణకోసం సంబంధించిన పోలీ
కారాలను గూర్చి ప్రస్తావించాయి. కోత్వాల్ కార్యాలయం
చేస్తారు ఇందుకు సంబంధించిన అధికారాలన్నీ దానికే దఖలు
ఆరవ అధ్యాయంలో 70 నుండి 79 విభాగా లున్నాయి. ఏడవ
ంలో 80 నుండి 110 విభాగా లున్నాయి. ఈ విభాగాలన్నీ
తీ బడ్జెట్లు, పంచాయతీ నిధులు, పన్నులు (పన్నుల వసూళ్ళతో
గూర్చి చర్చిస్తాయి. ఎనిమిదో అధ్యాయంలో 111వ విభాగం
మొదలు 128 వ విభాగం వరకూ వున్నాయి. ఈ భాగాలలో
తీలపైన రెవెన్యూ అధికారులకుండే సాధారణ అజమాయిషీ
లను గూర్చిన ప్రస్తావన వుంది. గ్రామ పంచాయతీ జారీ
త్తర్వులకు వ్యతిరేకంగా మేజస్ట్రేట్‌కు అప్పీలు చేసుకునేం
డా చట్టంలో వీలు కల్పించబడ్డది. పన్నులు విధించడం, శిధిలా
ఉన్న పంచాయతీ ఆస్తిని తొలగించడం, లేదా బాగుచేయించడం
కేసుల విషయంలో మేజిస్ట్రేటుకు అధికారం వుంది. గ్రామ
తీగాని లేదా కలెక్టరు మున్నగువా రెవరైనా జారీచేసిన ఉత్త
దా పంచాయతీ నిర్ణయాలు ఎంతవరకు సబబుగా వున్నాయి?
ానికి అనుగుణంగా వున్నాయా లేదా అన్న విషయాలనుగూర్చి
శీలన జరిపే అధికారాలు ప్రభుత్వానికి దఖలు పడి ఉన్నాయి.
భాగంలో పొందుపర్చబడ్డ నిబంధనలను తయారుచేసే అధి
ల ప్రధానమైనది. దానిప్రకారం ఆ విభాగంలో తెలిపిన 33
ప సంబంధించిన నిబంధనలను రూపొందించే హక్కు ప్రభు
వుంటుంది. ఈ చట్టంలోని తొమ్మిదవ అధ్యాయంలో 127
9 విభాగా లున్నాయి. ఇవి, "సర్‌పంచ్," "ఉపసర్‌పంచ్,"
బాధ్యతలకు సంబంధించిన కొన్ని ప్రధాన విషయాలను
వివరణ వుంది, సద్భావంతో వారుచేసే చర్యలకు కల్పించే
షయం కూడా ఇందులో ప్రస్తావించబడింది. ఈ అధ్యాయం
దకు వచ్చే నేరాలను, ఆ నేరాలకు విధించే శిక్షలను గూర్చి
ప్రస్తావించింది. పదవ అధ్యాయంలోని 150 నుండి 163 వ

విభాగం (సెక్షన్) "రాజీ వ్యవహారాలకు" సంబంధించినది. రెవెన్యూ తగాదాలతో సహా సివిల్ తగాదా లన్నింటిని ఆ గ్రామానికి ఏర్పడే "రాజీ సంఘం" ద్వారా పరిష్కరించుకోవాలన్న అంశంకూడా ఈ అధ్యాయంలో చేర్చబడింది. ఈ రాజీసంఘం అనుసరించాల్సిన పద్ధతు లను గూర్చిన వివరణ కూడా ఈ అధ్యాయంలో ఒక ప్రత్యేకాంశం. న్యాయ పంచాయతీలు, వాటి అధికారాలకు సంబంధించిన వివరణ పద కొండవ అధ్యాయంలో వుంది. ఈ అధ్యాయంలో 164 వ విభాగంనుండి 219 వరకు వున్నది. ఈ భాగం, చిన్నచిన్న చిల్లర విషయాలలో పంచా యతీలకు సంక్రమించిన న్యాయాధికారాలను గూర్చి చర్చించింది. పోతే 220 విభాగంనుండి 225 వరకూ పన్నెండవ అధ్యాయం వుంది. తన అధికారాలను బదలాయించేందుకు పంచాయతీకున్న అధికారాలు పట్టణ కమిటీని పట్టణ పంచాయతీగానూ, పట్టణ పంచాయతీని పట్టణ మున్సి పాలిటీగానూ మార్చడం వగైరా కొన్ని అనుబంధ అంశాలను గూర్చి ఈ అధ్యాయంలో వివరణ వుంది. ఈ చట్టంలో భాగంగా వున్న షెడ్యూళ్ళు ఈక్రింది విధంగా వున్నాయి :-

(అ) నేరాల జాబితా : వీటికి సంబంధించిన సమాచారాన్ని "కోత్వాల్" పోలీస్ స్టేషన్ అధికారికి తెలపాల్సి వుంటుంది.

(ఆ) డిమాండు నోటీసు

(ఇ) ఫారమ్ ఆఫ్ వారంటు

(ఈ) పారమ్ ఆఫ్ ఇన్వెంటరీ, అండ్ నోటీస్.

(ఉ) న్యాయ పంచాయతీలు విచారింపదగ్గ నేరాల పట్టీ.

ఈ చట్టంక్రింద పంచాయతీకున్న చట్టబద్ధమైన నిర్వాహణా విధులు :-

(1) పరిపాలనా సంబంధమైనవి

(2) పౌర ,,

(3) సాంఘిక సంబంధమైనవి
(4) ఆర్థిక, గ్రామాభివృద్ధి ,,
(5) లెక్కలు వగైరా ,,
(6) న్యాయ ,,
(7) పోలీసు ,,

గ్రామీణులకు సంతుష్టి సౌకర్యాలు కల్పించేందుకు రెండు లేదా అంతకన్నా ఎక్కువ పంచాయతీలు కలసి ఒక ఒప్పందానికి రావడం అనేది - హైద్రాబాద్ చట్టంలో ఒక కొత్త అంశం. ఈ రకమైన కాంట్రాక్టు పద్ధతి నీటి సప్లయి, విద్యుచ్ఛక్తి, లైబ్రరీ వ్యవహారాలు, రోడ్ల నిర్మాణం, వాటి అభివృద్ధిలాంటి కొన్ని ప్రధాన పనులకు ఎంతో లాభదాయకంగా వుంటుంది. పన్నులు వేయడం, వాటిని వసూలు చేసే విషయమై కూడా వివిధ పంచాయతీల మధ్య ఒప్పందం కుదుర్చుకో వచ్చు. అంతేగాదు, ఈ పంచాయతీ చట్టం పంచాయతీ పైన ఎక్కువ అధికారాలను ఉంచుతోంది. ఏ యితర రాష్ట్రంలో లేనటువంటి పంచాయతీలకు ఎక్కువ అధికారాలను యిచ్చేది బహుశా హైద్రాబాద్ చట్టం ఒక్కటేనేమో.

ఆంధ్రప్రదేశ్‌లో తెలంగాణా, ఆంధ్ర జిల్లాలు వున్నాయి. పంచాయతీల గ్రామ పరిపాలనా విషయాలకు చెందిన చట్ట మొకటి రాష్ట్రంలో రూపొందనున్నది. ఇందుకు సంబంధించిన బిల్లు ఒకటి ప్రస్తుతం పరిశీలనలో వుంది. ఈబిల్లు 195? అక్టోబర్ 8న ఆంధ్ర ప్రదేశ్ అసాధారణ గెజెట్‌లో ప్రచురించబడింది. బిల్లు స్థూలాంశాలు చివర యివ్వబడ్డాయి. పూర్వపు ఆంధ్ర జిల్లాలలో పంచాయతీ చట్ట మొకటి వుంది. దీనినే మద్రాసు గ్రామ పంచాయతీల (1950) చట్టంగా వ్యవహరిస్తుండేవాడు, ఈ చట్టంలోని ప్రధానాంశాలనుకూడా మున్ముందు ఉదహరిస్తాను ఆంధ్ర జిల్లాలకు కూడా వర్తించే పంచాయతీ చట్టాన్ని క్లుప్తంగా వివరించడంతోపాటు, హైద్రాబాదు గ్రామ పంచాయతీ చట్టం లోని వివిధ అధ్యాయాల సారాంశాన్ని విశదంగా యిస్తాను. దీనితో పాటు "ఆంధ్రప్రదేశ్ పంచాయతీ సమితి, జిల్లా పరిషత్తుల చట్ట".

క్లుప్తీకరణతో పాటు రానున్న సవరణ చట్టాన్ని కూడా క్లుప్తంగా వివరిస్తాను.

## హైద్రాబాద్ గ్రామ పంచాయతీ చట్టం

### గ్రామ పంచాయతీల నిర్మాణం :

"గ్రామ పంచాయతీ" అన్న పదానికి ఈక్రింది మాటలలో 2వ విభాగం, 12వ ఉపసెక్షన్‌లో నిర్వచనం వుంది: "గ్రామ పంచాయతీ అంటే, ఈచట్టంక్రింద ఏర్పడ్డ గ్రామ పంచాయతీ". ఇదంత పూర్తి నిర్వచనం కాదు. 7, 8, 9 విభాగాలలో కార్పొరేషన్ నిర్మాణం అంటే ఏమిటి, గ్రామ పంచాయతీల నిర్మాణం ఎలా వుండాలన్న విషయమై వివరణ వుంది. గ్రామ పంచాయతీని ప్రతిఒక్క గ్రామమూ ఏర్పర్చుకుంటుంది. కలెక్టరుగాని లేదా ప్రభుత్వం నియమించిన మరో ఉద్యోగిగాని ప్రభుత్వం తరపున నోటిఫై చేసిన తేదీన పంచాయతీ అమలులోకి రావాలి.

3 వ విభాగం క్రింద జారీఅయిన ఉత్తర్వులో స్పష్టంగా పేర్కొన్నట్లు, గ్రామమనే పేరుతో ప్రతి గ్రామ పంచాయతీ ఒక కార్పొరేట్ సంస్థే. సంస్థగా పంచాయతీ రద్దుగావడమంటూ వుండదు. అదొక సమిష్టి స్థానం. భూముల స్వాధీనం, స్థిరచరాస్థి బదలాయింపులు, కాంట్రాక్టులు కుదుర్చుకోవడం వగైరా అవసర విషయాలన్నింటిలోనూ కార్పొరేట్ సంస్థగా పంచాయతీకి దావావేసే అధికారమూ వుంది; పంచాయతీపై ఈ విషయాలలో ఎదురు వ్యాజ్యమూ రావచ్చు.

కలెక్టరుగాని, అందుకు అర్హులైన మరో అధికారిగాని చట్టం ప్రకారం నోటిఫై చేసిన పద్ధతిలో గ్రామ పంచాయతీకి ఎన్నికైన సభ్యులు వుంటారు. గ్రామ పంచాయతీలోని ప్రతిఒక్క నియోజక వర్గానికీ ప్రాతినిధ్యం అనేది ఆ నియోజక వర్గ జనాభాను పట్టివుంటుంది. ఇందుకు, అంతకుముందు తీసుకున్న జనాభా లెక్కలు ప్రాతిపదికగా వుంటాయి. ఎట్టి పరిస్థితుల్లోనూ 12 మందికి మించిగాని లేదా 6 గురికి

తక్కువ గాకుండాగాని గ్రామ పంచాయతీలలోని మొత్తం సభ్యుల సంఖ్య వున్నప్పుడే, ప్రతి 160 మంది జనాభాకు ఒక్క "పంచ్" చొప్పున ప్రాతినిధ్యం అనేది వుంటుంది. షెడ్యూల్డు కులాలు, షెడ్యూల్డు తెగలకు సీట్లను ఆయా కులాల, తెగల జనాభా నిష్పత్తినిబట్టి కలెక్టరు గాని అందుకు తగిన అధికారిగాని నోటీసుద్వారా రిజర్వు చేస్తారు.

## "పంచ్" ఎన్నిక

గత అధికార జనాభా లెక్కలలో వెయ్యిమందికి తక్కువగా కుండా, 5 వేలకు మించకుండా వున్న రెవెన్యూ గ్రామాన్ని ప్రభుత్వం గ్రామంగా ఈచట్టంక్రింద పరిగణిస్తుంది. ఇందుకోసం, ప్రక్క-ప్రక్కలనే వున్న (అంటే భౌగోళిక సామీప్యతవున్న) రెవెన్యూ గ్రామాలను, పై షరతుకు లోబడి, కలిపివేయవచ్చు. గ్రామసభ అనేది ఒకటి వుంటుంది. ఇందులో ఓటర్ల జాబితాలో నమోదైవున్న వారంతా సభ్యులుగా వుంటారు. డిప్యూటీకలెక్టరు గ్రామాన్ని నియోజక వర్గాలుగా విభజిస్తారు. ప్రతి నియోజక వర్గానికి ఎంతమంది "పంచ్" లు వుండాలో నిర్ణయిస్తారు.

అప్పటికి అమలులో వున్న చట్టం ప్రకారం ఓటర్ల జాబితా తయారు చేస్తారు. ఇటువంటి జాబితాను డిప్యూటీ కలెక్టరు ప్రతి గ్రామానికి ఒకటి తయారుచేస్తారు. ఓటర్ల జాబితాలో పేరు నమోదైవున్న ప్రతి వ్యక్తి ఆ నియోజకవర్గంలో ఓటు వేయడానికి అర్హుడు. ప్రతి వ్యక్తి ఒక్క నియోజక వర్గంలో మాత్రమే ఓటు చేయడానికి అర్హుడు. అలాగే ఒకసారి ఓటు చేసిన నియోజకవర్గంలోనే మరోసారి ఓటు చేయరాదు. జైలుశిక్ష వున్న వ్యక్తికి ఓటు చేయడానికి వీలులేదు. మొదటి జనరల్ ఎన్నికను డిప్యూటీ కలెక్టర్ జరిపిస్తారు. ఆ తరువాత జరిగే సాధారణ ఎన్నిక పంచాయతీ ఆఫీసు కాలపరిమితి ఆఖరయేముందు మూడునెలల లోపుగా జరుగుతుంది. ఒకవేళ మధ్యలో అకస్మాత్తుగా "పంచ్" పదవి ఖాళీ అయితే ఆ స్థానానికి ఉప ఎన్నిక వుంటుంది. ఎన్నికలు మామూలుగా రహస్య బ్యాలెట్ ద్వారా జరుగుతాయి. అలాగాక

"గ్రామసభ" సభ్యులలో మూడింట రెండువంతులమంది అంగీకరిస్తే, ఎన్నికలు చేతులు ఎత్తే పద్ధతిద్వారానూ జరుపుకోవచ్చు.

ఒక గ్రామంలోని ఏ నియోజక వర్గంలోని ఓటర్ల జాబితాలో ఓటరుగా నమోదైవున్న వ్యక్తి అయినా ఆ గ్రామంలోని ఏదో ఒక నియోజకవర్గానికి "పంచ్"గా ఎన్నిక గావచ్చు. నైతిక దుర్మార్గంవల్ల జైలు శిక్ష పడ్డవాడుగాని లేదా ఆరునెలలకు పైగా జైలుశిక్ష అనుభవించాల్సి వున్నవాడుగాని ఎన్నుకోబడ్డానికి అనర్హుడు. అయితే, శిక్ష కాలం ముగిసిన తరువాత పైనచెప్పిన అభ్యంతరం కూడా రద్దయిపోతుంది. అలాగే మతి భ్రమించినవాడుగాని, చెవుడూ మూగా వున్నవాడుగాని, కుష్ఠరోగిగాని, ఋణగ్రస్తుడుగాని, అసమర్థుడని పేరుపడ్డవాడుగాని, ప్రభుత్వం స్థానిక బాధ్యతల్లో, లేదా గ్రామ పంచాయతీ క్రిందగాని పనిచేస్తూ ధనార్జన చేస్తున్నవారు గాని ఎన్నిక గావడానికి అర్హులుకారు. గ్రామంలో కాపురం ఉండకుండా వున్నా, లేదా జిల్లాబోర్డు అధ్యక్షుడుగా ఎన్నికైనా, లేదా చెల్లించాల్సిన బకాయీలను చెల్లించకపోయినా, గ్రామ పంచాయతీ సమావేశాలకు వరుసనే మూడుసార్లు గైరుహాజరైనా వ్యక్తికి "పంచ్" హోదా పోతుంది. ఒకవ్యక్తి యోగ్యుడా అయోగ్యుడా అన్నది మున్సిఫ్-మేజిస్ట్రేట్ నిర్ణయిస్తారు. ఒక నియోజక వర్గానికి మించిగాని, లేదా ఒక గ్రామ పంచాయతీకి మించిగాని ఏకకాలంలో సభ్యత్వం వుండే, ఆ చెడుగును నిషేధిస్తూ ఒక నిబంధన వుంది. తుదకు గ్రామ పంచాయతీకి ఎన్నికైన "పంచ్‌ల" పేర్లన్నీ అనుకున్న పద్ధతిలో డిప్యూటీ కలెక్టరు ప్రచురిస్తారు. ఏ ఎన్నికకైనా అభ్యంతరం చెబుతూ పెట్టే ఎన్నిక పిటీషన్‌ను ఏ సభ్యుడైనా సరే ఆ ఎన్నిక సమయంలో మున్సిఫ్ మేజిస్ట్రేటుకు సమర్పించాలి. మున్సిఫ్ నిర్ణయమే తుదినిర్ణయం. ఇంక ఆ నిర్ణయంపై ఏ కోర్టులోనూ ప్రశ్నించడానికి వీలులేదు.

ఈ విధంగా ఎన్నికైన సభ్యుల పదవీకాల పరిమితి మూడు సంవత్సరాలు. వీరి పదవీకాలం గ్రామ పంచాయతీ ప్రథమ సమావేశం ప్రారంభమైనది మొదలు అమలులోకి వస్తుంది. అయితే ఈకాల పరిమితిని ప్రభుత్వం పెంచవచ్చు. అదైనా ఒక సంవత్సరంకన్నా మించ

కూడదు. సర్‌పంచ్, ఉపసర్‌పంచ్‌లను గ్రామ పంచాయతీ ఎన్నుకుం టుంది. పంచాయతీ సభ్యు డెవరైనా తన పదవికి రాజీనామా యివ్వ దలిస్తే, సర్‌పంచ్‌కు లిఖిత పూర్వకమైన నోటీసు యిచ్చి ఆపని చేయాలి. కాని సర్‌పంచ్‌గాని, ఉపసర్‌పంచ్‌గాని డిప్యూటీ కలెక్టర్‌కు నోటీసు యివ్వాలి. ఎటువంటి అవకతవకలైనా పంచాయతీ కార్యకలా పాలను బలహీన పర్చేదిగా వుండేటట్లు చట్టంలో ఒక ప్రత్యేక అంశం వుంది. గ్రామ పంచాయతీ కనీసం నెలకు ఒక్కసారైనా సమా వేశం కావాలి. మొత్తం (పంచ్‌లలో) సగానికి తక్కువగాకుండా వ్రాతపూర్వకంగా కోరుకుంటే, పంచాయతీ ప్రత్యేక సమావేశం జరుపు కోవచ్చు. సమావేశం జరగడానికి సభ్యులలో సగానికి తక్కువ గాకుండా "కోరం" వుండాలి. ఈ షరతు వాయిదా పడ్డ సమావేశా లకు వర్తించదు; అన్ని సమస్యలపైనా మెజారిటీదే నిర్ణయం. అందరికీ సమాన ఓట్లువున్న సందర్భాలలో సమావేశ అధ్యక్షునికి "కాస్టింగ్ ఓటు" వుంటుంది. పంచాయతీ మొదట్లో ఆమోదించిన మూడు నెలల లోపు ఏ రిజర్వేషన్‌నూ మార్చడానికి వీలులేదు. మొత్తం సభ్యులలో మూడింట రెండువంతులమంది బలపర్చిన తీర్మానం ద్వారా మాత్రమే రిజర్వేష న్‌ను మార్చడం సాధ్యపడుతుంది. మినిట్ పుస్తకం కూడా వుండాలి.

## 3. సర్‌పంచ్, ఉపసర్‌పంచ్, ఖార్‌బారీల అధికారాలు, విధులు

(అ) సర్‌పంచ్: సర్‌పంచ్ గ్రామ పంచాయతీ సమావేశా లకు అధ్యక్షత వహిస్తాడు. వాటిని క్రమపద్ధతిలో నడిపిస్తూంటాడు. గ్రామ పంచాయతీ అధీనంలోనే పంచాయతీ రికార్డులను, రిజిష్టర్లను భద్రపరుస్తాడు. అందరి ఉద్యోగుల, పంచాయతీ సేవకుల చర్యలను ఈయన అజమాయిషీ చేస్తాడు, కంట్రోల్ చేస్తాడు. రు 5. ల వరకూ ఎప్పుడైనా ఒక్కదఫామాత్రం అత్యవసర ఖర్చుక్రింద ఖర్చుపెట్టవచ్చు (contingent expenditure). పంచాయతీ నిధికి ఈయనే నిర్వాహ కుడు. గ్రామ పంచాయతీ తరపున వచ్చిన డబ్బు మొత్తాలకు

రశీదులు చెల్లిస్తాడు. గ్రామ పంచాయతీనిధుల పూర్తి భద్రతకు ఈయనే ప్రధాన బాధ్యుడు. ఈ చట్టంక్రింద పంచాయతీ తరఫున అవసరమైన ప్రకటనలను, నివేదికలను ఈయన తయారుచేస్తాడు. ఈ చట్టం ఇతనిపై విధించిన అధికారాలన్నీ ఈయన నిర్వహించాల్సిన నిబంధనలు (రూల్సు).

సర్పంచ్ లేని సమయంలో గ్రామ పంచాయతీ సమావేశాలకు ఉపసర్పంచ్ అధ్యక్షత వహిస్తాడు. సర్పంచ్ నిర్వహించే అధికారాలను, విధులను అప్పుడు ఈయనే నిర్వహిస్తూంటాడు.

(అ) ఖార్బారీ :- ఈ మాటకు చట్టంలోని రెండవ విభాగం, సబ్ సెక్షన్ 14 లో నిర్వచనం యివ్వబడింది. దీనిప్రకారం ఖర్బారీ అంటే చట్టంలోని 43వ విభాగంక్రింద నియమింపబడే ఖర్బారా అన్న మాట. ఈయన్ని కలెక్టరుగాని, గ్రామ పంచాయతీకి సంబంధించిన అధికారిగాని నియమిస్తారు. శిస్తులెక్కలు తదితర ముఖ్యమైన లెక్కలను తయారుచేసి, వాటిని భద్రపర్చడం ఈయన బాధ్యత. పంచాయతీలెక్కలు, రికార్డులను ఈయనే జాగ్రత్త పరుస్తాడు. పంచాయతీలకు రావాల్సిన బాకీలన్నింటిని ఈయనే వసూలు చేస్తాడు. గ్రామ పంచాయతీ చేపట్టిన పనులను నిర్వహించటం వాటికి అజమాయిషీ వహించడం ఈయనదే బాధ్యత. పనులకు సంబంధించిన బిల్లులను ఎస్టిమేట్లను తయారుచేయడం, తనిఖీచ్ఛాడం ఈయన విధి. పంచాయతీ ప్రజారోగ్య కార్యక్రమాలకు, చర్యలకు అజమాయిషీ వహిస్తాడు. గ్రామపంచాయతీ సమావేశా విశేషాలన్నింటిని ఒక్కచోట వ్రాసి, వాటి కాపీలను పై అధికారులకు పంపాలి. పంచాయతీకి బకాయీలు చెల్లించని వారందరికీ ఈయన బిల్లులు, నోటీసులు అందజేస్తారు. గ్రామపంచాయతీ సమావేశాలకు ఈయన హాజరవుతాడు. కాని ఓటు హక్కు ఉండదు. ఏ తీర్మానాన్ని ఈయన ప్రవేశపెట్టరాదు. గ్రామ నేరాలకు సంబంధించిన నివేదికలను పై అధికారులకు పంపడంకూడా ఈయన బాధ్యత. గ్రామ పంచాయతీగాని లేదా ప్రభుత్వం ఆదేశించిన పనులనుకూడా తు.చ. తప్పక ఈయన నిర్వహించాలి. మరోవిధంగా

చెప్పాలంటే ఈయన గ్రామ పంచాయతీ సేవకుడే. ఈయన జీతం పంచాయతీ నిధినుండే చెల్లింపబడుతుంది. "ఖర్బారీ" పదవిని జిల్లాకలెక్టరుగాని లేదా అందుకు తగిన అధికారిగాని అదే జిల్లాలోని ఒక గ్రామ పంచాయితీనుండి మరో పంచాయితీకి బదలాయించవచ్చు. గ్రామపంచాయితీ సిఫార్సుమీద కలెక్టరుగాని, లేదా అందుకు తగిన అధికారిగాని, ఖర్బారీ ఒకవేళ అక్రమ ప్రవర్తనకు దొరకున్నా లేదా తన విధులను నిర్వర్తించడంలో అజాగ్రత్త కనపర్చినా ఆయనపై క్రమశిక్షణాచర్య తీసుకోవచ్చు.

## 4. గ్రామ పంచాయతీ విధులు, నిర్వహణ బాధ్యత, అధికారాలు.

### (అ) తప్పనిసరిగా నిర్వహించాల్సిన బాధ్యతలు :

గ్రామ పంచాయితీ ఆ గ్రామానికి అవసరమైన ఉత్పత్తి కార్యక్రమాన్ని తయారు చేస్తుంది. బంజరుభూములను సాగులోనికి తేవాలి. భూములపై సహకార మేనేజమెంటుకై ఏర్పాట్లు చేస్తుంది. సమిష్టి వ్యవసాయం, పరపతిసంస్థలు, బహుళార్థ సాధక సహకార సంఘాలను నిర్మించడం దాని పనుల్లో ఒకటి. గ్రామంలో భూసంస్కరణకు సంబంధించిన కార్యక్రమాన్ని అమలుజరిపే బాధ్యత దీనికుంది. గిడ్డంగులను, సమిష్టి ధాన్యగారాలను నెలకొల్పి, వాటిని నిర్వహించే బాధ్యతకూడా గ్రామ పంచాయతీలలో ఒకటి. పంచాయతీ, పబ్లిక్ బావులు, చెర్వులు, వగైరా నీటిసప్లయి వనర్లన్నింటినీ నిర్మించి వాటి బాగుచేతలు, నిర్వహణా చూస్తూంటుంది. గ్రామంలోని రోడ్ల నిర్మాణం, వాటి భద్రత, మురుగునీటి పారుదల ఏర్పాట్లు సందుగొందుల్లోని మురుగుకాల్వల శుభ్రంచేసి వాటిని జాగ్రత్తవహించడం, కక్కుసుదొడ్లు వగైరా నిర్మాణం, భవనాలు తినుబండారాల శాలలను క్రమబద్ధంచేయడం, అంటువ్యాధుల వ్యాప్తిని అరికట్టడంతోసహా ప్రజారోగ్యం కాపాడి దానిని అభివృద్ధిచేయడం, ప్రభుత్వభవనాల వాడకాన్ని,

పచ్చికబయళ్ళ వాడకాన్ని నియమబద్ధం చేయడం, చెత్తాచెదారమున్న గుట్టలను తొలగించడం, అనారోగ్యకరంగావున్న చెర్వులు, నీటి గుంటలను శుద్ధిచేయడం వగైరా పనులన్నింటినీ గ్రామ పంచాయితీ విధిగా నెరవేర్చాల్సిన బాధ్యతలలో కొన్ని. వీటికి తోడు పంచాయతీ నిర్వహించాల్సిన తదితర పనులుకూడ వున్నాయి. ఇవి సర్వసాధారణంగా గ్రామ పరిస్థితుల అభివృద్ధికి ఉద్దేశింపబడ్డవి. ఫలితంగా అన్ని సౌకర్యాలతోనూ గ్రామాన్ని నగర స్థాయికి తీసుకురావచ్చు. అయితే గ్రామ పంచాయితీకి చెందిన ఈ అధికారాలుకూడా రక్షింపబడతాయి. వీటికి వ్యతిరేకంగా ఏదో నష్టం జరిగిందనో, పంచాయతీ ఏదో ప్రత్యేక పనికి పూనుకొన్నదనో ఎవరైనా వ్యాజ్యం తెచ్చినా అది నిలవదు.

## (ఆ) అధికారం ఉపయోగించి నిర్వహించాల్సిన విధులు :

ఈ విధులు ప్రధానంగా యాత్రికులకు సౌకర్యాలు కల్పించడం, లేదా వికలాంగులకు బాధానివారణ, గృహపరిశ్రమలను, వ్యాపారాన్ని ప్రోత్సాహించడానికి సంబంధించినవి. అంతేగాదు; పడావుభూములను (fallow lands) సాగులోకితేవడం, ప్రభుత్వ రుణాలు సేకరించడానికి సాయపడ్డం, నర్సరీల నిర్వహణ, కరువు నివారణ లేదా మరో ప్రకృతివైపరీత్యాన్ని ఎదుర్కొనడానికి సహాయం చేయడం, వైద్యసహాయం, మానసిక ఆహ్లాదంకోసం క్లబ్బులను నిర్వహించడం, కళల అభివృద్ధికి థియేటర్ల నిర్వహణ వగైరాలకు సంబంధించినవి. లైబ్రరీలు, పఠనాలయా సౌకర్యాలు పంచాయతీ కల్పించాలి. వివిధ కులాలమధ్య సౌహార్ధం, సాంఘిక ఐక్యతను పెంపొందించే సంస్థలను నెలకొల్పాలి. అస్పృశ్యత, లంచగొండితనాలను తొలగించడమే కాదు, నిర్మూలించాలి. జూదం లిటిగేషన్లపట్ల పౌరులలో ఏహ్యాభావాన్ని కలిగేటట్లు పంచాయతీ ప్రయత్నించాలి. ప్రజల ఆరోగ్యం ప్రజలకు సంబంధించిన వివిధ నైతిక, సాంఘిక, భౌతిక సౌకర్యాలను కల్పించేందుకు దారితీసే ప్రజావసర చర్యలకు పంచాయతీ పూనుకోవాలి,

(ఇ) బదలాయింపు విధులు :

ఈ క్రింది వివరించిన కొన్ని విధులను ప్రభుత్వం అవసరమను కుంటే గ్రామ పంచాయితీకి బదలాయించవచ్చు :—

గ్రామానికి అనుకొనివున్న అడవుల మేనేజిమెంటు, వీటి రక్షణ; బంజర్లు, పచ్చికబయళ్ళు గ్రామకంఠాల మేనేజిమెంటు; భూమిశిస్తు వసూళ్ళు; భూమి వివరములనుతెలిపే రికార్డులు వగైరా భద్రత; సమిష్టిభూముల లేదా ప్రభుత్వాధీనంలోవున్న భూముల లేదా యాజమాన్యపు హక్కు వుండిన్నీ సాగుచేయలేనివారి భూముల సాగుకు సంబంధించిన ఏర్పాట్లను గ్రామ పంచాయతీయే చూడాలి.

ఇవేగాక గ్రామపంచాయతీ, రోడ్లు, వంతెనలు, చెర్వులు వగైరాలపైకూడా అజమాయిషీ వహించాలి. సందుగొందుల పేర్లు సూచించడం, ఇళ్ళ నంబర్లువేసే పనికూడా పంచాయితీకి అప్పగించ బడ్డది. భవనాలు నిర్మించాలన్నా, వీటిని పునర్నిర్మించాలన్నా పంచా యతీ అనుమతి అవసరం. అనుమతికోసం దరఖాస్తు పెట్టుకొన్న తేదీనుండి రెండు నెలల లోపు ఆ దరఖాస్తు అతీగతీ తేలకపోతే, అనుమతి లభించినట్లుగానే భావించవచ్చు. శిధిలావస్తలోవున్న, లేదా శిథిలమైపోయివున్న కట్టడాలను, చెట్లు వగైరాలను ఆ ప్రదేశంనుండి తొలగించే అధికారం పంచాయతీకి వుంది, ఇటుకల బట్టీలకు, తుపాకీ మందు తయారీకి, మందుగుండు సామాగ్రి తయారీకి, హోటళ్ళు పెట్టుకోడానికి, లేదా లాడ్జింగ్ పెట్టుకోడానికి, బార్బరుషాపు పెట్టుకోడానికి వగైరా వివిధ పనులకు లైసెన్సులిచ్చే అధికారంకూడా పంచాయతీకి యివ్వబడింది. గ్రామ పంచాయితీనిధి సహాయంతో నిర్వహింపబడుతున్న ప్రతి పబ్లిక్ సంస్థయొక్క మేనేజిమెంటు, అజమాయిషీ, వాటి పాలనావ్యవహారాలపై అధికారం పంచాయతీదే.

## 5. నేరాల నిరోధన: శాంతిభద్రతల సంరక్షణ

శాంతిభద్రతలను సంరక్షించేందుకు, నేరాలను నిరోధిం చేందుకు తగిన చర్యలు తీసుకోవడానికి ప్రభుత్వం గ్రామ పంచాయ

తీకి అధికార మివ్వవచ్చు. ఇందుకోసం చౌకీదార్లుగా ఒకరిద్దరి సహాయకులలో ఒక కోత్వాల్‌ను నియమించవచ్చు. ఈ పనికోసం వీరికి పంచాయతీ నిధినుండి కొంత ప్రతిఫలం ముట్టుతుంది. ఇందుకు సంబంధించిన మేరకు పంచాయితీ నిధికి ప్రభుత్వం కొంత డబ్బు మంజూరు చేయవచ్చు.

కోత్వాల్ :

ఏదైనా అసాధారణ, అనుమానకరమైన లేదా ఆకస్మిక చావును గూర్చి పోలీసుస్టేషన్‌లో అప్పటికి చార్జీలోవున్న ఆఫీసరుకు కోత్వాల్ తెలుపాల్సివుంది. విచారించదగ్గ నేరాలేమైనావుంటే వాటిని పోలీస్ అధికారికి తెలియజేయాలి. ఒక వ్యక్తిని వారంటులేకుండా అరెస్టు చేసే అధికారం కోత్వాల్‌కు వుంది. న్యాయవిచారణకు చెందిన నేరానికి సంబంధించిన వ్యక్తిని, పేరుమోసిన నేరస్థుణ్ణి, దొంగిలింప బడ్డ ఆస్తివున్నవాణ్ణి, జైలునుండి పారిపోయినవాణ్ణి, సైన్యంనుండిగాని నావికా లేదా విమానదళంనుండిగాని పారిపోయినవాణ్ణికూడా కోత్వాల్ వారంటులేకనే అరెస్టు చేయవచ్చు. తెలుసుకోదగ్గ నేరాలను విరోధిం చేందుకు కోత్వాల్ ప్రయత్నిస్తాడు. రౌడీవర్గాల చర్యలను ఎప్పటి కప్పుడు పై అధికారులకు తెలియపరుస్తూండాలి. గ్రామంలో ఎవరైనా అనుమానితుడు వస్తే ఆ విషయాన్ని, అందుకు సంబంధించిన సమా చారాన్ని కోత్వాల్ మేజిస్ట్రేటుకు అందజేయాలి. అవసరమొస్తే పోలీసులకూ అందజేయాలి. పన్నుగాని, టోల్‌గాని లేదా ఫీజు వసూళ్ళలోగాని అతను సహాయపడాలి.

## 6. పన్నులు

గ్రామపంచాయతీ పనర్లక్రింద పన్నులు, ఫీజులు వస్తాయి. ఈ చట్టంక్రింద వీటిని పంచాయతీ వసూలు చేస్తుంది. ఆస్తిపన్ను, వృత్తిపన్ను, బండ్లపన్ను, స్థిరాస్థిపైపన్ను — ఈ పన్ను లన్నింటినీ గ్రామ పంచాయతీ తప్పనిసరిగా వేయాలి. యాత్రికుల

పన్ను, నీటిపన్ను, వినోదపుపన్ను, పశువులపన్ను, టోల్, నీటి సప్లయిఫీజు, మార్కెట్లు ఆక్రమణఫీజు, చౌదీలు, సరాయిలా ఆక్రమణ ఫీజు, పశువుల కొట్టాన్ని వినియోగించుకున్నందుకు ఫీజు, బండ్ల స్టాండ్‌ఫీజు, మార్కెట్లో విక్రయించబడ్డ పశువుల రిజిస్ట్రేషన్‌ఫీజు ప్రయివేట్ కక్కసుదొడ్ల శుద్ధిఫీజు, వగైరా ప్రత్యేక ఫీజులనుకూడా పంచాయతీ విధిస్తుంది.

ఫలానాపన్ను విధించాలన్న తీర్మానాన్ని గ్రామ పంచాయితీ మూడింట రెండువంతుల మెజారిటీతో ఆమోదించినప్పుడే పన్నులు విధించబడతాయి. ఆమోదించబడ్డ ఈ తీరానాన్ని తగిన పద్ధతిలో ప్రకటిస్తారు. ఒకవేళ ఆ తీర్మానానికి గ్రామపౌరుడు అభ్యంతరం తెలుపుకోదలచుకుంటే అతడా పనిని తీర్మానం ప్రకటింపబడిన తరువాత 30 రోజులలోపు చేయాలి. జిల్లాబోర్డు అనుమతి వచ్చిన తరువాతనే ఈ పన్నులు విధిలపబడతాయి. ఒకవేళ ఏదైనా పన్ను రద్దుచేయాలంటే జిల్లాబోర్డు అనుమతితో పంచాయతీ ప్రత్యేక సమావేశం వేసి ఒక తీర్మానాన్ని ఆమోదించాల్సి వుంటుంది. అలాగే పంచాయతీలోని మూడింట రెండువంతుల సభ్యుల మెజారిటీతో ఏ పన్నునైనా అమలుజరుపకుండా సస్పెండ్ చేయవచ్చు. గ్రామ పంచాయతీ ఆదాయం తగ్గిపోతుందనుకున్నప్పుడు పన్నులను పెంచే అధికారం జిల్లాబోర్డుకు వుంది.

పన్నుల వసూళ్ళకోసం, పన్ను స్వభావం, కాల పరిమితి, ఆస్థి వివరాలు వృత్తి లేదా పన్ను వసూలు కావాల్సిన ఆస్థి, పన్ను చెల్లించని పక్షంలో తీసుకోవాల్సిన చర్యలు వగైరా వివరాలను స్పష్టంగా పేర్కొంటూ ఒకబిల్లు తయారుచేయబడుతుంది. బిల్లును నెలరోజులలో చెల్లించకపోతే డిమాండ్ నోటీసు యిస్తారు. అప్పటికీ 15 రోజులలోపు ఏ సమాధానం లేకపోతే వారంటు పంపుతారు. వారంటు తీసుకువెళ్ళిన ఆఫీసరు వారంటుక్రింద జప్తు చేయడానికి ఇంటికి చెందిన ఏ తలుపునైనా బద్దలుకొట్టి తెరువవచ్చు వంటినిధరించే బట్టలు, వంటసామాగ్రి పరుపులు ఆభరణాలు, వ్యవసాయ పనిముట్లు, ఎత్తనం ధాన్యం, పశు

వులనుగాని జప్తుచేయరు. త్వరలో స్వతస్సిద్ధంగా శిధిలమైపోయే ఆస్తిని మాత్రం వెంటనే అమ్మేస్తారు. డబ్బు చెల్లింపుకు సంబంధించిన బిల్లుకు వ్యతిరేకంగా, అది పంపబడ్డ 30 రోజులలోపు, మున్సిఫ్-మేజస్ట్రేట్‌కు అప్పీలు చేసుకోవచ్చు. ఆరు సంవత్సరాలు గడచిన తరువాత యింకా బకాయివున్న సొమ్మును రాబట్టుకోడానికి ఏ రకమైన జప్తూ చేయబడదు. పన్ను బకాయీలుగాని, లేదా మరే రకమైన బకాయిలనుగాని అవి భూమి శిస్తు బకాయిల మాదిరే వసూలు చేయవచ్చు. వసూలుకాని పన్నులను, ఫీజును రద్దుచేయవచ్చు.

## 7 పంచాయతీలపై అజమాయిషీ

గ్రామ పంచాయతీపై కలెక్టరుకుగాని, జిల్లాబోర్డు అధ్యక్షులు, జిల్లా పంచాయతీ ఆఫీసరు, డిప్యూటీ కలెక్టరు, తహశీల్దారు లేదా అందుకు నియమితులైన యితర ఆఫీసరుకుగాని సాధారణ అజమాయిషీ అధికారాలు యివ్వబడ్డాయి. అత్యవసర పరిస్థితుల్లో పనులు వెంట వెంటనే జరిగేటట్లు చూడ్డానికి కలెక్టరుకు ప్రత్యేకాధికారా లున్నాయి. గ్రామ పంచాయతీని రద్దుచేసే అధికారం, పునర్నిర్మించే అధికారమూ ప్రభుత్వానికి వుంది. రెండు లేదా అంతకు మించిన గ్రామ పంచాయతీల మధ్య ఏవైనా తగాదాలువస్తే, వాటిపై తీర్పు చెప్పడానికి జిల్లాబోర్డు తగినది. జిల్లాబోర్డు నిర్ణయం తుదినిర్ణయం. వివిధ జిల్లాల్లో గ్రామ పంచాయతీలకు తగాదాలుంటే ఆ విషయమై ప్రభుత్వంగాని అందుకు సంబంధించి ప్రభుత్వం నియమించే అధికారిగాని తీర్పు చెపుతారు. జిల్లా పంచాయతీ ఆఫీసరు, పంచాయతీ ఇన్స్పెక్టరులాంటి అధికారులను కూడా ప్రభుత్వమే నియమిస్తుంది. ఈ చట్టంక్రింద ప్రభుత్వం కొన్ని విషయాలలో నిబంధనలు తయారుచేసేందుకు అందుకు సంబంధించిన ఉద్యోగుల అధికారాలనుతప్ప, ఇతరత్రా అధికారాలను తన తరఫున మరొకరికి బదలాయించవచ్చు. గ్రామ పంచాయతీ ఉత్తర్వులపై ఆయా ఉత్తర్వుల స్వభావాన్నిబట్టి, జిల్లా మేజిస్ట్రేటుకుగాని తహశీల్దారుకుగాని అప్పీలు చేసుకోవచ్చు. పునఃపరిశీలించే అధికారంకూడా ప్రభు

త్వానికి వుంది. అంతేగాదు; పంచాయతీ వ్యవహారాలనుగూర్చి, లేదా పంచాయతీ ఉత్తర్వులు సబబుగా వున్నాయా లేదా, న్యాయంగావున్నాయా లేదా మున్నగు విషయాలపై సంజాయిషీ అడిగే అధికారమూ రికార్డులను పరిశీలించే హక్కు ప్రభుత్వానికివుంది. 33 తరహాల వివిధ అంశాలపై నిబంధనలు తయారుచేసే అధికారం ప్రభుత్వానికి వుంది.

## 8. నేరాలు, శిక్షలు

గ్రామ పంచాయతీ పనికి ఆటంకం కల్పించినవారు శిక్షార్హులు పంచాయతీ అనుమతి లేకుండా భవనాలు నిర్మించినా, పునర్నిర్మించిన అది నేరమే. లేదా అనుమతి పరిస్థితులకు విరుద్ధంగా వ్యవహరించిన వ్యక్తి నేరం రుజువైన తరువాత రు. 100 లు జరిమానా చెల్లించుకో వాలి. వీధుల పేర్లనుగాని, ఇళ్ళ నంబర్లనుగాని చెరిపినవారు శిక్షార్హులు రోడ్లపైగాని, మురుగుకాల్వల్లోగాని చెత్తాచెదారం జిమ్మినవారు శిక్షార్హులు. ఉత్తర్వులను ధిక్కరించినా శిక్షింపబడతారు, గ్రామపంచాయతీ గాని లేదా అందుకు నియమితులైన వ్యక్తిగాని ఫిర్యాదు చేసినప్పుడే నేరాన్ని గుర్తించడం జరుగుతుంది. సమిష్టినేరాలకు చెందిన ఫిర్యాదుల కూడా చేయవచ్చు.

## 9. రాజీ

న్యాయ పంచాయతీలు ఏర్పడినచోటల్లా సర్‌పంచ్, ఇద్దరు పంచ్‌లతో ఒక రాజీ (కన్సీలియేషన్) సంఘాన్ని నియమించడానికి వీలుగా చట్టంలో ఒక అంశం చేర్చబడింది. ఈ సంఘంలో తగాదాకు చెందిన పక్షాలు ఒక్కో పంచ్‌ను ఎన్నుకుంటారు. తగాదా పార్టీలు న్యాయ పంచాయతీ వద్దకు తీర్పుకు వెళ్ళబోయేముందుకూడా రాజీ సంఘంవద్దకు వెళ్ళాల్సి వుంటుంది. ఈ రాజీ సంఘ చర్చలు వాచా తప్ప వ్రాతమూలకంగా వుండవు. నిరవధికంగా సాగుతూంటాయి విచారణసమయంలో సాక్షులనుకూడా పరిశీలిస్తారు. అయితే వీరిసాక్ష్య రికార్డుకాదు. ఒకవేళ తగాదా పార్టీలమధ్య రాజీ కుదిరితే, అప్పుడు

5

దీనిని వ్రాతబద్ధం చేస్తారు. అటువంటి రాజీని న్యాయపంచాయితీ డిక్రీ గానే పరిగణిస్తారు.

## 10. న్యాయ పంచాయతీలు

న్యాయపంచాయతీ అంటే, ఈ చట్టం క్రిందఏర్పడే న్యాయ పంచాయతీ అనిఅర్థం. క్రిమినల్, సివిల్ న్యాయపరిపాలనా నిర్వహణకై ప్రభుత్వం వాటిని ఏర్పరుస్తుంది. ప్రతీ గ్రామమూ అయిదుగురు సభ్యులను న్యాయ పంచ్‌లుగా యెన్నుకుంటుంది. వీరు ఆ గ్రామ నివాసులై వుండాలి చదవనూ, వ్రాయనూ నేర్చి వుండాలి. గ్రామ పంచాయతీ సభ్యులై వుంతరాదు. న్యాయ పంచ్‌లు ఒక "ప్రధాను"ణ్ణి ఎన్నుకుంటారు, ఒక ఉపప్రధానుణ్ణి ఎన్నుకుంటారు. వీరు న్యాయ పంచాయతీ చర్యావివరాలను రికార్డు చేస్తారు. సాధారణంగా ఈ పంచాయతీ ఆఫీసు కాలపరిమితి మూడు సంవత్సరాలుంటుంది. ప్రతీ పంచ్ పదవీ స్వీకారంచేస్తాడు. న్యాయ పంచాయతీకికూడా ప్రత్యేకమైన సీలు వుంటుంది. ప్రతీ కేసు విచారణలోనూ "ప్రధాన్" అయిదుగురు న్యాయ పంచ్‌లతో ఒక బెంచ్ ఏర్పాటు చేస్తాడు. వీరిలో ఒకరు సాక్ష్యాలను రికార్డు చేస్తూంటారు. శాంతి భద్రతల బాధ్యతకూడా న్యాయపంచాయతీకి వుంది. ప్రతి పంచాయతీ 100 రూపాయలకు మించకుండా జరిమానా విధించవచ్చు. కాని జైలు శిక్ష విధించరాదు. ఫిర్యాదికి నష్ట పరిహారంకూడా చెల్లించవచ్చు. తుచ్ఛమైన కేసుల విషయంలో నేరస్థులుకూడా నష్టపరిహారం పొందడానికి అర్హులే. తగిన బుద్ధిచెప్పిన తరువాతగాని, కొంతకాలంపాటు సత్ప్రవర్తన చూపిన తరువాతగాని న్యాయపంచాయతీ నేరస్తుణ్ణి వదలివేయవచ్చు. చిక్కైనవి, ప్రధానమైన విషయాలను మున్సిఫ్-మేజిస్ట్రేటుకు నివేదించవచ్చు. రెవెన్యూ వ్యవహారాలను పరిశీలించే అధికారంకూడా న్యాయ పంచాయతీకి వుంది. సాక్షులకు సమన్లు జారీ చేయవచ్చు. న్యాయ పంచాయతీ ధృవపర్చిన నేరానికి వ్యతిరేకంగా అప్పీలుచేసుకునే అధికారం లేదు. న్యాయపంచాయతీ ఆమోదించిన "డిక్రీ" కూడా అమలు జరుపవచ్చు.

# ఆంధ్రలో పంచాయతీ

ఆంధ్ర ప్రాంతంలోని పంచాయతీలు 1950 నాటి మద్రాసు గ్రామపంచాయతీల చట్టాన్ని అనుసరించి నడుస్తున్నాయి. ఈ చట్టం ఆంధ్రరాష్ట్రానికి వర్తింపజేయబడింది. ఈ చట్టంయొక్క లక్ష్యం దాని ఆముఖంలోనే తెల్పినట్లు, పంచాయతీద్వారా గ్రామ పరిపాలనకు మంచి అవకాశాలను కల్పించడం. "గ్రామ వ్యవహారాలు" అన్న పదం చాల బృహత్తరమైన అర్థంగలది. ఈ వ్యవహారాలు చట్టంలోని 51 నుండి 61 వరకుగల సెక్షన్లలో వివరించబడ్డాయి. ఈ చట్టం అయిదు అధ్యాయాలలో వుంది. మొదటి అధ్యాయంలో రెండు సెక్షన్లువున్నాయి. ఈ అధ్యాయం ప్రధానంగా 27 సాంకేతిక పదాలకు చెందిన నిర్వచనాలను గూర్చి పరిశీలిస్తుంది. రెండో అధ్యాయంలో 3 నుండి 49 సెక్షన్లు వున్నాయి. ఇది పంచాయతీ రాజ్యాంగమూ, దాని అధికారాలను గూర్చి చర్చిస్తుంది. పంచాయితీ కమిటీల ఎన్నికల విధానాన్నిగూర్చి ఈ అధ్యాయంలో వివరణవుంటుంది. పంచాయతీక్రింద నియమింపబడే వివిధ ఉద్యోగుల నియామకానికి సంబంధించిన అంశాలుకూడా వున్నాయి. మూడవఅధ్యాయంలో 50 నుండి 62 సెక్షన్లు వున్నాయి, ఈ అధ్యాయంలో ప్రధానంగా పంచాయితీ విధులు, అధికారాలనుగూర్చిన వివరణ వుంటుంది. పంచాయితీ విధించే పన్నులు, ఆర్థిక విషయాలను గూర్చి నాల్గవ అధ్యాయంలో వివరణవుంది. ఈ అధ్యాయంలో 63 నుండి 76 వరకు సెక్షన్లు వున్నాయి. అయిదవ అధ్యాయంలో 77 వ సెక్షన్‌నుంచి 138 వరకు వున్నాయి. ఈ అధ్యాయం "ప్రజారోగ్య భద్రతా సౌకర్యం" అన్న శీర్షికక్రింద వుంది. ప్రజా నీటిసరఫరాను గూర్చిన చర్చతోపాటు ఈ అధ్యాయంలో మార్కెట్లు, లైసెన్సులు, నేరాలు, వివాదాలపై నిర్ణయాలు వగైరా విషయాలకు సంబంధించిన అంశాలుకూడా వున్నాయి, ఈ చట్టంలో ఇవిగాక మూడు షెడ్యూళ్ళు వున్నాయి. మొదటి షెడ్యూల్‌లో సాధారణ పెనాల్టీలనుగూర్చి, రెండవ

షెడ్యూల్‌లో నేరాలను కొనసాగిస్తూనేవున్నందుకు పెనాల్టీలను గూర్చి. మూడవ షెడ్యూల్‌లో పరివర్తనదశకు సంబంధించిన అంశాలను గూర్చిన ప్రస్తావనవుంది. వివిధ సెక్షన్లక్రింద నిబంధనలు (రూల్స్) రూపొందింపబడ్డం ఈ పంచాయితీ చట్టంలోని ప్రత్యేక విశేషం. అసలు ఆంధ్ర పంచాయితీచట్టం ప్రధానంగా నిబంధనలమయమేనా అన్నట్లుగా ఈచట్టం వుంది. పైన తెల్పిన వివిధ అంశాలను గూర్చిన వివరణను ఈక్రింద యిస్తున్నాం.

## పంచాయితీ రాజ్యాంగం, ప్రభుత్వం, కంట్రోలు.

పైనతెలిపిన అధికారాలను నిర్వహించడానికి ప్రభుత్వంచే నియమింపబడే స్థానిక పరిపాలనా పోలీసు ఇన్స్పెక్టర్ జనరల్‌గాని లేదా అందుకు సంబంధించిన అధికారిగాని ఒకానొక రెవెన్యూ తాలూకాలోని ఏ భాగాన్నైనాసరే ఈచట్టంక్రింద "గ్రామం"గా ప్రకటించవచ్చు. ఈ చట్టంక్రింద ప్రతి గ్రామానికి ఒక పంచాయతీ ఏర్పడుతుంది. ఇతరత్రా పొందుపర్చబడకపోతే, ప్రతి గ్రామ పరిపాలనా పంచాయతీకి అప్పగించబడుతుంది. ప్రతి పంచాయతీ గ్రామంపేరుతో ఒక కార్పొరేట్ సంస్థగా వ్యవహరిస్తుంది. సంస్థగా పంచాయితీ అంతమొందటమంటూ వుండదు. సమిష్టిస్థానంగా వుంటుంది. అది దావా వేయవచ్చు. దానిపైన ఎవరైనా దావాతేవచ్చు. ఆస్తిని స్వాధీనపర్చుకోవచ్చు; లేదా పంచాయితీ ఆస్తిపాస్తులను బదలాయించవచ్చు. కాంట్రాక్టులు కుదుర్చుకోనూవచ్చు ఏకార్యాలకైతే అది ఏర్పడిందో అందుకు తగిన అత్యవసరమైన పనులన్నింటినీ పంచాయతీ చేయవచ్చు. రెండురకాల పంచాయితీలున్నాయి. ఒకటోతరగతి పంచాయితీ : 5 వేల లోపు జనాభాపై దానికి హక్కులు, బాధ్యతలూ వుంటాయి. ఈరకం పంచాయితీకి సాంవత్సరిక ఆదాయం రు. 10 వేలకు తగ్గకూడదు. మిగతావి రెండోరకం పంచాయతీక్రిందకు వస్తాయి. పంచాయతీ సభ్యు లెంతమంది వుండాలన్న విషయమై ఇన్స్పెక్టర్ నోటిఫై చేస్తాడు. జనాభానుబట్టి సభ్యుల సంఖ్య 6 నుండి 12 వరకూ వుంటుంది. గ్రామంలోని జనా

భాను బట్టి షెడ్యూల్డ్ తరగతులకు సీట్ల రిజర్వేషన్ వుండాలని చట్టంలో 25వ నిబంధనవుంది. గ్రామాన్ని వార్డులుగా విభజిస్తారు. ఆ యా వార్డులకు స్థానాలను ఎన్నికచేస్తారు. సాధారణంగా పంచాయతీ ఆఫీసు కాలపరిమితి మూడు సంవత్సరాలుంటుంది స్త్రీ సభ్యురాలిని కో - అప్ట్ చేసేటందుకు వీలుకల్పిస్తూ ఒక అంశంవుంది. పంచాయతీల ఎన్నికకై ఎన్నికల పట్టీలు తయారుచేస్తారు. ప్రభుత్వ ఉద్యోగులుగాని, గ్రామోద్యోలుగాని పంచాయతీ సభ్యులుగా వుండకూడదు. పంచాయతీకి ఎన్నికైన అధ్యక్షుడుంటాడు, ఒక ఉపాధ్యక్షుడుంటాడు. పంచాయతీ అధ్యక్షుని విధులేమిటో సెక్షన్ 24 లో యివ్వబడ్డాయి. ఉపాధ్యక్షుని ఎన్నికకు ఏర్పాట్లుచేయడం, పంచాయతీ సమావేశాలు జరపడం, రికార్డులన్నింటుతోనూ పూర్తి సంబంధాలు కలిగివుండడం, అన్నినిధులను పూర్తిగా నిర్వహించదం, ఈచట్టంవల్ల పంచాయతీ ప్రత్యేకంగా విధించిన లేదా వుంచిన అధికారాలను నిర్వర్తించడం — ఇవన్నీ అధ్యక్షుని విధులు. అధ్యక్ష, ఉపాధ్యక్షులు, లేదా పంచాయతీ సభ్యులు గాని ఎవరూ జీతం రూపంలోగాని. చేసిన కృషికి ప్రతిఫలంగాని పంచాయతీ నిధులనుండి డబ్బు తీసుకోడానికి అర్హులు కారు. పంచాయతీకి సంబంధించినంతవరకు ఎగ్జిక్యూటివ్ ఆఫీసరు ముఖ్యాధికారి.

పంచాయతీ సమావేశాలకు హాజరై, చర్చలలో పాల్గొనడానికి ఆయనకు హక్కువుంది. పంచాయతీ ఆమోదించిన తీర్మానాలను ఈయన ఆచరణలో పెడతారు. పంచాయతీ ఆఫీసర్ల, సేవకులపై ఈయన అజమాయిషీవహిస్తారు. ఈచట్టం తనపై విధించిన లేదా వుంచిన తదితర విధులను నిర్వహించి అధికారాలను వినియోగిస్తారు. పంచాయతీ సమావేశాలకు అధ్యక్షుడే అధ్యక్షత వహిస్తారు, పంచాయతీ మినిట్లను ఇన్‌స్పెక్టర్‌కు అందజేస్తారు, అత్యవసర పరిస్థితులలో పంచాయతీ తీర్మానాలను కలెక్టరు నిలిపివేయవచ్చు. పంచాయతీని రద్దుచేసి, మరొక కొత్తపంచాయతీని ఎన్నికచేయడానికి ప్రభుత్వానికి హక్కువుంది. అయితే పంచాయతీ తగువిధంగా విధులను నిర్వహించడంలేదని ప్రభుత్వం భావించినప్పుడు మాత్రమే యిది చెల్లుతుంది.

## 2. పంచాయతీల విధులు, అధికారాలు, ఆస్తిపాస్తులు.

పంచాయతీలకు కొన్ని తప్పనిసరిగా నిర్వహించాల్సిన విధులూ, మిగతావి ఆయా అవసరాలనుబట్టి అధికారాన్ని ఉపయోగించి నిర్వహించే విధులూ వుంటాయి. తప్పనిసరిగా నిర్వహించాల్సిన విధులేమిటో సెక్షన్ 50 లో పేర్కొనబడివుంది. గ్రామంలో పబ్లిక్ దొడ్ల నిర్మాణం, వాటిబాగుచేతలు, వాటి నిర్వహణ, వంతెనలు. చిన్న చిన్న వంతెనలు, రోడ్డుడాములు, కాలిబాటలు నిర్మించడం, బాగుచేయడం, పబ్లిక్‌రోడ్లు, పబ్లిక్ స్థలాలలో లైట్లు వేయడం. మురుగుకాల్వలు త్రవ్వించడం, సందుగొందులను శుభ్రంచేయడం, రబ్బిష్ గుట్టలను ఊరవతలకు తోలడం, గ్రామాని కవసరమైన తదితర ఆరోగ్యాభివృద్ధి పనులు, పబ్లిక్ కక్కుసుదొడ్లు శవదహనాలకు స్మశానవాటికలకు ప్రత్యేకస్థలాలను కేటాయించడం, బావుల త్రవ్వకం, వాటి బాగుచేతలు గుంటలు, చెర్వులు త్రవ్వించడం, వాటి నిర్వాహణ, వాటర్‌వర్క్స నిర్మాణం, వాటినిర్వహణ; అంటువ్యాధులు రాకుండా నిరోధక చర్యలు తీసుకోవడం — ఇవన్నీ పంచాయతీ తప్పనిసరిగా నిర్వహించాల్సిన విధులు.

సెక్షన్ 51 క్రింద పంచాయతీ ఈక్రింది విధులను నిర్వహించాల్సివుంటుంది:- పబ్లిక్ రోడ్లప్రక్కన చెట్లునాటుట, వాటిని భద్రపర్చడం, మార్కెట్లు ఏర్పర్చి, వాటిని నిర్వహించడం, సంతలు, ప్రదర్శనల నిర్వహణ, పబ్లిక్ కసాయిదుకాణాలు ఏర్పరచడం, వాటి నిర్వహణ, సత్రవ నిర్మాణం, దానిభద్రత; జననమరణాల రిజిస్ట్రేషన్; గృహపరిశ్రమలకు ప్రోత్సాహమివ్వడం: ప్రాథమిక పాఠశాలలు ఏర్పాటు, వాటినిర్వహణ; పఠనమందిరాలు, లైబ్రరీలు ఏర్పర్చడం; రేడియో ఏర్పర్చడం, ఆటస్థలాలు, ఆటక్లబ్బులు, వ్యాయామకేంద్రాల నిర్మాణం, చికిత్సాలయాల నిర్మాణం, వాటి నిర్వాహణ; ప్రసూతి, శిశుకేంద్రాల ఏర్పాటు, ప్రజల ఆరోగ్యాభివృద్ధికి దోహదంచేసే ఇతరచర్యలు, గ్రామప్రజల సౌకర్యార్థం ఇతరత్రా పనులు — ఇవన్నీ పంచాయతీ ఆయా అవసరాలనుబట్టి నిర్వహిస్తూవుంటుంది. రిజర్వుకావి

అడవులు పంచాయతీ క్రిందనే వుంటాయి, ధర్మాదాయ ఈనాములు పంచాయతీకి బదలాయిస్తారు. గ్రామం ఇర్రిగేషన్ పనుల రక్షణ, వాటి నిర్వహణబాధ్యతను ప్రభుత్వం పంచాయతీకి బదలాయించవచ్చు. స్థిరాస్థిని స్వాధీనం చేసుకునేహక్కు కూడా పంచాయతీకి వుంటుంది.

## 3. పన్నులు: ద్రవ్యమూ

గ్రామంలో ఇంటిపన్ను, వృత్తిపన్ను విధించడానికి పంచాయతీకి హక్కు వుంది. బళ్ళ పన్నునుకూడా విధించవచ్చు. బదలాయించడానికి వీలున్న ఆస్తిపైకూడా పంచాయతీ సుంకం విధించవచ్చు. వ్యవసాయపు భూమిపై పన్ను, వాణిజ్య పంటలపై పన్ను విధించవచ్చు. ఏ పన్నునైనా, లేదా ఫీజునైనా పంచాయతీ కొట్టివేయవచ్చు.

పంచాయతీకి వచ్చే డబ్బు అంతా నిధిగా వుంటుంది. "దానిని పంచాయతీ నిధి" అంటారు. చట్ట ప్రకారం ఈ నిధి అమలు జరుగుతుంది; విడుదలవుతూ వుంటుంది.

పంచాయతీకి అందుకు సంబంధించిన సరైన రశీదులు, ఖర్చు చూపించి ఎగ్జిక్యూటివ్ అధికారి బడ్జెట్‌ను తయారు చేస్తారు. పంచాయతీ ఈ బడ్జెట్‌ను చర్చించి ఆమోదిస్తుంది. అవసరమైతే మార్పులు చేస్తుంది. పంచాయతీ ఎక్కౌంట్లను ఆడిట్‌చేయడానికి ప్రభుత్వం ఆడిటర్లను నియమిస్తుంది.

## 4. ప్రజారక్షణ, రాకపోకలు, సంపద

గ్రామంలోని నీటికాల్వలు, జలాశయాలు, చెర్వులు, బోదెలు, బావులు, తదితర వాటర్‌వర్క్సుపైన పంచాయతీకి అధికారాలున్నాయి. ప్రజారోగ్యం, ప్రజారక్షణ, రాకపోకలకు అవసరమైన ఏర్పాట్లన్నింటినీ పంచాయతీ చేస్తుంది. ఒక మసీదువద్దగాని, దేవాలయం, మఠాలువద్దగాని లేదా మరో మత ప్రాధాన్యతగల స్థలంవద్దగాని ప్రదర్శనలు, ఉత్సవాలు లేదా తదితర కార్యాలకు పంచాయతీ ఏర్పాట్లుచేసి పెడుతుంది పబ్లిక్ మార్కెట్ క్రింద పంచాయతీ కొంత స్థలాన్ని

వదలుతుంది. అటువంటి మార్కెట్‌ను వినియోగించుకున్నందుకు గాని, లేదా ఆ మార్కెట్‌లో సరుకులను అమ్ముకున్నందుకుగాని పంచాయతీ ఫీజు వసూలు చేయవచ్చు. అలాగే ఆ మార్కెట్‌లో షాపులు, స్టాక్స్, గుడారాలు, స్టాండులు ఏర్పర్చుకున్నందుకుకూడా ఫీజును వసూలు చేయవచ్చు. అటువంటి మార్కెట్టుకు సరుకులు గొనివచ్చే బళ్ళపైన, లేదా పశువులపైనగాని ఫీజు వసూలుచేయవచ్చు. మార్కెట్‌లో అమ్మకానికి తోలుకొచ్చిన పశువులపైగాని, అమ్మివేసిన పశువులపైగాని ఫీజు విధించవచ్చు. లేదా వసూలు చేయవచ్చు. బ్రోకర్లు, కమీషన్ ఏజెంట్లు, మోతకూలీలపైన లైసెన్సుఫీజు వసూలు చేయవచ్చు.

కసాయి దుకాణాలకోసమని ప్రత్యేక స్థలాలను కేటాయించి, ఆ స్థలాలపై అద్దె వసూలుచేసి, వాటిని వినియోగించుకున్నందుకు ఫీజును విధించడానికి పంచాయతీ కమిటీకి అధికారం వుంది. ఒక ఫ్యాక్టరీగాని, వర్కుషాపుగాని, లేదా ఒక పనిప్రాంతాన్నిగాని ఏర్పాటుచేయడానికి వ్యక్తులకు అధికారం లేదు. అలా ఏర్పర్చు కోవాలంటే పంచాయతీ అనుమతి అవసరం.

నేరం జరిగిన మూడు నెలలలోపు పోలీసులుగాని, ఎగ్జిక్యూటివ్ అధికారిగాని లేదా ఒక వ్యక్తిగాని గనుక ఎటువంటి ఫిర్యాదూ చేయక పోతే, ప్రాసిక్యూషన్ వుండదు. ఎగ్జిక్యూటివ్ అధికారం, ఈ చట్టంక్రింద లేదా ఏ నిబంధన లేదా ఉపనిబంధన క్రిందనైనాసరే పరిస్థితినిబట్టి రాజీ కుదర్చవచ్చు. పంచాయతీ అధ్యక్షుణ్ణిగాని, ఎగ్జిక్యూటివ్ అధికారినిగాని, లేదా పంచాయతీ సభ్యుణ్ణిగాని ప్రాసిక్యూట్ చేయరాదు. ప్రభుత్వం వద్దనుండి అంతకుముందే ఏదైనా అనుమతివుంటేతప్ప, అటువంటి నేరంపై కోర్టు, విచారించదు. అధ్యక్షునిపైగాని, ఎగ్జిక్యూటివ్ అధికారిపైగాని లేదా సభ్యుడిపైగాని ఆఫీసరుపైగాని, పంచాయతీ ఉద్యోగిపైగాని, వారిపై తీసుకునే చర్యకుగల కారణాలను పేర్కొంటూ లిఖితపూర్వకమైన నోటీసు యిచ్చిన రెండు నెలల పూర్తయేంతవరకూ దావాగాని, లేదా తదితర న్యాయవిచారణకుగాని పూనుకోరాదు. ఆ నోటీసులో తీసుకోవాల్సిన చర్యనుగూర్చి, ఎంత

నష్టపరిహారం చెల్లించాలో మున్నగు విషయాలనుగూర్చి వుంటుంది. చట్టాలకు, నిబంధనలకు, ఉపనిబంధనలకు విరుద్ధంగా వ్యవహరిస్తే అందుకు పెనాలిటీ విధించేందుకు వీలుకల్పించే అనేక అంశాలు చట్టంలో వున్నాయి. పంచాయతీలమధ్య లేదా తదితర అనేక స్థానిక అధికారులమధ్య ఈ చట్టంలోని అంశాలకిర్రింద ఏ విషయం పైనైనా వివాదం తలెత్తితే, దానిపై ప్రభుత్వమే తీర్పు యివ్వవచ్చు. లేదా విచారణకు నివేదించవచ్చు. మధ్యవర్తికి రిపోర్టు చేయవచ్చు. ఈ చట్టంలోని అంశాలను సక్రమంగా అమలుపర్చడంలో ఏదైనా చిక్కు ఏర్పడ్డా, లేదా పంచాయతీ నిర్మాణంగాని పంచాయతీ పున్నర్నిర్మాణ విషయంలోగాని ఏదైనా చిక్కు ఏర్పడ్డా, ఆ చిక్కులను తొలగించడానికి అవసరమని తోచిన చర్యను తీసుకోడానికి ప్రభుత్వానికి హక్కును దఖలుపరుస్తూ చట్టంలో ఒక అంశం వుంది.

## ఆంధ్రప్రదేశ్ గ్రామ పంచాయతీ బిల్లు

ఆంధ్రప్రదేశ్‌లోని పంచాయతీలు గ్రామ వ్యవహారాల నిర్వహణకు సంబంధించిన చట్టాన్ని స్థిరంచేసి సవరించే ఉద్దేశంతోనే 1959 అక్టోబర్ 8న ఆంధ్రప్రదేశ్ అసాధారణ గెజెట్‌లో ఒక బిల్లు ప్రకటించబడింది. ఈ బిల్లులో 9 అధ్యాయాలున్నాయి. ఆరు షెడ్యూళ్ళు వున్నాయి. ఈ అధ్యాయాలలో ఆంధ్రప్రదేశ్ పంచాయతీ చట్టం, హైద్రాబాద్ గ్రామ పంచాయతీ చట్టంలోవున్న అంశాలన్నీ వున్నాయి. వీటన్నింటినీ తగిన రీతిలో ఒక్కచోట అమర్చడం జరిగింది. ప్రథమ అధ్యాయంలో ప్రధానంగా 33 సాంకేతిక పదాలను గూర్చిన ప్రస్తావన వుంది. రెండో అధ్యాయంలో 3 నుండి 51వరకు సెక్షన్లు ఉన్నాయి. వీటిలో పంచాయతీల నిర్మాణం. ప్రభుత్వం అజమాయిషీ అధికారాలను గూర్చి పరిశీలన వుంది.

ఆంధ్రపంచాయతీ చట్టంలో నిర్దేశించిన ప్రాతిపదికమీదనే ఈ బిల్లులోకూడా పంచాయతీల నిర్మాణానికి తగ్గ అంశాలను పొందుపర్చారు. గ్రామ జనాభానుబట్టి, పంచాయతీ సభ్యుల సంఖ్య

6 నుండి 16 వరకూ వుంటుంది. పంచాయతీ సభ్యుల అధ్యక్ష, ఉపాధ్యక్షుల ఎన్నిక పద్ధతులుకూడా వివరించబడి వున్నాయి. పంచాయతీ రద్దుకు వీలుకల్పించే అంశంతోపాటు, అధ్యక్ష, ఉపాధ్యక్షులపై విశ్వాసరాహిత్య తీర్మానం ప్రతిపాదించడానికి వీలుకల్పించే అంశం కూడా వుంది. మూడో అధ్యాయంలో 52 నుండి 64 సెక్షన్ వరకూ వున్నాయి. ఈ సెక్షన్లు పంచాయతీల అధికారాలు, విధులూ, ఆస్తిపాస్తులనుగూర్చి చర్చిస్తాయి. ఈ అధ్యాయంలోని విషయమూ ఆంధ్ర పంచాయతీ చట్టంలో రూపొందించిన విషయమూ దాదాపు ఒకటే. కాకపోతే ప్రస్తుత పరిస్థితుల కనుగుణంగా కొద్దిపాటి మార్పులుమాత్రం ఈ బిల్లులో వున్నాయి. 65 నుండి 80 వరకు వున్న సెక్షన్లుగలది నాల్గవ అధ్యాయం. పంచాయతీల పన్నులు, ద్రవ్య వ్యవహారాలనుగూర్చిన వివరణ యిందులో వుంది. అక్టార్రియి (గేటువద్ద పుచ్చుకునే పన్ను) పన్ను ఈ బిల్లులో కొత్త అంశం. ఇంటి పన్ను, వృత్తిపన్ను, బళ్ళపన్ను వగైరాలతో దీనినికూడా పంచాయతీలు వసూలు చేస్తాయి. ఈ కొత్తపన్ను ఆంధ్ర పంచాయతీ చట్టం, తెలంగాణా గ్రామ పంచాయతీ చట్టాలలోనూ వుంది. మిగతా అంశాలన్నీ పై చట్టంలో ఉదహరించినవే. అయిదవ అధ్యాయం 124 సెక్షన్ వరకూ వుంది. ఇందులో ప్రధానంగా ఆంధ్ర పంచాయతీ చట్టం ఆధారంగా ప్రజారక్షణ సౌకర్యం, సంపదలను గూర్చిన ప్రస్తావన వుంది. ఆరవ అధ్యాయం 125 నుండి 144వ సెక్షన్ వరకూ వుంది. ఇళ్ళ నంబర్లు, లైసెన్సులు యివ్వడం, ప్రాసిక్యూషన్లు. పంచాయితీలకు, వాటి ఉద్యోగులకు కల్పించాల్సిన సౌకర్యాలు మున్నగు సాధారణ, కలగాపులగపు అంశాలను గూర్చిన ప్రస్తావన ఈ అధ్యాయంలో వుంది. ఏడవ అధ్యాయం 145 నుండి 206వ సెక్షన్ వరకు వుంది. సివిల్, క్రిమినల్ న్యాయాన్నిగూర్చిన వివరణ యిందులో వుంది. ఇందులో రెండు భాగాలు: (1) రాజీ కుదిర్చే సంఘం; (2) న్యాయ పంచాయతీలు. ఇందుకు సంబంధించి హైద్రాబాద్ గ్రామ పంచాయతీ చట్టంలో కొన్ని అంశా లున్నప్పటికీ. ఆంధ్ర పంచాయతీల చట్టానికి సంబంధించినంతవరకు ఇది కొత్త అంశమనే

చెప్పాలి. ఈ అధ్యాయం న్యాయ పంచాయతీలకు :సివిల్, క్రిమినల్ వ్యవహారాలలో న్యాయాధికారాలను అప్పగిస్తోంది. రాజీ సంఘం అనేది ఈ బిల్లులో ఒక ప్రత్యేక అంశం. గ్రామ పార్టీలమధ్య వివాదాన్ని పరిష్కరించి ఉభయులమధ్య రాజీ పర్చడానికి ఉపక రిస్తుంది. ఈ రాజీ వివాదం న్యాయ పంచాయతీలకు వెళ్ళక ముందుకుకూడ జరుగవచ్చు. వివాదాన్నిగూర్చి సరియైన అంచనాకు రావడానికి, న్యాయం కలుగజేయడానికి ఈ అంశం తోడ్పడుతుంది. ఈ అంశాన్ని తు.చ. తప్పక ఆచరణలో పెట్టినట్లయితే, అది వివాదాలు సమరసంగా పరిష్కారమవడానికి, కాలమూ, ధనమూ వృథాకాకుండా త్వరగా పరిష్కారమవడానికి దోహదం చేస్తుంది. ఎనిమిదో అధ్యాయం, పంచాయతీ కార్యకలాపాలకు అడ్డువచ్చినందుకు శిక్ష విధించడం, సమాచారం అందించకపోయినా, తప్పుడు సమాచారం అదించినా, పెనాల్టీలు విధిచండంతోపాటు అనేక విషయాలను గూర్చి నిబంధనలు తయారు చేయడానికి వీలు కల్పించే అవకాశం వుంది. ఈ అధ్యాయం 207నుండి 215వ సెక్షన్‌వరకూ వుంది. ఆఖరి అధ్యాయం 216 నుండి 227వ సెక్షన్‌వరకూ వుంది. ఈ అధ్యాయం ఈ సెక్షన్ల లోని ఉపఅంశాల్ని గూర్చి ప్రస్తావించింది. ఇందులో ప్రత్యేకాంశం ఏమంటే, పంచాయతీలు జిల్లాబోర్డు విధులు ఒకదానికొకటి బదలా యించు కోవడానికి వీలుగలవి. ఫలితంగా జిల్లాబోర్డు అధికారులను పంచాయతీకి, పంచాయతీ అధికారులను జిల్లాబోర్డుకు బదలాయించ డానికి ప్రభుత్వానికి హక్కు వుంది. అంతేగాదు; ప్రభుత్వం తన చేతిలోవున్న అధికారాలను సహితం,-నిబంధనలు తయారీ మినహా- అందుకు సంబంధించిన ఏ ఆఫీసరుకైనా బదలాయించవచ్చు. హైద్రా బాద్ చట్టంలోవుండి, ఆంధ్ర పంచాయతీ చట్టంలో లేని మరో ప్రధాన అంశంవుంది.; అదే, పునఃపరిశీలన జరిపే సాధారణ అధికారం ప్రభు త్వంవద్ద ఉండడం. ఈ అంశంక్రింద, యిచ్చిన ఉత్తర్వులు సరైనవి కావో లేదో, సబబైనవి అవునో కాదో తెలుసుకునేందుకై అధికారి రికార్డులను తెప్పించి పరిశీలించడానికి ప్రభుత్వం సర్వాధికారాలూ కలిగివున్నది. ఈ అధికారాన్ని ప్రభుత్వం ఒక ధర్మశాస్త్రుద్వారా

నిర్వహించవచ్చు. ఏ పార్టీపట్ల అసూయ యేర్పడే విధంగా వుండే ఏ ఉత్తర్వూ ఆ పార్టీకి ఎప్పుడైనా ప్రాతినిధ్యం వహించే అవకాశం చిక్కివుందని పక్షంలో ఏ ఉత్తర్వూ ఈ అంశంక్రింద ఆమోదింపబడ్డానికి వీలులేదు.

ఈ బిల్లుకు జతపర్చిన షెడ్యూళ్ళుకూడా చాలా ముఖ్యమైనవి. మొదట షెడ్యూలు పంచాయతీల నిర్వహణ కార్యకలాపాలకు చెందిన నిబంధనలను వివరిస్తుంది. తగిన ప్రాంతంలో పంచాయతీ ఆఫీసు వుండాలని. పంచాయతీ సమావేశం కనీసం నెల కొక్కమారైనా పంచాయతీ ఆఫీసులో జరగాలని షెడ్యూలులో ఒక అంశం వుంది. సమావేశం జరగటానికి పంచాయతీ సభ్యులలో మూడింట ఒక వంతు కోరం అవసరం. సమావేశంలో వచ్చిన చర్చనీయాంశంపై మెజారిటీదే నిర్ణయం. అవసరమనుకున్నప్పుడు అధ్యక్షుడు తన రెండో కాస్టింగ్ ఓటును వినియోగించవచ్చు.

## ఇక రెండో షెడ్యూల్

ఇందులో పంచాయతీలకు సంబంధించిన కొన్ని పనులు, వచ్చిన డబ్బును దాయడం మున్నగు విషయాలకు చెందిన నిబంధనలు వుంటాయి. పంచాయతీ నిధినుండి చెల్లించాల్సిన డబ్బు విషయమై కూడా ఇందులో ప్రస్తావన వుంటుంది. ఇంటిపన్ను విధింపుకు సంబంధించిన వివరణకూడా ఇందులో వుంది. వృత్తిపన్ను విషయమై ఒక పట్టిక వుంది. దాని ప్రకారం ఈ పన్నును విధిస్తారు. రు. 1500ల ఆదాయానికి మించిన ఆదాయంఉన్న వ్యక్తులపై పంచాయతీ రు. 125ల మేరకు పన్ను విధించవచ్చు. బళ్ళపై పన్ను విధింపును గూర్చిన వివరణకూడా ఈ షెడ్యూలులో వుంది. పన్నుల విధింపు వసూళ్ళ విషయంలో అప్పీలు చేసుకోడానికి వీలు కల్పించే అంశంకూడా అందులో ప్రత్యేకంగా చేర్చబడింది. పన్నుల వసూళ్ళ విధానాన్ని గూర్చిన వివరాలుకూడా ఇందులోనే ఉన్నాయి.

మూడో షెడ్యూల్‌లో లైసెన్సులను గూర్చిన వివరణ వుంది.

లైసెన్సులు అవసరమైన వివిధ సరకుల ఉత్పత్తికి - ఉదాహరణకు తుపాకీమందు, మందుగుండు సామాగ్రి, ఇటుకలు, పెంకులు, సున్నం. బోర్డింగ్, అండ్ లాడ్జింగ్ గృహాలకు వగైరా వాటి విషయంలో లైసెన్సు పద్ధతిగూర్చి వుంది.

నాల్గవ షెడ్యూల్లో వివిధ నేరాలకు విధించాల్సిన జుల్మానాలను గూర్చిన వివరణ వుంది. 106వ సెక్షన్ కు సంబంధించి, సెక్షన్‌ను ధిక్కరించి ప్రయివేట్ మార్కెట్‌ను బహిరంగంగా తెరవడంగాని, వుంచడంగాని జరిగితే అందుకు విధించే గరిష్ఠ జుల్మానా రు. 500 లు.

అయిదవ షెడ్యూల్ కూడా జుల్మానాలను గూర్చి చర్చిస్తుంది. కాని ఉల్లంఘనలకు విధించాల్సిన పెనాల్టీలను గూర్చిన వివరణ ఇందులో వుంది.

ఆరవ షెడ్యూల్‌లో ఈ కొత్తచట్టం అమలులోకి వచ్చినప్పుడు చిక్కులను అధిగమించడంకోసం తాత్కాలిక అంశాలుపొందు పర్చ డ్డాయి. ఈ చట్టం అమలులోకివచ్చిన రోజునుండీ అధికారంలో వుండే పంచాయతీ అధ్యక్షుడు, ఉపాధ్యక్షుడు, సభ్యులూ కొత్త చట్టం క్రింద మరో క్రొత్త పంచాయతీకి ఎన్నికలు జరిగేంతవరకు ఆ పదవు ల్లోనే వుండాలని షెడ్యూల్ నిర్దేశిస్తోంది.

## బిల్లులోని ముఖ్యాంశాలు

(1) పంచాయతీ ఆఫీసు కాలపరిమితి మూడు సంవత్సరాల నుండి అయిదు సంవత్సరాలకు పెంచబడింది.

(2) చట్టంలో నిర్దేశించిన నిబంధనలకు లోబడే, అక్ట్రాయి పన్ను విధించడానికి పంచాయతీలకు హక్కు వుంది. అటువంటి అంశం బిల్లులో కొత్తగా చేర్చబడమైనది.

(3) పంచాయతీలో రాజీసంఘం మొదట వుండాలి. ఇందుకోసం ఒక న్యాయ పంచాయతీని నెలకొల్పాలి.

(4) ప్రస్తుతం ఆంధ్ర ప్రాంతంలోని పంచాయతీలు పంచా యతీ కోర్టులుగా వ్యవహరిస్తున్నాయి. కాని ఈ చట్టంలో న్యాయ

పంచాయతీల ఏర్పాటుకు అవకాశం కల్పించారు. ఈ పంచాయతీ క్రిందకు మూడుకు తక్కువగాకుండా. ఏడుకు ఎక్కువగాకుండా పంచాయతీ లుంటాయి. ఆంధ్ర ప్రాంతంలో న్యాయ పంచాయతీలు పంచాయతీ కోర్టుల స్థానాన్ని ఆక్రమిస్తాయి.

## పంచాయతీ సమితులు - జిల్లాపరిషత్తులు

సాధారణంగా పంచాయతీ చట్టాలు ప్రజాతంత్ర వికేంద్రీకృత సూత్రంపై ఆధారపడి తయారైనవే. గ్రామాల ఆర్థికాభివృద్ధి అనేది ప్రభుత్వానికి ప్రధాన సమస్య. ముఖ్యంగా మంచినీటి సరఫరా వ్యవసాయాభివృద్ధి, పశుగణాభివృద్ధి, సహకారోద్యమం, గ్రామీణ పరిశ్రమలు, ఆరోగ్యం వగైరా వివిధ కార్యక్రమాలకు ఎక్కువ ప్రాధాన్యత యివ్వబడుతుంది. వాస్తవికంగా చూస్తే ప్రభుత్వం కొన్ని విధులను తాను పట్టించుకోకూడదు. కొన్ని బాధ్యతలను వదులుకోవాలి. వాటిని, తన అధీనంలో జరిగే అభివృద్ధి పనులన్నింటిని చూసే ఒక సంఘానికి అప్పగించాలి, అజమాయిషీ, ఉన్నత స్థాయిలో పధకాలు వేయడం వగైరా విధులను ప్రభుత్వం నిర్వహిస్తుంది. ఈ ఉద్దేశ్యంతోనే ప్రభుత్వం కార్యక్రమాలను చేపట్టుతోంది, అందుకు అనుగుణంగా చట్టాలు చేస్తోంది.

ఆంధ్రప్రదేశ్ సమితుల, జిల్లా పరిషత్తులచట్టం (చట్టం నం. XXXV 1959, ఈ చట్టానికి 1959 సెప్టెంబర్ 18 న గవర్నర్ ఆమోదముద్ర వేశారు. ఆంధ్రప్రదేశ్ గెజిట్‌లో ప్రకటించారు. పార్టు 1-VB, అసాధారణ గెజిట్ నం. 25. సెప్టెంబర్ 18, 1959.) పైన వివరించిన ప్రజాతంత్ర వికేంద్రీకృత సూత్రాన్ని ఆచరణ యుక్తంచేయడానికి జరిగే మరో ప్రయత్నం.

ఈ పంచాయతీ సమితుల జిల్లాపరిషత్తుల చట్టంలో 74 సెక్షన్లు వున్నాయి. ఇవి నాలుగు అధ్యాయాలక్రింద విభాగింపబడి వున్నాయి. మొదటి అధ్యాయంలో ప్రధాన సాంకేతిక మాటలకు సంబంధించిన 16 నిర్వచనాలు వున్నాయి. రెండవ అధ్యాయం 3 వ సెక్షన్‌నుండి 35 వ

సెక్షన్‌వరకూ వుంది. ఇది పంచాయతీసమితి నిర్మాణ విషయాలు, రాజ్యాంగమూ, అధికారాల విధులను గూర్చిన సమాచారం యిస్తుంది. మూడవ అధ్యాయం 36 వ సెక్షన్‌నుండి 58 వ సెక్షన్‌వరకూవుంది. ఇందులో జిల్లా పరిషత్తుల రాజ్యాంగం, వాటి నిర్మాణవిషయాలు, అధికారాలు, విధులనుగూర్చిన వివరణవుంది. నాల్గవ అధ్యాయం 59 నుండి 74 వ సెక్షన్‌వరకూవుంది ఇందులో అనేక ఇతర విషయాలనుగూర్చిన వివరణవుంది. ఈచట్టానికికొక షెడ్యూల్‌వుంది. ఇందులో 15 అంశాలున్నాయి. ఇవి పంచాయతీ సమితికి అధికారాలు, విధులను గూర్చిన వివరణవుంది. ఇందులోగాక ప్రభుత్వం రూపొందించిన కొన్ని నిబంధనలున్నాయి. ఇవి ఆంధ్రప్రదేశ్ అసాధారణ గెజిట్‌లో (1959 సెప్టెంబర్ 24) ప్రకటింపబడ్డాయి. వీటిని ఈక్రింది పేరాలుగా విభజించవచ్చు:-

## పంచాయతీ సమితి

### 1. రాజ్యాంగం :

ప్రతిబ్లాక్‌కు ఒక పంచాయతీసమితిని ప్రభుత్వం నియమించాలి. నోటిఫికేషన్‌ద్వారా ప్రభుత్వం జిల్లాలోని ఏ ప్రాంతాన్నైనా బ్లాక్‌గా ప్రకటించవచ్చు. ఏ బ్లాక్‌కోసం పంచాయితీసమితి ఏర్పడిందో, ఆ బ్లాక్ పేరుతో పంచాయతీ సమితి పిలువబడుతుంది, అదొక కార్పొరేట్‌సంస్థ, ఎన్నికలుంటాయి. ఆస్తిపాస్తులను స్వాధీనం చేసుకొనే అధికారమూ, వాటిని విడుదలచేసే అధికారమూ దీనికివుంది. కాంట్రాక్టులు కుదుర్చుకోవచ్చు తను దావా వేయనూవచ్చు. తనపై ఇతరులు దావా వేయవచ్చు.

ప్రతి పంచాయతీ సమితిలోనూ ఈక్రిందివారు సభ్యులుగా వుంటారు :

(అ) ఆంధ్రప్రాంతంలోని ప్రతి పంచాయతీ 1 అధ్యక్షులు; తెలంగాణా ప్రాంతంలోని ప్రతి పంచాయతీ సర్పంచ్ (అధ్యక్షుడు) బ్లాక్ ఏరియాలోని ప్రతి పట్టణకమిటీ అధ్యక్షుడుకూడా ఎక్స్-అఫిషియో సభ్యులుగా వుంటారు.

(ఆ) పంచాయతీగాని లేదా పట్టణకమిటీ అధీనంక్రిందలేని బ్లాక్ ఏరియాలోవున్న ప్రాంతానికి ప్రాతినిధ్యంవహించేటట్లు జిల్లాకలెక్టర్ ఒకవ్యక్తిని నామినేట్ చేస్తారు.

(ఈ) ఈ క్రింది వారిని ఎన్నుకుంటారు. (బ్లాకు ఏరియాలో నివసిస్తున్న వ్యక్తులనుండి సభ్యులు ఎన్నుకుంటారు.)

1. ఒక మహిళ.
2. షెడ్యూల్డ్ తరగతికిచెందిన ఒక ప్రతినిధి.
3. షెడ్యూల్డ్‌తెగ జనాభా నిర్దిష్టమైననిష్పత్తిలోవుంటే వారికొక ప్రతినిధి వుంటారు. దేశ జనాభా సరైన నిష్ప్రయత్నాలు లేకపోతే షెడ్యూల్డ్ తరగతిలో మరో ప్రతినిధిని ఎన్నుకొంటారు.
4. పరిపాలనా, ప్రజా జీవితం, గ్రామాభివృద్ధి లేదా సాంఘిక సేవా కార్యక్రమములలో అనుభవంవున్న ఇద్దరిని ఎన్నుకుంటారు. వారిలో ఒకరు స్త్రీ.
5. బ్లాక్‌లో పనిచేస్తున్న సహకారసంఘ సభ్యులొకర్ని ఎన్నుకుంటారు.

పంచాయతీ సమితి చర్చలలో రాష్ట్ర శాసనసభ్యుడు పాల్గొనే హక్కు వుంది అయితే ఈయనకు ఓటు హక్కు ఉండదు. ఉత్తర్వులో నిర్దిష్టంగా పేర్కొనబడ్డ పద్ధతిలో శాసనమండలి సభ్యులకు పంచాయతీ సమితి చర్చలలో పాల్గొని ఓటు చేసే హక్కు వుంది. ప్రతి పంచాయతీసమితి అధ్యక్ష ఉపాధ్యక్షులను సమితి సభ్యులే తమనుండి ఎన్నుకుంటారు. పంచాయతీసమితి అధ్యక్ష, ఉపాధ్యక్షుల పదవీ కాలపరిమితి ఎన్నికైన తేదీనుండి మూడు సంవత్సరాలుంటుంది. నైతిక పొందినవ్యక్తి నేరం రుజువై ఆరు నెలలకన్నా ఎక్కువకాలం జైలు శిక్ష పడిన పూర్తి పంచాయతీ సమితి సభ్యుడుగా వుండడానికి అర్హుడు కాడు. అలాగే మతి చెడినవాడూ, చెవిటివాడూ, కుష్ఠువాడూ సభ్యుడుగా వుండడానికి వీలులేదు. దివాళాదారుడుకూడా అనర్హుడే. ఎన్నికల సమయానికి పంచాయతీ సమితిలో ఏదైనా

కాంట్రాక్టు, కుదుర్చుకునివున్న వ్యక్తిగాని, సమితి లాయరుగాని, గౌరవ మేజిస్ట్రేటుగాని, పంచాయతీసమితి సిబ్బందిగాని, లేదా సమితి ఉద్యోగులుగాని సమితి సభ్యులుగా నిలబడ్డానికి అర్హులుకారు. వీరు అర్హులా, అనర్హులా అన్న విషయాన్ని జిల్లా మున్సిఫ్ నిర్ణయిస్తారు.

పంచాయతీ సమితికి అనేక స్థాయీ సంఘా లుంటాయి. అవి వ్యవసాయం, సహకార సంఘాలు, విద్య, రహదార్లు పన్నులు, ఆర్థికాది విషయా లనేకం చూస్తూంటాయి. ప్రతి స్థాయీ సంఘంలోనూ ఏడుగురు సభ్యు లుంటారు. పంచాయతీసమితి సమావేశాల్లో గాని, స్థాయీసంఘ చర్చలలోగాని పాల్గొనడానికి జిల్లా కలెక్టరుకు హక్కు వుంది. పంచాయతీ సమితి ఉన్నత సంస్థ కావడంవల్ల, సమాచారం అందించమనిగాని ఆయా విషయాలకు సంబంధించిన డాక్యుమెంట్లను తనకు, అందజేయమనిగాని స్థాయీ సంఘాన్ని కోరవచ్చు.

## (2) సమితి అధికారాలు ; విధులు :-

బ్లాక్ పరిపాలనా వ్యవహారాలు పంచాయతీ సమితి చేతుల్లో వుంటాయి. తన అధీనంలోవున్న ప్రజలలో స్వయం సహాయం, చొరవ, మున్నగు లక్షణాల్ని వ్యాపింపజేయటం ప్రతి సమితియొక్క విధి. షెడ్యూల్లో పేర్కొన్న అధికారాలను, విధులనూ సమితి నిర్వహిస్తుంది. అంతకుముందే ప్రభుత్వ అనుమతి పొందిన తరువాత పంచాయతీ సమితి సర్‌చార్జిరూపంలో పన్ను విధించవచ్చు. పంచాయతీ సమితులు, రేవులకు, స్నానవాటికలకు అవసరమైన నీటి సప్లయికిగాను నీటి కుళాయీలను నిర్మిస్తుంది. వాటి నిర్వహణా బాధ్యతా వీటిదే. వడపోసిన శుభ్రమైన మంచినీటిని సప్లయిచేయడంకూడా సమితి నిర్వహించవచ్చు. అందరికీ వినియోగించే చికిత్సాలయాలు, శిశు సంక్షేమ కేంద్రాలూ, ప్రభుత్వం సూచించిన రకపు సంస్థలనూ సమితి నిర్వహించవచ్చు. తన అధికారంలో వున్న ఏ డాక్యుమెంటు

నైనాసరే బ్లాక్ డెవలప్ మెంటు ఆఫీసరును పంచాయతీ సమితి తన స్థాయీసంఘ సమావేశంలో కోరవచ్చు.

## (3) అధ్యక్షుని అధికారాలూ: విధులూ:-

సమితి లేదా స్థాయీ సంఘం ఆమోదించిన తీర్మానాలను అమలుజరిపే విషయంలో బ్లాక్ డెవలప్ మెంట్ ఆఫీసరు కార్యకలాపాలపై పంచాయతీ సమితి అధ్యక్షుడు అజమాయిషీ వహిస్తాడు. అతను సమితి సమావేశాల్ని ఏర్పాటు చేస్తాడు. సమావేశాలకు అధ్యక్షత వహిస్తాడు. సమావేశాలను నిర్వహిస్తాడు. పంచాయతీ సమితికి చెందిన రికార్డు లన్నింటినీ ఈయన పరిశీలించవచ్చు. అత్యవసరమని తను భావించినప్పుడు అధ్యక్షుడు, ప్రజా శ్రేయస్సు కోసం ప్రజారక్షణ కోసం ఏపనినైనా,ఏచర్యనైనా అమలుజరిపించవచ్చు. లిఖితపూర్వకంగా అధ్యక్షుడు పురమాయించిన అధికారాలను, విధులనూ, సమితి ఉపాధ్యక్షుడు అమలు జరుపుతారు. ఒకవేళ అధ్యక్షుడు తాత్కాలికంగా లేకపోయినట్లయితే, అయన అధికారాలన్నింటినీ ఉపాధ్యక్షుడే నిర్వహిస్తారు. కార్య నిర్వహణలో అశ్రద్ధ జరిగినా లేక పంచాయతీ సమితి ఆస్తి వృధాగా ఖర్చయినా, లేదా స్థాని కావసరాలను తీర్చడంలో అశ్రద్ధజరిగినా ఆ విషయమై వ్యక్తిగత సభ్యులు సమితి అధ్యక్షుని దృష్టికిగాని, బ్లాక్ డెవలప్ మెంటు ఆఫీసరు దృష్టికిగాని తీసుకురావచ్చు.

## (4) బ్లాక్ డెవలప్ మెంటు ఆఫీసరు (బి. డి. ఒ)

ఈయన సమితియొక్క ప్రధాన కార్య నిర్వహణాధికారి (చీఫ్ ఎగ్జిక్యూటివ్ ఆఫీసరు). సమితి: దాని స్థాయీసంఘాల తీర్మానాలను అమలుపరచే బాధ్యత ఈయనదే. ప్రభుత్వం తనపై వుంచిన విధులను, అధికారాలను ఈయన నిర్వహిస్తాడు. మామూలుగా ఈయన సమితి, స్థాయీసంఘ సమావేశాలకు హాజరవుతూ వుంటారు. చర్చల్లో పాల్గొనే హక్కు ఈయనకు వుంది. అయితే

చర్చనీయాంశాలపై ఓటు చేయడానికిగాని, లేదా తీర్మానాలు ప్రతిపా దించడానికిగాని హక్కు లేదు. పంచాయతీసమితి సిబ్బంది, సమితిలో పనిచేసే ఇతర పనివారలూ, ప్రభుత్వం సమితికి బదలాయించిన పథ కాలూ ఈ ఆఫీసరు పాలనాధికారంక్రిందనే వుంటాయి. పెనాల్టీలు విధించడానికి ఈయనకు అధికార ముంది. అలాగే పెనాల్టీలకు వ్యతిరేకంగా అప్పీలుచేసే హక్కు కూడా చట్టంలో పొందుపర్చబడి వుంది. సమితి ఉత్తర్వులను ఈయన అమలు జరపాలి. ఈయనా, సమితిలోని ఇతర ఉద్యోగులు, సిబ్బందీ సమితికి కట్టుబడి వుండాలి. అవసరమైన ఉద్యోగులను నియమించడానికి కొత్తగా పోస్టులను నెల కొల్పే అధికారం సమితికి వుంది. సమితి స్థాయీసంఘాల సమావేశాలకు హాజరయే సభ్యులకు భత్యాలు చెల్లిస్తారు. అధ్యక్షుడికి ప్రయాణభత్యా లుంటాయి.

## (౮) పంచాయతీ సమితి నిధి

సమితికి వచ్చే డబ్బంతాకలిపి "పంచాయతీసమితినిధి" (ఫండ్)గా ఏర్పరుస్తారు. చట్టంలో పేర్కొన్న పనులకుమాత్రమే ఈ నిధి వినియోగిస్తారు. లేదా సమితి నిర్ణయానుసారం వాడుతారు. ఈ డబ్బును సరాసరిగానైనా సమితి తీసుకుంటుంది. లేదా ప్రభుత్వ ఖజానా (ట్రెజరరీ) లోనైనా వుంటుంది; లేదా ప్రభుత్వం గుర్తించిన ఏబ్యాంకు లోనైనా వుండవచ్చు.

ఆర్డర్లూ చెక్కులు అన్నింటిపైనా బ్లాక్ డెవలప్‌మెంటు ఆఫీసరు (బి. డి. ఒ.) సంతకం వుంటుంది. సంస్థలూ, పథకాలకు సంబంధించి ప్రభుత్వం బదలాయించిన నిధులూ, కేంద్రరాష్ట్ర ప్రభుత్వంనుండి వచ్చిన నిధులూ, అఖిలభారత లఘు, గృహపరిశ్రమల సంస్థనుండి వచ్చిన నిధులూ, విరాళాలు జిల్లాబోర్డు కేటాయింపు నిధి, భూమి శిస్తులో వాటానిధి, రాష్ట్ర పన్నులు, ఫీజులూ, పన్నులు, సర్‌చార్జీల నుండి వచ్చే వాటాలు; పంచాయతీ, పట్టణ కమిటీలనుండి వచ్చే విరాళాలు పంచాయతీ సమితి ఆదాయంగా పరిగణింప బడ్తాయి.

ప్రతిఏటా బి. డి. ఒ. బడ్జెట్ తయారు చేస్తాడు. జరుగనున్న సంవత్సరానికి ఆదాయ మెంత, ఖర్చు ఎంత అన్న విషయమై అందులో వివరా లుంటాయి. అవసరమని భావించిన సవరణలతో సమితి, బడ్జెట్‌ను ఆమోదిస్తుంది. పంచాయతీలు, పట్టణ కమిటీలు తమ బడ్జెట్లను పంచాయతీ సమితులకు సమర్పించాలి. ఎకౌంట్ల నిర్వహణ, వాటిని ఆడిట్ చేసే విషయమైకూడా చట్టంలో ఒక అంశం వుంది.

## (8) అధ్యక్షుని తొలగింపు

సమితి అధ్యక్ష, ఉపాధ్యక్షులపై విశ్వాసరాహిత్య తీర్మానాన్ని ప్రతిపాదించేందుకు చట్టం అవకాశం కల్పించింది. ఇందుకు సంబంధించిన వివరాలు చట్టంలోని 63వ సెక్షన్‌లో పొందుపర్చ బడ్డాయి. అధ్యక్షుడు తనకు పురమాయించిన ఉత్తర్వులను బుద్ధిపూర్వకంగా అమలుజరుపకపోయినా, అమలుజరుప నిరాకరించినా అతడిని తొలగించడానికి ప్రభుత్వానికి హక్కు వుంది. తన అధికారాలను దుర్వినియోగంచేసినా అధ్యక్షుణ్ని తొలగించవచ్చు.

## జిల్లా పరిషత్తు

### 1. రాజ్యాంగం :

ప్రభుత్వం జిల్లా కొక జిల్లా పరిషత్తును ఏర్పాటు చేస్తుంది. ఈ పరిషత్‌ను జిల్లా పేరుతో వ్యవహరిస్తారు. ఇదొక కార్పొరేట్ సంస్థ. ఎన్నిక లుంటాయి. ఆస్థిపాస్తులు స్వాధీనం, వాటిని అమ్మివేసే అధికారం జిల్లా పరిషత్‌కు వుంది. కాంట్రాక్టులు ఏర్పర్చుకొనే అధికారంకూడా వుంది. పరిషత్ దావా వేయొచ్చు. పరిషత్ పేరున ఎవరైనా దావా వేయనూ వచ్చు. జిల్లాపరిషత్‌లో ఈ క్రింది వారు సభ్యులుగా ఉంటారు :—

(1) జిల్లా ఎక్స్ - అఫీషియోలోని ప్రతి పంచాయతీ సమితి అధ్యక్షుడూ;
(2) జిల్లా కలెక్టర్
(3) అయా ప్రతేక జిల్లాకు చెందిన శాసన సభ్యులు
(4) ప్రభుత్వం నిర్ణయించిన శాసనమండలి సభ్యులు
(5) జిల్లాలో భాగమైన ఆ ప్రత్యేక నియోజక వర్గంనుండి ఎన్నికైన లోక్‌సభ సభ్యుడు.
(6) ప్రభుత్వం సూచించే రాజ్యసభా సభ్యులు
(7) బ్లాక్ ఏరియాకు సమితి కానిచోట, ఆ బ్లాక్‌లో నివసిస్తూన్న వ్యక్తిని తగు రీతిలో ఎన్నుకుంటారు.
(8) పైసభ్యులచే ఈ క్రింది సభ్యులు ఎన్నుకోబడతారు:—
(అ) ఇద్దరు మహిళలు
(ఆ) షెడ్యూల్డ్ తరగతులకు ప్రతినిధి ఒకరు;
(ఇ) షెడ్యూల్డ్ తెగలకు ప్రతినిధి ఒకరు.

ప్రతి జిల్లాపరిషత్‌కు ఒక అధ్యక్షుడూ, ఒక ఉపాధ్యక్షుడూ వుంటారు. వీరిని జిల్లాపరిషత్ సభ్యులే తమనుండి ఎన్నుకుంటారు. జిల్లా కలెక్టర్ అధ్యక్షుడుగాగాని, లేదా ఉపాధ్యక్షుడుగాగాని ఎన్నుకోబడరాదు. జిల్లా పరిషత్తు కార్యదర్శిని ప్రభుత్వం నియమిస్తుంది. అతను జిల్లాపరిషత్ సమావేశాలకు హాజరవుతూవుంటాడు. లేదా స్థాయీ సంఘ సమావేశాలకూ హాజరవుతూ వుంటాడు. చర్చలో పాల్గొనడానికి ఈయనకు హక్కు వుంది. కాని ఓటు హక్కు లేదు. ఏ తీర్మానాన్ని ప్రతిపాదించడానికి వీల్లేదు. ఎన్నికైన సభ్యుల పదవీ కాలపరిమితి మూడు సంవత్సరాలు. ఈ క్రింది పనుల నిర్వహణకు ప్రతి జిల్లా పరిషత్తుకు అనేక స్థాయీసంఘాలుంటాయి:— ప్రణాళికలు, సమాజాభివృద్ధి, ఆహారం, వ్యవసాయం, పరిశ్రమలు, విద్య, పన్నులు, ఆర్థిక వ్యవహారాలు. తన అధికారంలోవున్న ఏడాక్యుమెంటునైనా అందివ్వవలసినదిగా జిల్లా పరిషత్తుగాని లేదా స్థాయీసంఘంగాని కార్యదర్శిని కోరవచ్చు.

## (2) జిల్లా పరిషత్తు అధికారాలు, విధులు

ప్రతి జిల్లా పరిషత్తుకు, జిల్లాలోని పంచాయతీ సమితుల బడ్జెట్లను పరిశీలించి, ఆమోదించే అధికారముంది. జిల్లాకు కేటాయించిన నిధులను పంపిణీ చేయడం, బ్లాకులకు చెందిన పథకాలను సమన్వయీకరించి, ఏకీకృతం చేయడం, పథకాలు, ప్రాజెక్టులు, ప్రణాళికలు అమలుజరిగేటట్లు చూడ్డం, జిల్లాలోని సమితుల కార్యకలాపాలకు అజమాయిషీ వహించడం, వివిధ విషయాలలో ప్రభుత్వానికి సలహా యివ్వడం వగైరా పనులను జిల్లా పరిషత్ నిర్వహిస్తుంది.

## (3) జిల్లా పరిషత్ అధ్యక్షుని అధికారాలు, విధులు

జిల్లా పరిషత్తు స్థాయీ సంఘాల తీర్మానాలను అమలు జరిపించే విషయంలో కార్యదర్శి కార్యకలాపాలపై అధ్యక్షుడు పరిపాలనాధికారాన్ని చెలాయిస్తాడు. పరిషత్‌ను సమావేశపర్చి, అధ్యక్షత వహిస్తాడు. సమావేశాల్ని నిర్వహిస్తాడు. జిల్లా పరిషత్తు రికార్డు లన్నింటినీ అధ్యక్షుడు పరిశీలించవచ్చు. అధ్యక్షుడు లిఖితపూర్వకంగా బదలాయించిన అధికారాలనూ, విధులనూ ఉపాధ్యక్షుడు నిర్వహిస్తాడు. అధ్యక్షుడు లేని సమయంలో ఉపాధ్యక్షుడే అధ్యక్షుడుగా వ్యవహరిస్తాడు.

ఏవైనా అత్యవసర పరిస్థితులు ఏర్పడితే జిల్లా కలెక్టర్, మామూలుగా జిల్లా పరిషత్ అనుమతి పొందాల్సిన పనులుగాని, చర్యలనుగాని, పరిషత్ అనుమతి పొందకనే సరాసరి అమలు జరిపించవచ్చు. అటువంటి అత్యవసర సందర్భాలలో ఆటువంటి అధికారాలను చెలాయించరావడానికి గల కారణాలేమిటో వివరంగా పేర్కొంటూ జిల్లా కలెక్టరు ప్రభుత్వానికి నివేదిక పంపిస్తాడు. నివేదిక ప్రతి నొకదాన్ని సమాచారంకోసం జిల్లా పరిషత్తుకుకూడ పంపుతాడు. కొన్ని పనుల నిర్వహణకై అవసరమని తోస్తే జిల్లా పరిషత్తు ఉద్యోగుల, తదితర సిబ్బంది పదవుల్ని కొత్తగా సృష్టించ

వచ్చు. పరిషత్ లేదా స్థాయీసంఘ సమావేశాలకు హాజరయ్యే వ్యక్తులకు భత్యాలు చెల్లించేందుకు వీలుకల్పిస్తూ చట్టంలో ఒక అంశం పొందుపర్చబడింది.

## (4) జిల్లా పరిషత్తు విధులు :

పరిషత్తు సేకరించే డబ్బంతా కలసి "జిల్లా పరిషత్తు నిధి" అవుతుంది. ఈ నిధిని చట్టంలో నిర్దేశించిన ప్రత్యేక పనులకు మాత్రమే వినియోగించాలి. ఆవిధంగా నిజర్వ్యధనంగా ఉన్న ఆ డబ్బును భారత స్టేట్‌బ్యాంకులలోనూ, లేదా ప్రభుత్వం అనుమతితో మరో యితర బ్యాంకులో దాయాలి. ఈ నిధికి సంబంధించిన ఆర్డర్లు, చెక్కులపైన కార్యదర్శి సంతకం చేయాలి. ఈ నిధి వనర్లు; కేంద్ర లేదా రాష్ట్ర ప్రభుత్వాలు కేటాయించిన నిధులూ; అఖిలభారత, సంఘాల సంస్థలనుండి వచ్చే గ్రాంట్లు. భూమి లేదా స్థానికశిస్తులలో వాటా ధనం; జిల్లాపరిషత్తు విధించే పన్నులలో వాటా; దేవాదాయ ధర్మాదాయ ట్రస్టులకు సంబంధించిన ఆదాయం; సమితినుండిగాని, ప్రజల వద్దనుండిగాని లభించే విరాళాలు వగైరా. జిల్లా పరిషత్తు కార్యదర్శి ప్రతీఏటా బడ్జెట్ తయారు చేస్తారు. దీనిలో జిల్లా పరిషత్తు మార్పులు చేయవచ్చు. జమాఖర్చులు, వాటి తనిఖీ (ఎకౌంట్లు, ఆడిట్లుకు) సంబంధించిన సమితులు ఏర్పరచిన నిబంధనలాంటివే, చట్టంలో జిల్లా పంచాయత్తులకుకూడా ఏర్పరచారు.

జిల్లాపరిషత్తు అధ్యక్ష, ఉపాధ్యక్షులను అవసరమనుకొంటే ప్రభుత్వం పదవులనుండి తొలగించవచ్చు. వీరిపై విశ్వాసరాహిత్య తీర్మానాన్నికూడా పరిషత్తులో వతిపాదించవచ్చు.

## 5. ఇతర విషయాలు

పంచాయతీసమితులు, జిల్లాపరిషత్తుల అధికారాలను, విధులనూ మార్చటానికి ప్రభుత్వానికి హక్కువుంది. ప్రభుత్వం తగువిచక్షణతో ఏజిల్లాబోర్డునైనా రద్దుచేయవచ్చు. అటువంటి రద్దు జరిగినప్పుడు,

అంతకుముందువున్న అప్పులూ, మిగిలిన ఆస్తి జిల్లాపరిషత్తులకు బదిలీ అవుతాయి. పంచాయతీసమితులు, జిల్లాపరిషత్తులకు జిల్లాబోర్డుల చట్టంలోని నిబంధనలు అనువర్తిస్తాయనికూడా ప్రభుత్వం ఆదేశించవచ్చు. సమితిగాని లేదా పరిషత్‌గాని ఆమోదించిన ఏ తీర్మానానైనా సరే, అది అక్రమంగా ప్యాస్‌అయివుంటే సమితి లేదా పరిషత్ అధికారాలను మించిపోకుండా లేదా దుర్వినియోగపరచకుండావుంటే, లేదా వ్యక్తిజీవితానికి, ఆరోగ్య రక్షణలకు ప్రమాదం తెచ్చేదిగావున్నా, ప్రభుత్వం దానిని లిఖితపూర్వకమైన ఉత్తర్వుద్వారా రద్దుచేయవచ్చు. సమితిగాని, పరిషత్తుగాని తమకిచ్చిన అధికారాలను లేదా విధులను నిర్వహించకపోయినా లేదా ఈచట్టం తమపై విధించిన అధికారాలను దుర్వినియోగపర్చినా ఆ సమితినిగాని లేదా జిల్లా పరిషత్తునుగాని మొత్తంగా రద్దుచేసే హక్కు ప్రభుత్వానికి వుంది. సమితి నిర్మాణంలోగాని స్థాయీసంఘ నిర్మాణంలోగాని ఏదో లోపమున్నంత మాత్రానే సమితి లేదా స్థాయీసంఘ చర్యలు పనికిరానివని త్రోసివేయరాదు. అలాగే ఏదైనా అనర్హతవుంటే ఉద్యోగులు తమపదవుల్లో వుండడానికి అర్హులు కారు. పంచాయతీ సమితిలోని ప్రతిఒక్క సభ్యుడూ, జిలా పరిషత్తులో ప్రతిఒక్క అనధికార సభ్యుడూ భారత రాజ్యాంగానికి కట్టుబడివుంటానని ప్రతిన బూనాలి. పరిపాలనా నివేదికలు తయారు చేసేందుకు వీలు కల్పిస్తూ చట్టంలో ఒక అంశం పొందుపర్చారు. ప్రభుత్వం నియమించిన వ్యక్తికి స్థిరాస్తులను, లేదా అభివృద్ధిలోవున్న ఏపనినైనా, పాఠశాలలు, ఆస్పత్రి, చికిత్సాలయాలు; సత్రివలు, లేదా యితర ఏసంస్థ కార్యకలాపాలనైనా పరిశీలించడానికి అధికారముంది. రికార్డులు, రిజిష్టర్లు, తదితర డాక్యుమెంట్లను పరిశీలించడంతోపాటు, ఏ పంచాయితీ ఆఫీసునైనా ఏ పరిషత్తు ఆఫీసునైనా ఆయన తనిఖీ చేయవచ్చుకూడా.

సద్భావంతో జరిగే పనుల రక్షణకోసం చట్టంలో ఒక అంశం వుంది. సద్భావంతో ఒకవ్యక్తి ఏదైనా మంచి చర్య తీసుకుంటే ఆవ్యక్తిపైన ఎవరూ దావాగాని, విచారణగాని, న్యాయసంబంధమైన ఏ ఇతర చర్యలూ తీసుకోవడానికి వీలులేదు.

ఈ చట్టంలోని అంశాలన్నింటినీ అమలుజరిపే నిమిత్తం నిబంధనలు (రూల్సు) తయారుచేసే అధికారం ప్రభుత్వానికేవుంది. ఆవిధంగా రూపొందిన నిబంధనలను రాష్ట్రశాసనసభ, శాసన మండలుల ముందుంచాలి. ఉభయసభలు చేసే మార్పులకు ఈ నిబంధనలు లోబడివుంటాయి. తామేపనికి ఏర్పాటైనాయో ఆపనిని నిర్వహించేందుకై సమితులు, పరిషత్తులూ "బై–లా"లు (ఉపనిబంధనలు) చేసుకోవడానికి అధికార మివ్వబడింది, కొన్ని కొన్ని సందర్భాలలో ప్రభుత్వం తన అధికారాలన్నింటినీ లేదా వాటిలో కొన్నింటినిగాని ఏ యితర వ్యక్తికిగాని లేదా మరో అధికారికిగాని బదలాయించవచ్చు. అలా బదలాయించిన అధికారాలను తిరిగి ఉపసంహరించనూవచ్చు. తమ మేనేజిమెంటుక్రిందగాని లేదా తమ అధీనంలోగాని వున్న ఏ సంస్థనైనా లేదా పనినైనా ప్రభుత్వంవారు పరిషత్తుకుగాని లేదా సమితికిగాని బదిలీ చేయవచ్చు.

పునఃపరిశీలన జరిపి సమీక్షించే, ప్రభుత్వాధికారానికి సంబంధించిన అంశం 72వ సెక్షన్‌లో వుంది. ప్రభుత్వం ఈ అధికారాన్ని ఒక ప్రత్యేక విషయంపై అందుకు సంబంధించిన వ్యక్తి దరఖాస్తు పెట్టుకొన్నప్పుడు, వినియోగిస్తుంది. సమితిగాని, పరిషత్తుగాని, స్థాయీసంఘంగాని ఆమోదించిన ఏ ఉత్తర్వు అయినా సరిగ్గా వుందా లేదా, నియమబద్ధంగా వుందా లేదా అన్న విషయమై తనకు సంతృప్తికరంగా వుండేందుకుగాను ప్రభుత్వం సమితి లేదా పరిషత్ లేదా స్థాయీ సంఘాల రికార్డులను తెప్పించి పరిశీలించవచ్చు. ఈ చట్టంలోని అంశాలను అమలుపరచే సమయంలో ఏవైనా చిక్కులు వచ్చిన పక్షంలో వాటిని తొలగించేందుకు అవసరమైన అంశంకూడా ఈ చట్టంలో పొందుపరచబడి వుంది.

## పంచాయతీ సమితి, జిల్లా పరిషత్తుల సభ్యుల ఎన్నిక

ఈ విషయంక్రింద, పంచాయతీ సమితి, జిల్లా పరిషత్తుల సభ్యుల ఎన్నిక సమయంలో పాటించాల్సిన పద్ధతులకు చెందిన

కొన్ని నిబంధనలు పొందుపర్చబడ్డాయి. ఈ నిబంధనలు 1959 సెప్టెంబర్ 24 నాటి ఆంధ్రప్రదేశ్ అసాధారణ గెజిట్ పార్టు I అను బంధంలో చేర్చబడ్డ నిబంధనలలో ప్రచురించబడ్డాయి. పంచాయతీ సమితి జిల్లా పరిషత్ చట్టంలోని 69వ సెక్షన్‌లోని సబ్ సెక్షన్ (1), 4వ సెక్షన్‌లోని సబ్ సెక్షన్ (1) లోని మూడవ క్లాజు; 36వ సెక్షన్ (3) సబ్ సెక్షన్ 8వ క్లాజు క్రింద సంక్రమించిన అధికారాలను అమలులోకి తెచ్చేందుకు ప్రదేశ్ గవర్నర్ ఈ నిబంధనలను రూపొందించారు.

## పంచాయతీ సమితి సభ్యుని ఎన్నిక

సమితి సభ్యుల ఎన్నిక పంచాయతీ అఫీసులో పంచాయతీ సమితి సభ్యులతో, కలెక్టర్ గాని లేదా మరో గెజెటెడ్ ఆఫీసరుగాని అధ్యక్షత వహించిన ప్రత్యేక సమావేశంలో జరగాలి. సమావేశం యింకా 10 రోజులకు జరుగుతుందనగా సమావేశం తేదీ, ఎన్ని గంటలకు జరిగేదీ పంచాయతీ సమితి సభ్యులకు నోటీసు యిస్తారు. ఆ సమావేశంలో పాల్గొనే ప్రిసైడింగ్ ఆఫీసరు ఓటు చేయడానికి అర్హుడు కాడు.

ఫలానా అభ్యర్థిని ఎన్నికకు నిలబెడుతున్నట్లు ఒక సభ్యుడు ప్రతిపాదిస్తాడు. ఆ ప్రతిపాదనను మరొక సభ్యుడు బలపరుస్తాడు. సక్రమంగా ప్రతిపాదితమై, బలపర్చబడ్డవారందరి అభ్యర్థుల పేర్లనూ ప్రిసైడింగు ఆఫీసరు పైకి చదివి వినిపిస్తాడు. నిర్ణయించిన స్థానాలకు అభ్యర్థుల సంఖ్య సమంగా వుంటే, ఎన్నిక వుండదు. ఆయా స్థానాలకు ఆయా అభ్యర్థులంతా సక్రమంగా ఎన్నికైనట్లే ఆఫీసరు ప్రకటిస్తాడు. అలాగాక, పోటీచేసే అభ్యర్థుల సంఖ్య సీట్లసంఖ్య కన్నా తక్కువగావుంటే, అప్పుడు ప్రిసైడింగ్ ఆఫీసరు ఈ అభ్యర్థులంతా సక్రమంగానే ఎన్నికైనట్లు చెప్పి, కొత్తగా నామినేషన్లకు పిలుస్తాడు. అప్పుడు ఆ అభ్యర్థులసంఖ్య సీట్ల సంఖ్యను మించివుంటే రహస్యబ్యాలెట్ ద్వారా ఎన్నిక జరుగుతుంది. సమావేశానికి హాజరైన

సభ్యులందరి ఓట్లూ గణనలోకి తీసుకోబడతాయి. ప్రిసైడింగ్ ఆఫీసరు బ్యాలెట్ పెట్టె ఏర్పాటుచేస్తాడు. ఇందులో ఓటర్లువేసే బ్యాలెట్ కాగితాలు వుంటాయి. అయితే ఈ కాగితాలను ఆ పెట్టెనుండి తీయాలంటే అధికారపూర్వకంగా ఆ పెట్టె తాళం తీస్తేతప్ప వీలుగాదు. ప్రిసైడింగ్ ఆఫీసరు బ్యాలెట్ పెట్టె ఖాళీగా వున్నట్లు చూపుతాడు. ఓటింగ్ అయిన వెంటనే ఆ పెట్టెను సభ్యుల సమక్షంలో తెరచి బ్యాలెట్ కాగితాలను లెక్కించి, ఒక ప్రకటన రూపంలో ఆయా అభ్యర్థులకు వచ్చిన ఓట్ల సంఖ్యను గుర్తు పెడతాడు. ఓటు ఈ క్రింది పరిస్థితులలో మురిగిపోతుంది:- (1) బ్యాలెట్ కాగితంపై ఓటరు సంతకంవున్నా: (2) ఉన్న స్థానాలను మించి ఎక్కువమంది అభ్యర్థుల పేర్లకు ఎదురుగా గుర్తులున్నా: (3) ఒకరిద్దరు లేదా అంతకు మించి అభ్యర్థులకు ఓటు వినియోగించాలన్న ఉద్దేశం ఉన్నట్లు ఇదమిద్ధంగా తేలకుండా అనుమానానికి తావుతీసే గుర్తువున్నా: (4) అసలు గుర్తే లేకపోయినా: (5) ముద్ర లేకపోయినా ఆ ఓటు మురిగినట్లే లెక్క.

ఏ అభ్యర్థికి ఎక్కువ ఓట్లు వస్తే అతడ్ని ప్రిసైడింగ్ ఆఫీసరు ఎన్నికైనట్లు ప్రకటిస్తాడు. సమావేశానంతరం ప్రిసైడింగ్ ఆఫీసరు పంచాయతీ సమితి నోటీసుబోర్డుపైన సంతకంతో ఒక నోటీసు ప్రకటిస్తాడు. అందులో ఆయన, ఎన్నికైన అభ్యర్థుల పేర్లూ ప్రకటిస్తాడు. ఆ నోటీసును ప్రతినొకదాన్ని జిల్లా కలెక్టర్‌కు, ప్రభుత్వానికీ పంపుతారు. ప్రతి అభ్యర్థికి చెందిన వోటింగ్ కాగితాలను ప్రత్యేక సంచీలలో ఎన్నికల ఆఫీసరు భద్రపరుస్తాడు. సమితి ఆఫీసులో ఒక సంవత్సరపాటు భద్రమైన స్థానంలోవాటిని అట్టే పెడతారు. ఆ తరువాత మరి కొంతకాలంపాటు భద్రపర్చమని ఆదేశాలేమీ లేక పోతే, వాటిని తగులబెట్టేస్తారు.

## జిల్లా పరిషత్ సభ్యుల ఎన్నిక

సమితి సభ్యుల ఎన్నికకు అవలంబించిన పద్ధతులే దాదాపు జిల్లా పరిషత్ సభ్యుల ఎన్నికకుకూడా ఉపయోగపడతాయి.

అలాగే పైన తెల్పిన నిబంధనలే సాధారణ లేదా ప్రత్యేక ఖాళీస్థానాన్ని నింపడానికికూడా ఉపయోగపడ్తాయి. సభ్యుని స్థానం ఖాళీఅయి మూడు నెలలకన్నా తక్కువ వ్యవధివుంటే, అటువంటి స్థానాన్ని నింపడం జరగదు.

## సమితి అధ్యక్ష, ఉపాధ్యక్ష, జిల్లా పరిషత్ అధ్యక్ష, ఉపాధ్యక్ష ఎన్నిక

### 1. సమితి అధ్యక్షు ఎన్నిక :-

జిల్లా కలెక్టర్ ప్రత్యేకంగా పంచాయతీ సమితి ఆఫీసులో ఏర్పాటుచేసిన సమావేశంలో ఈ ఎన్నిక జరుపుతారు. సమావేశానికి కలెక్టర్ లేదా ఆపనికి ప్రభుత్వంచే ప్రత్యేకంగా నియమించిన వ్యక్తి గాని అధ్యక్షత వహిస్తారు. అయితే ఆ వ్యక్తి ఓటు చేయడానికి అర్హుడుకాడు. ఆ సమావేశం జరిగే తేదీ, ఎప్పుడు జరిగేదీ సమావేశం జరిగే రోజుకి సరిగ్గా అయిదు రోజుల ముందు తెలియజేస్తారు. అత్యవసర పరిస్థితులలో వ్యవధి తక్కువవున్నా, సమావేశం జరుపవచ్చు. సమితి అధ్యక్షుని పేరును ఎవరో ఒకరు సూచిస్తారు. మరొక సభ్యుడు బలపరుస్తాడు. ఒకే సభ్యుడున్న పక్షంలో అసలు ఎన్నికనేదే జరుగదు. అతడే అధ్యక్షుడుగా ఎన్నికైనట్లు ప్రకటిస్తారు. అలాగాక అధ్యక్షస్థానానికి ఇద్దరూ, లేదా అంతకన్నా ఎక్కువవుండే పక్షంలో రహస్య బ్యాలెట్ద్వారా ఎన్నిక జరుగుతుంది. ప్రిసైడింగ్ ఆఫీసరుకు ప్రత్యేక బ్యాలెట్ పెట్టె వుంటుంది. ఓటింగ్ జరుగబోయే ముందు ఈ పెట్టెను సభ్యులందరికీ ఆఫీసరు ఖాళీగా చూపిస్తాడు. పైన సమితి సభ్యుల ఎన్నిక విషయంలో ఏ కారణాలవల్ల ఓట్లు మురిగినట్లు పరిగణింపబడతాయో ఆ కారణాలు అధ్యక్ష ఎన్నికలోనూ వర్తిస్తాయి. ఎన్నికైన అధ్యక్షుని పేరును నోటీసుబోర్డుమీద ప్రకటిస్తారు. నోటీసు ప్రకటన ప్రతి వొకదాన్ని కలెక్టరుకు, ప్రభుత్వానికి పంపుతారు. సమితి అధ్యక్షుల పేర్లుకూడా ప్రభుత్వ గెజెట్లో ప్రకటింపబడ్తాయి.

ప్రతి అభ్యర్థికీ చెందిన ఓటింగ్ కాగితాలను వేరే భద్రపరచి ఒక సంవత్సరంపాటు వుంచుతారు. ఆ తరువాత వారు కొంతకాలం వాటిని భద్రంగా వుంచాల్సిన అవసరం లేకపోతే, వాటిని తగులబెట్టి వేయవచ్చు.

అధ్యక్షుడు ఎన్నిక అయిన అనంతరమే, సమావేశానికి అధ్యక్షత వహించి, పైన వివరించిన పద్ధతిలోనే ఉపాధ్యక్షుని ఎన్నిక జరిపిస్తాడు. అధ్యక్షునికి ఓటుచేసే హక్కు వుంది.

## జిల్లా పరిషత్ అధ్యక్షుని ఎన్నిక

పంచాయతీసమితి ఎన్నికకు అనుసరించన పద్ధతియే ఈ ఎన్నికకుకూడా అనువర్తిస్తుంది. అలాగే ఉపాధ్యక్షుని ఎన్నికకూడా.

గెజిట్‌లో ప్రకటించిన నిబంధనల సారాంశం యిది.

# ఆంధ్రప్రదేశ్ గ్రామ పంచాయతీ బిల్లు

### గోపాలరావ్ ఎగ్బోటే (ఎం. యల్. ఎ)

స్థానిక ప్రజాస్వామ్యంయొక్క అండదండలు లేకపోతే ఏ జాతీయ ప్రజాస్వామ్యమూ మూడు పూవులూ ఆరు కాయలుగా అభివృద్ధి చెందదు. స్థానిక స్వపరిపాలన లేకపోతే జాతీయ స్వపరి పాలన సంపూర్ణమే కాదు; శక్తి హీనమవుతుంది. అందువల్లనే మన ప్రజాస్వామ్యమూ వికేంద్రీకృత ఆర్థికవ్యవస్థా క్రింది స్థాయి నుండి పాదుకొనాలిగాని పైనుండి దాని అభివృద్ధి ప్రారంభం కారాదు. కాబట్టి, మన ఆర్థిక రాజకీయ, సాంఘిక, న్యాయ అభివృద్ధి కార్యకలాపాలకు గ్రామ వ్యవస్థ ప్రాతిపదికగా వుండాలి. అనుకున్న లక్ష్యాలను తుదకు చేరేందుకు వీలుగా మన గ్రామీణ సమాజాన్ని పునర్నిర్మించుకునేందుకు మనం అఖండమైన కృషి చేయాల్సి వుంది.

1954 నాటి మంత్రుల సమావేశంలో తీసుకున్న నిర్ణయాలు, 1953 — 54 లో పన్నుల విచారణ సంఘం చేసిన సిఫార్సులూ; ఎ.ఐ.సి.సి కమిటీ ఆదేశాలు, 1957 కమ్యూనిటీ ప్రాజెక్టుల జాతీయ వికాసపథకాలను పరిశీలించడానికి ఏర్పడ్డ బృందం చేసిన సూచనలను దృష్టిలో పెట్టుకుని, ప్రజాభిప్రాయంకోసం అధికారయుతంగా గెజిట్‌లో ప్రకటితమైన ఆంధ్రప్రదేశ్ గ్రామ పంచాయతీల బిల్లును పరిశీలించాల్సి వుంది.

రాష్ట్ర ప్రభుత్వం స్పెషల్ ఆఫీసరుకు యిచ్చిన ఉత్తర్వుల ఆధారంగానే ఆంధ్రప్రదేశ్ గ్రామ పంచాయతీల బిల్లును తయారు చేసినట్లుంది. స్థానిక సంస్థలకు సంబంధించి మద్రాసు, హైద్రాబాద్

చట్టాలను కలిపివేసి ఆంధ్రప్రదేశ్ చట్టాల ముసాయిదాలను తయారు చేయవలసిందిగా ప్రభుత్వం స్పెషల్ ఆఫీసరును కోరింది.

తరువాత స్పెషలు ఆఫీసరు నివేదికను తయారు చేశాడు. బిల్లు తయారైంది. ఈ రెంటినిబట్టి, స్పెషల్ ఆఫీసరు మద్రాసు, హైద్రాబాద్ చట్టాలను పోల్చుతూ, రెండు చట్టాలలోని అంశాలు ఏ విషయమై సరిపోలుతున్నయో చూచి వాటిని బిల్లులో చేర్చారనీ తెలుస్తుంది. అలాగే మద్రాసు చట్టంలోని అంశాలు హైద్రాబాద్ చట్టంలో లేకపోయినప్పుడు మద్రాసు చట్టంలోని అంశాలనే యధాతధంగా వుంచడంకూడా జరిగింది. అయితే మద్రాసు చట్టంలో లేకుండా హైద్రాబాద్ చట్టంలోవున్న అంశాలుమాత్రం బిల్లులో పొందుపర్చలేదు. తుదకు ఈ రెండు చట్టాలకు మధ్య వైరుధ్యం కనపడ్డప్పుడుమాత్రం,మద్రాసుచట్టాన్నే ప్రామాణికంగాతీసుకోవడం జరిగింది. ఒక్కముక్కలో చెప్పాలంటే, ఎవో ఇక్కడా అక్కడా కొద్దిపాటి మార్పులు మినహా ప్రధానంగా మద్రాసు చట్టాన్ని అనుసరించే ప్రస్తుత బిల్లు తయారైంది. అలాగాక ఈ రెండు ప్రాంతాలలో వ్యవహారంలో వున్న ఈ రెండు చట్టాలకే పరిమితమై వుండకుండా గత కొలది సంవత్సరాలుగా యితర రాష్ట్రాలలో అమలులోకి వచ్చిన చట్టాలను, పైన పేర్కొన్న కమిటీ నివేదికలనుకూడ గణనలోకి తీసుకొని బిల్లు ముసాయిదాను రూపొందించాలని ప్రభుత్వం స్పెషల్ ఆఫీసరును ఆదేశించివుంటే, పై పద్ధతి తప్పివుండేది. ఉన్న అవకాశాలను ఇంకా విస్తృతం చేసుకొని వుండేవాళ్ళం. 1950 మద్రాసు చట్టం తరువాత అనేక కొత్త మార్పులు వచ్చాయి. చివరకు మద్రాసు ప్రభుత్వం సహితం ఈ చట్టాన్ని మార్చాలని తలపోస్తోంది. మంత్రుల సమావేశాలు, తద్భితర కమిటీలు, కమిషన్లు చేసిన సిఫార్సులు ఆధారంగానే హైద్రాబాద్ చట్టానికి 1956 చట్ట రూపం వచ్చింది. మద్రాసు చట్టాన్నే అనుసరించడమూ అంటే, తొమ్మిది సంవత్సరాలు వెనకడుగు వేసినట్లే. ఈ అమూల్యమైన కాలం అధునాతనమైన, అభ్యుదయకరమైన చట్టాన్ని తయారుచేయడానికి పూర్తిగా ఉపయోగపడివుండేదే.

కాని ఈ బిల్లు, పంచాయతీల ఏర్పాటు వాటిపై ప్రభుత్వ కంట్రోలుకు సంబంధించినంతవరకూ చాలా అశాభంగంగా వుంది. "గ్రామ సభ"కు సంబంధించిన అంశాలేమీ ఈ బిల్లులో లేవు. ఈ అంశాన్ని చేర్చకుండా వదలివేయడం, 1954 జూన్‌నాటి స్థానిక స్వపరిపాలనాశాఖా మంత్రుల ద్వితీయ సమావేశం చేసిన సూచనలకు విరుద్ధంగా వుండడమే గాదు; గ్రామాభివృద్ధి కార్య కలాపాలలో బాగా చొరవతో పాల్గొనే హక్కును ప్రయోజనులకు నిరాకరిస్తోంది. తీరా బిల్లువల్ల ఘనకార్యమల్లా — కేవలం ప్రతి అయిదు సంవత్సరాలకు గ్రామ పంచాయతీని ఎన్నుకునే ఓటర్లుగా ప్రయోజనులను దిగ జార్చడంమాత్రమే ఆ ఐదుసంవత్సరాలూ పంచాయతీ కార్యకలాపాలను నిస్సాయులుగా చూస్తూ వుండడమే వారి పని అన్నమాట. జనరల్ ఎన్నికల్లో ప్రతి అయిదు సంవత్సరాలకు ఓటింగ్‌ద్వారా ఎన్నుకోవడ మొక్కటే ప్రభుత్వానికీ వ్యక్తికీ వున్న సంబంధమైతే, సాధారణ మానవుణ్ణి ఏ క్రియాత్మకమైన మార్గంలోనూ తన పౌర హక్కును తాను గుర్తించేటట్లుగా చేయలేము. అందువల్ల ప్రభుత్వం "గ్రామ సభ"కు చెందిన సూచనను బిల్లులో చేర్చాలి. ఈ సభలకు ఈ పంచా యతీలకున్న పూర్ణాధికారాలలో కొన్నింటిని అప్పగించాలి.

"ప్రతీ గ్రామానికి ఒక గ్రామ పంచాయతీ వుంటుంది" అని హైద్రాబాద్ చట్టంలోని సెక్షన్ 7 లో వుంది. ప్రస్తుత బిల్లు మాత్రం, ఏ రెవెన్యూ తాలూకా ప్రాంతాన్నైనా గ్రామంగా ప్రకటించి, అటు వంటి స్థానిక ప్రాంతానికి గ్రామ పంచాయతీని ఏర్పరిచే అధికారాన్ని ప్రభుత్వానికి దఖలుపరుస్తోంది. కాని ఈ అధికారాన్ని ప్రభుత్వానికే విస్తృతంగా అప్పగించినట్లయితే, గ్రామ పంచాయతీ అధికారంక్రింద (జ్యూరిస్డిక్షన్)కు వచ్చే ప్రాంతాలను విభజించినందువల్ల సహాయ కారిగా వుండదు.

చివరకు మద్రాసు చట్టంకూడా 500 మంది జనాభావున్న ప్రతి గ్రామానికి ఒక గ్రామ పంచాయతీ వుండాలని చెపుతోంది. మెహతా నివేదిక ఆధారంగా ఏర్పడే బ్లాక్ సమితుల నిర్మాణందృష్ట్యా, వెయ్యికి

తగ్గని జనాభావున్న ప్రతి గ్రామానికి గ్రామ పంచాయతీ వున్నట్లయితే గ్రామీణులకు అధికాధికమైన అవకాశాలు కల్పించడం చాల ప్రజా తంత్ర చర్యగా వుంటుంది. వెయ్యమంది జనాభాకు మించకుండా వుండి, భౌగోళిక సామీప్యతవున్న గ్రామాలన్నింటినీ కలిపి వాటికి ఒకే పంచాయతీని ఏర్పర్చవచ్చు. ఈ విధంగా చేయడంవల్ల, నిపుణులు సూచించిన సిఫార్సులను తూ.చ. తప్పకుండా అనుసరించిన వార మవుతాం. బిల్లులోని 3, 4 క్లాజులను 5వ క్లాజుతో కలిపి చదివితే, 20 వేలకు మించిన జనాభాగల గ్రామానికిగాని, కొన్ని గ్రామాలకు గాని. లేదా ఒక తాలూకాకుగాని ఒక పంచాయతీని ఏర్పర్చడం సాధ్యమేనన్న అభిప్రాయం కలుగుతోంది. ఇది వికేంద్రీకృత ప్రజాతంత్ర శాఖలు ఏర్పడాలన్న ఉద్దేశానికే భంగం కలిగిస్తుంది.

పంచాయతీ సభ్యుల కనిష్ఠ సంఖ్య 5 గానూ, గరిష్ఠ సంఖ్య 15 గానూ మద్రాసు చట్టం నిర్ణయించింది. జనాభా దృష్టిలో పెట్టుకొని అందుకు అనుగుణంగా సభ్యుల సంఖ్యను నిర్ణయించే అధికారాన్ని ఈ చట్టం ఇన్స్పెక్టర్‌కు యిచ్చింది. మొత్తం పంచాయతీ సభ్యుల సంఖ్యను ఇన్స్పెక్టర్ ప్రకటించే పద్ధతిబిల్లులో నిర్దేశించబడి వుంది. సభ్యుల మొత్తం సంఖ్యను నిర్ణయించడం అనే సూత్రం జనాభా ప్రాతిపదికపైకూడా ఆధారపడి వుంది. వెయ్యికి మించని జనాభాగల పంచాయతీలో ఆరుగురు సభ్యులవరకూ, 20 వేలకు మించిన జనాభాగల పంచాయతీలో 16 గురు సభ్యులవరకూ వుండొచ్చునని బిల్లు చెపుతోంది. ఈ రెండు సందర్భాలలోనూ సరిసమానమైన జనాభా ప్రాతిపదికపై ఆధారపడిన సరిసమానమైన ప్రాతినిధ్యం వుందని చెప్పలేం. కాబట్టి అన్నింటికంటే మంచి పద్ధతి ఏమంటే, భారత రాజ్యాంగంలోని 81, 170 నిబంధనలలో నిర్ణయించిన సూత్రా లను అనుసరించడం మంచిది. ఈ నిబంధనలు జనాభా ప్రాతిపదికపై పార్లమెంటు రాష్ట్ర శాసనసభలకు స్థానాలు నిర్ణయించే పద్ధతిని నిర్దేశిస్తు న్నాయి. ఇందువల్ల రాష్ట్ర మంతటా ఒకేరకమైన పద్ధతి అమలులోకి వస్తుంది.

ఇక షెడ్యూల్డ్ కులాల సీట్ల రిజర్వేషన్ సంగతి: పంచాయతీలకు జరిగే మొదటి సాధారణ ఎన్నికల మేరకే బిల్లు రిజర్వేషన్‌కు పరిమితం చేసి, ఆ తరువాత దానివి అయిదు సంవత్సరాలవరకూ పరిమితం చేసింది. కాని మహిళా సభ్యుల నామినేషన్ విషయమై బిల్లు అటువంటి పరిమితులేమీ విధించలేదు అభివృద్ధిచెందిన తదితర జనాభాతోపాటు నేడు కాకపోతే రేపైనా సరే షెడ్యూల్డ్ కులాలు అభివృద్ధికి నోచుకోవు అనే వాదన ఒకటివుంది. ఇందుకు కొంత వ్యవధి వుంది. అదేవిధంగా షెడ్యూల్డ్ కులాలకు వలెనే, రాజ్యాంగంలో ఎటువంటి రిజర్వేషనూ లేని మహిళలకు కూడా ఇదే రకమైన పద్ధతి వర్తింపచేయడం అవసరం. రాజ్యాంగంలోని 334 వ ఆర్టికల్ క్రింద వున్న హక్కులు షెడ్యూల్డ్ కులాలకు వర్తింపజేయబడ్డాయో లేదో జాగ్రత్తగా చూడ్డానికిగాను కాలనిర్ణయ సమస్యను హైద్రాబాద్ చట్టం రిజర్వేషన్‌కు వదలింది. అటువంటి హక్కులు వారికి వర్తింపబడక పోయినట్లయితే, రాజ్యాంగంలోని ఆ భాగాన్ని సవరించేందుకు కూడా చట్టం వీలు కల్పించింది, అలాగే అటువంటి వర్తింపు మంజూరయిన సందర్భాలలో సహితం బిల్లును సవరించాల్సి వుంటుంది.

బిల్లులో అన్నిటికంటె సంతోషించదగ్గ అంశం ఏమంటే - పంచాయతీల కాలపరిమితిని అయిదు సంవత్సరాలుగా నిర్ణయించడం. పంచాయతీసభ్యుల పదవీకాల పరిమితిని మొత్తంగా ఒక సంవత్సరానికి మించకుండా పెంచడానికిగాని తగ్గించడానికిగాని అనిచెప్పి ప్రభుత్వానికి ఎక్కువ అధికారాలు దఖలు పర్చడం తీవ్రమైన ఆక్షేపణయే. సభ్యుల కాలపరిమితిని పెంచడానికి అంగీకారం తెలిపే క్లాజు ఒకటి అన్ని చట్టాలలోనూ వున్నా, అది కొంత ఆక్షేపణీయమైన విషయమైనా, ఈ క్లాజును తగిన ఆధారాలు చూపి బలపర్చవచ్చు. కాని చట్టం నిర్ణయించిన పదవీ కాలపరిమితిని తగ్గించే అధికారాన్ని ప్రభుత్వానికి దఖలు పర్చడమూ అంటే అది చాల మితిమీరిన వ్యవహార మన్నమాట. ప్రజా ప్రాతినిధ్యానికి చెందిన మూలసూత్రాలకే ఎసరు పెట్టడమన్నమాట. అలాగే తమ పదవీ కాలపరిమితి ముగిసిన రోజున పంచాయతీ

సభ్యులు పదవీ బాధ్యతను నిర్వహించరాదని ప్రకటించేందుకు ఇన్‌స్పెక్టర్లకు అధికారాలు అప్పగించారు; కొత్త పంచాయతీ ఎన్నికైన తరువాత ఆ పంచాయతీ బాధ్యతలను స్వీకరించేవరకూ స్పెషల్ ఆఫీసరును నియమించే అధికారాలనూ ఇన్‌స్పెక్టర్లకు అప్పగించారు. నిజానికి ఈ అధికారాలు అనవసరం. పైగా చాల ప్రజాతంత్ర విరుద్ధమైనవినూ. అధికార దుర్వినియోగానికి కూడా అవకాశం లేకపోలేదు, వీటన్నింటి కన్నా, కొత్త ముందుగానే తగిన ఎన్నికలు జరపడం చాలమంచిది. ఫలితంగా పంచాయతీ పదవీకాల పరిమితి ముగిసిన వెంటనే బాధ్యత స్వీకరించడానికి మరో కొత్త పంచాయతీ సిద్ధంగా వుండేంతవరకు ఆ పంచాయతీనే అధికారంలో వుండనివ్వవచ్చు.

ఖాళీ అయిన స్థానానికి ఎన్నిసార్లు ఎన్నికలు జరిగినా "పంచ్" ఎన్నిక కానిపక్షంలో మద్రాసు రాష్ట్రంలో వలెనో కో-ఆప్ట్ చేసుకునేందుకు పంచాయతీకి హక్కు వుండాలనడం మంచిపద్ధతి కాదు. ఎందుచేతనంటే పంచాయతీలు ఆ విధంగా కో - ఆప్ట్ చేసుకోవడంవల్ల గ్రామంలోని వివిధ వర్గాలను పంచాయతీ పూర్తిగా ప్రతిబింబించలేదని బిల్లు భావిస్తోంది. కాబట్టి ఆఖాళీ స్థానంలో అందుకు తగిన అర్హుడ్ని నియమించే అధికారాన్ని బిల్లు ఇన్‌స్పెక్టర్‌కు యిచ్చింది. ఈ సూచన మొదటిదానికన్నా చాలా కష్టంగావుంది. నియోజకవర్గం ఏఒక్క అభ్యర్థినీ ఎన్నుకోలేక విఫలమైన పక్షంలో, గ్రామంలోని తదితర ప్రతినిధులంతా కలసి సమిష్టి తెలివితో గ్రామ పరిస్థితుల దృష్టిలో వుంచుకుని మంచి అర్హతగల వ్యక్తిని కో - ఆప్ట్ చేసుకోవచ్చు. ఇందుకై ముస్ముందు జరిగే ఎన్నికల్లో అభ్యర్థిని గెలిపించేందుకై నియోజకవర్గ ప్రజల్ని చైతన్యవంతుల్ని చేయడం ప్రజాతంత్ర పద్ధతిగా వుంటుంది.

పంచాయతీ ఎన్నికల ఓటర్ల జాబితాను తయారు చేయడానికి సంబంధించిన బిల్లులోని అంశాన్నిగూర్చి జాగ్రత్తగా పరిశీలించాల్సివుంది. ఏవో కొన్ని పరిపాలనా నిర్వహణ చిక్కులు, యిబ్బందుల పేరుతో, పంచాయతీ ఓటర్ల జాబితాల్లో ఎన్నిక జరగడానికి ముందు కనీసం 30 రోజులలోగా ఎట్టి చేర్పులూ-మార్పులూ చేయడం మంచిది

కాదని బిల్లు చెపుతోంది. కాని ఈ పద్ధతివల్ల అనేకమంది ఓటర్లు తమ ఓటు హక్కును కోల్పోతారు. ఈ విషయంలో జనరల్ ఎన్నికల చట్టంలో పొందుపర్చబడివున్న అంశాన్ని అమలు జరపడం అవసరం. పంచాయతీ ఎన్నికల నిమిత్తం, అసెంబ్లీ రూల్సు ఆమోదింపబడ్డ తరువాత ఓటర్ల జాబితాలో మార్పులు చేయడానికి ఈబిల్లు ఎటువంటి అవకాశమూ కల్పించడంలేదు. జాబితాలో మార్పులు చేయడానికి తగిన వ్యవధి యివ్వడం యింకా సముచితంగా వుంటుంది. ఇందువల్ల స్థానిక ప్రజల్లో వెంటనే ఉత్సాహం కలుగుతుంది. ఫలితంగా పంచాయతీ ఎన్నికకు ఓటర్ల జాబితాను తాజాగా తయారుచేయవచ్చు. ఎన్నిక వాతావరణం ఏర్పడి నామినేషన్ల తేదీకి కొద్దిరోజుల ముందువరకూ ఓటర్ల జాబితాలో తప్పొప్పులను సరిచేసే పద్ధతి కొనసాగుతూ వుండవచ్చు. అందువల్ల ఎన్నిక జరగడానికి 30 రోజులు ముందుగానే ఓటర్ల జాబితాలో తప్పొప్పులు దిద్దుకోడానికి తగిన అవకాశం లేకుండా చేయడమంటే, వాతావరణం చల్లబడిపోయి, ఎన్నిక సమయంలో అవసరమైన సరైన ఉత్సాహాన్ని దెబ్బతీయడమే కాగలదు.

సమానత్వ ప్రాతిపదికపై న్యాయమైన సూత్రాలు నిలబడాలంటే అధికారాల బదలాయింపుకు సంబంధించిన ప్రభుత్వ విధానాలన్నింటినీ కొంతవరకు కేంద్ర అధికారం కంట్రోల్ చేయడం తప్పనిసరి. అయితే దీనిఅర్థం రాష్ట్రస్థాయిలో అధికారాలు యింకా ఎక్కువగా కేంద్రీకరింపబడాలని కాదు.

ప్రజాతంత్ర పద్ధతుల్లో బాగా నమ్మకం వున్నవారు, స్థానిక పరిపాలనా విషయంలో పాల్గొనాలన్న సాధారణ పౌరుని ఉద్దేశాన్ని సహితం రూపుమాపి, నిర్వీర్యంచేసేంతగా రాష్ట్ర స్థాయిలో అధికారాలు ప్రోగుపడకుండాచూసే పద్ధతులను అనుసరించాలని ఎప్పుడూ కోరుతూనే వున్నారు. ఏమంటే స్థానిక పరిపాలనా వ్యవహారాలలో పౌరులు ఎంత ఎక్కువగా పాల్గొంటే ప్రజాస్వామ్యానికి అంత పుష్టి చేకూరుతుంది. కాబట్టి, అధికార వికేంద్రీకరణ అవసరం. యంత్రాంగం ఒక్కచోటనే పోగుపడకుండా వికేంద్రీకరించడం అవసరమైవుంది. అలా వికేంద్రీక

లింపబడ్డ అధికారులను. యంత్రాంగాన్ని స్థానిక ప్రాంతాలకు చెందిన ప్రజా ప్రతినిధులే కంట్రోలుచేసి, నిర్వహించాలి. పంచాయతీలు మంచి చొరవతో, పటుత్వంతో, విజయవంతంగా నిర్వహించుకోగలిగితే, పంచాయతీ అధికారం క్రిందకు రాగల వివిధ రంగాలలో ప్రభుత్వం తను అప్పటివరకూ నిర్వహిస్తున్న విధులన్నింటినీ పంచాయతీకే అప్ప గిస్తుంది. అయితే అజమాయిషీ, సలహా, ఉన్నత స్థాయిలో పథకాల నిర్వహణ విధులనుమాత్రం ప్రభుత్వమే నిర్వహిస్తుంది. అవసరమైన ప్పుడు పంచాయతీలకు అదనపు ఆర్థిక సహాయంచేసే విధి ప్రభుత్వా నికి వుంది.

పై విషయా లన్నింటి దృష్ట్యా చూస్తే, బిల్లులోని వివిధఅంశాలు ఇన్‌స్పెక్టర్ల చేతుల్లోగాని, ప్రభుత్వం చేతుల్లోగాని మితిమీరిన అధికారా లను కేంద్రీకరించడానికి ఉపయోగపడతాయి. ఈ విధంగా పంచాయతీ లను కేవలం అధికారుల చేతి కీలుబొమ్మలుగా తయారు చేస్తున్నాయి. నిర్ణీతమైన జనాభా, ప్రాంతాల ప్రాతిపదికగా నియోజకవర్గ విభజన దగ్గరనుండి పంచాయతీ రద్దువరకూ మొత్తం కర్మకాండంతా ప్రభుత్వం చేతుల్లోనే వుంది. పంచాయతీ సభ్యుల సంఖ్యా నిర్ణయం; పంచాయతీ కాలపరిమితి హెచ్చింపు లేదా తగ్గింపు సమస్యా; ఖాళీ అయిన స్థానా నికి తగిన వ్యక్తిని నియమించడం; పనికిరానివాడిని తొలగించడం, సభ్యుల తగాదాలను పరిష్కరించడం, తాత్కాలికాధ్యక్షుణ్ణిగాని, ఉపాధ్యక్షుణ్ణిగాని తొలగించడం, స్పెషల్ ఆఫీసర్ల నియామకం, పంచాయతీలను రద్దుపర్చడం వగైరా అధికారాలన్నీ ప్రభుత్వం చేతులలోనే వుంటాయి. అంతేగాదు. పంచాయతీలు ఆమోదించిన ఉత్తర్వులను; పంచాయతీలు ఆమోదించే యితర ఉప కార్య క్రమాలను కంట్రోలుచేసే అధికారులూ; పంచాయతీ ఉద్యోగులు; ఇన్ స్పెక్షన్, గ్రాంట్లు. రుణాలపై ఆడిట్ కంట్రోలు, అప్పెలేట్, లేదా రివిజినల్ బాధ్యతల నిర్వహణలో తప్పులు జరిగితే వాటిపై చర్య తీసు కునే అధికారమూ కూడా ప్రభుత్వం చేతుల్లోనే వుంటాయి.

ఈ విధమైన కంట్రోల్ అధికారాలు మితిమీరినవనే కాదు మన విమర్శ; ఈ అధికారాలు అనేక సందర్భాలలో దుర్వినియోగం చేయ

బద్ధాయనేది కూడా మన విమర్శగా వుంది. వ్యక్తిగత పంచాయతీల సామర్ధ్యత, నిజాయితీల పట్ల ఏవో కొన్ని భయసందేహా లున్నందువలనే ఇటువంటి కంట్రోలు అవసరమని భావించినట్లయితే, కాలంతీరిన ఈ రకమైన కంట్రోలుకన్నా చాల శక్తివంతమైన పరిష్కార మార్గం మరొకటి వుంది. కేంద్రీకృతాధికారమూ, నియంతృత్వమూ వికేంద్రీకరణ - ప్రజాస్వామ్యాలకన్నా కొంతకాలం మెరుగ్గా అవుపించవచ్చు. కాని దీర్ఘకాలాన్ని దృష్టిలో పెట్టుకున్నప్పుడుమాత్రం ప్రజాస్వామ్యం, లేదా వికేంద్రీకృతాధి కారాలదే పైచేయి అవుతుంది. ఇతర పరిస్థితు లన్నింటికన్నా ఇవి ఎక్కువ విజయాలు సాధిస్తాయి. ముఖ్యంగా స్థానికాభివృద్ధి, స్థానిక సంక్షేమ వ్యవహారాలలో మంచి విజయాలు సాధిస్తాయి. ప్రస్తుతం మన గ్రామాలలోని అనేక స్వపరిపాలనా సంస్థలు సమర్ధవంతంగా పనిచేయలేక పోతున్నాయంటే కారణం, వాటికున్న అధికారాలు పరిమితమై వుండడంవల్లా, కార్యభారం విస్తృతంగా వున్నందువల్లనూ, ఆర్థిక వనర్లు చాలీచాలనంతగా వుండడమూ, గ్రామ పంచాయతీతో సన్నిహిత సానుభూతి పూర్వకమైన సంబంధాలు లేకపోవడం, ప్రభుత్వంనుండి తగిన తెలివైన న్యాయ సలహా సహకారాలు లేకపోవడమే. పైగా స్థానిక స్వపరిపాలనా సంస్థలకు ఎన్నికయే వ్యక్తులకు పరిపాలనా వ్యవహారాలలో తగిన తర్ఫీదును యివ్వడానికి అటు ప్రభుత్వంగాని ఇటు ప్రజాసంస్థలుగాని, రాజకీయ పార్టీలుగాని ఎటువంటి ప్రయత్నాలు చేయలేదు. ఈ సందర్భంలో ఈ గ్రామీణ సంస్థలను నిజమైన స్వపరిపాలనా శాఖలుగా రూపొందించేందుకు వీలుగా బిల్లులోని కంట్రోల్ విభాగానికి చెందిన అంశాలను ప్రభుత్వం తగురీతిగా సవరించగలదనే ఆశిద్దాం.

స్వపరిపాలనా సంస్థల బాహ్య నిర్మాణం, అంతర్గత నిర్మాణ ఏర్పాట్లు ఏ విధంగా వున్నా, వీటిని నిర్వహించే వారిమీద, వారి పని ఉత్సాహంమీదనే వాటి అంతిమ విజయం ఆధారపడి వుంటుందనేది స్ప ం. పంచాయతీల పని తీరుతెన్నులూ, అవి రూపొందించే నాయ

కత్వంమీదనే ప్రభుత్వ భవిష్యత్తు ఆధారపడి వుంటుంది. ప్రస్తుత బిల్లును ప్రభుత్వం ఇంకా మెరుగుపర్చి, పైన వివరించిన లోపాలను తొలగించి, వివిధ కమిటీలు, కమిషన్లూ చేసిన సూచనలు ఆధారంగా దానిని పునఃరచిస్తుందని ఆశిస్తున్నాను.

# ప్రణాళికలకు మూలమేది?

## ఆంధ్రప్రదేశ్‌లోని వికేంద్రీకరణయొక్క ఆర్థికాంశాలు

శ్రీ కె. అనంతరాం

(ప్రిన్సిపాల్, బద్రుకా కామర్సు కళాశాల)

ఆర్థికశక్తుల యిష్టాయిష్టాలకు వదలినప్పుడు అనేక బడుగు ప్రాంతాలలో నిస్తబ్దత ఆవరించింది. దీన్నిబట్టి ఈ ప్రాంతాలలో ఆర్థికాభివృద్ధి అనేది కేవలం అనివార్యమైనదే కాదని స్పష్టమవుతోంది. కాబట్టి, ఆర్థికాభివృద్ధిని మరింత ఎక్కువగా ప్రోత్సహించాలి. కావుననే ఆర్థికాభివృద్ధిని తీవ్రంగా త్వరగా సాధించాల్సిన అవసరం వుంది. ప్రభుత్వం బాధ్యతలు స్వీకరించినప్పుడు మాత్రమే ఇదిసాధ్యం. ఈ విధానం విజయవంతం కావాలంటే, అందుకు తగిన చోదకశక్తి అవసరం. ఆర్థికాభివృద్ధికి అవసరమైన తదితర శక్తుల్ని సమీకరించడం ప్రధానంగా వుండాలి. స్వయంపోషకాభివృద్ధికి అవసరమైన శక్తుల్ని సృష్టించుకోవడంమీదా ఆ విధానం విజయం పొందేదీ లేనిదీ ఆధారపడి వుంటుంది. మనలాంటి ఆర్థికంగా వెనుకబడిన బడుగు దేశంలో అనేక సవాళ్ళు ఎదురవుతున్నాయి. ఈ సందర్భంలో, మొదట్లో కేంద్రీకృతాధికారంనుండి తుదకు అందరికి తెలిసిన ప్రజాతంత్ర వికేంద్రీకరణ ప్రాతిపదికగా వున్న ఆర్థిక ప్రణాళికాభివృద్ధిని ప్రతి ఒక్కరూ అర్థం చేసుకోవాలి. పై అంతస్థునుండి ప్రణాళికలు అమలు జరగడమూ అంటే, ప్రభుత్వ ఏజెన్సీల విధులను అంగీకరించినట్లే అర్థం - ఇది తప్పనిసరి. ఎందుచేతనంటే, బయటివారి ప్రమేయం లేకుండానే ఆర్థికాభివృద్ధికి చెందిన మెళకువల ద్వారా, ఆర్థికాభివృద్ధి వనర్లను క్రింది వారికి బదలాయించడం ద్వారా ఆర్థిక వ్యవస్థను నెలకొల్పుకోడం సాధ్యమవుతుంది. అలాగే ప్రజాతంత్ర వ్యవస్థలో ఆర్థికాభివృద్ధి అనేది

ఎంత విస్తృతమైనా ఎంత త్వరితగతిని సాగుతున్నా, ఆ అభివృద్ధి సాధనలో ప్రజలు ఎక్కువగా పాల్గొనకపోయినట్లయితే ఆ అభివృద్ధిని నిలబెట్టడం సాధ్యంకాదు. అటువంటి అభివృద్ధిసజీవమైనదిగానూ వుండదు. నానాటికి పెంపొందుతున్న ఆర్థికావసరాలకు అనుగుణంగా సకాలంలో ప్రజల ఉత్సాహాన్ని, శక్తిసామర్థ్యాల్ని, వారి చొరవను, రేకెత్తించక పోయినట్లయితే, అభివృద్ధిచేసి వినియోగంలోకి తెచ్చుకోక పోయినట్లయితే ప్రభుత్వమే నియంతృత్వంగా వ్యవహరించి అప్పటికే దారిలోవున్న ఆర్థికాభివృద్ధిని కొనసాగించడానికి, ఆ భారాన్ని వహించడానికి తప్పనిసరిగాపూనుకోవాల్సి వస్తుంది. కాబట్టే, ప్రణాళికాభివృద్ధి క్రమంలో క్లిష్టదశలో ప్రభుత్వం, వివిధ ప్రాంతాలలోని ఆర్థికాభివృద్ధి అవసరాలకు అనుగుణంగా వనర్లనూ, చొరవనూ అభివృద్ధిచేసి సమన్వయం చేయడానికి వికేంద్రీకరణ విధానాన్ని అనుసరిస్తుంది.

ఈ విధమైన ప్రజాతంత్ర వికేంద్రీకరణ అనేది వాస్తవానికి ప్రణాళికలకు మూలాధారం. ఈ పథకాన్ని రూపొందించింది బల్వంతరాయ్ మెహతా కమిటీ. దీని నిప్పుడు దేశమంతటా అమలు జరుపుతున్నారు. పంచవర్ష ప్రణాళికలను తయారుచేసి, వాటిని అమలు పర్చడంలో ముఖ్యంగా ఆరోగ్యం, విద్య, వ్యవసాయం, సమాజాభివృద్ధి పథకాలను అమలుపర్చడంలో ప్రజల ఉత్సాహపూరితమైన సమర్థవంతమైన సహకారాన్ని సాధించడం ఈపథకంయొక్కలక్ష్యం. స్థానిక ప్రజల్లోవున్న చొరవను, వనర్లనూ అభివృద్ధిచేసి ప్రోత్సహించడం స్థానికంగా ప్రజలలోతెలివితేటల్ని వినియోగించుకొని నాయకత్వాన్ని అభివృద్ధి చేయడం, తాము ఆనందంగా వున్నామన్న భావాన్ని జాతీయాభివృద్ధి పనులలో పాల్గొంటున్నామన్న భావాన్ని ప్రజలలో కలిగించడమూ ఈ సంస్కరణల ఉద్దేశం.

ప్రణాళికలను ప్రజాతంత్రయుతం చేసే ఈ ప్రయోగం దేశంలో అనేక ఆశలను రేకెత్తించింది. పెద్దఎత్తున నిర్మాణయుతమైన కార్యక్రమాలు తలపెట్టడం విషయంలో దేశానికి తగ్గిన స్తోమతలేదు. ఒకవైపున ఈరకమైన జాతీయ బలహీనతవున్నా, పంచాయతీతో ప్రారంభమై

పంచాయతీ సమితులు జిల్లా పరిషత్తులవరకూ మూడంతస్తులలో నిర్మితమయే వికేంద్రీకరణ పద్ధతి, ప్రజల చొరవ, ప్రజా వనరులపైనే ఆర్థిక ప్రణాళికలు ఎక్కువగా ఆధారపడాలన్న మన గాఢమైన కోర్కెకు నిదర్శనం. ప్రజాస్వామిక దేశంలో ఆర్థికాభివృద్ధికి సంబంధించిన ఏ విధానమైనా విజయం పొందాలంటే పెద్దఎత్తున ప్రజల చొరవ, సమర్థవంతమైన సహకారానికన్నా మరో గ్యారంటీలేదు. అంతేగాదు; ఈ సంస్థలు ఏవిధంగా పనిచేస్తాయన్న దానిపైకూడా ఎక్కువ ఆధారపడి వుంటుంది, మన ప్రధాన సమస్యలు ఆర్థిక సంబంధమైనవి. కాబట్టి, ఆర్థిక వ్యవహారాలలో వికేంద్రీకరణ ప్రధాన మైనదిగా ఎంచబడింది. కాబట్టి, ఈ సంస్థలను రాజకీయాలకు అతీతంగా వుంచాలనడం వాంఛనీయమే కాదు; అలా వుంచాల్సిన బాధ్యత కూడా మనమీద వుంది. ఈ సంస్థలు పోటీ పార్టీల అధికారానికి వేదికలు కాకూడదు, ఆర్థికాభివృద్ధికి సంబంధించిన ప్రజాతంత్ర సంస్థలుగానే ఇవి భావించి, పని చేయాలి.

ఈ ప్రయోగంలో పంచాయతీ సమితులు ప్రధాన పాత్ర నిర్వహించాల్సివుంది. ఈ ప్రయోగం జయప్రదమైతే (జయప్రద మవాలి) దేశ ఆర్థిక సమస్య పరిష్కార మవుతుంది. సమాజాభివృద్ధి, వ్యవసాయం, పశుగణాభివృద్ధి, ఆరోగ్యం, గ్రామీణ పారిశుధ్యం, విద్య, గృహపరిశ్రమలు, అటవీ, లెక్కల సేకరణ వగైరా కార్యక్రమాల అమలుకు ఈ సంస్థలు పూనుకోవాలి. ఈ పరిస్థితుల్లో ప్రజలు ముందుకొచ్చి, ప్రజాతంత్ర బాధ్యతలను స్వీకరిస్తారా?

తప్పకుండా స్వీకరిస్తారన్నదే ఈ ప్రశ్నకు సమాధానం.

సమాజాభివృద్ధి పథకాలకు సంబంధించిన "అంచనాల నివేదికలు" అనేక అవకతవకలను, లోసుగులను బయటపెట్టాయి. వీటిల్లో కొన్ని చాల తీవ్రమైన లోసుగులు కూడా వున్నాయి. ముఖ్యంగా అయిదవ నివేదికను చూస్తే, జిల్లా బ్లాక్‌స్థాయిలలో స్థానికాభివృద్ధి లక్ష్యాలను పై అధికారులు నిర్ణయించారని, స్థానికాభివృద్ధి పథకాన్ని ప్రధానంగా నిరంకుశ ప్రభుత్వాధికార వర్గమే నిర్వహించి అమలు జరిపిందని తెలుస్తుంది, ఈ పథకాలు అమలు విషయంలో పంచాయతీలను ఆవలికి

నెట్టడం జరిగింది. అభివృద్ధి ప్రణాళికతో ప్రజలు ఉత్సాహానికి గాని, ఆసక్తికిగాని ద్రోహం తలపెట్టలేదంటే ఆశ్చర్యంలేదు. కాని ప్రజలు కష్టాలు చవిచూస్తున్న పరిశీలకులుగా ఈ ప్రణాళికల పట్ల మౌనం వహించారు.

ఇంతకుముందే చెప్పినట్లు, స్థానిక కార్యకర్తల సాయంతో గ్రామ పంచాయతీ సమితులు వికేంద్రీకృతాధికార నిర్మాణంలో కీలక పాత్ర వహిస్తాయి. ఈ సంస్థలకు అభివృద్ధి కార్యక్రమాలకోసం కేటాయించిన నిధులతోపాటు, పన్నులద్వారా వనర్లను పెంచుకునేందుకు వీటికి అధికారాలు కూడా సంక్రమించాయి. అడ్ హాక్ (తాత్కాలిక) గ్రాంట్లు, అప్పురూపంలో ఎప్పుడు అవసరమైనా ఎక్కువ వనర్లు లభిస్తాయి. విస్తరణ శాఖల, సమాజాభివృద్ధి ఆఫీసర్లు సమితుల అధిపత్యం క్రిందకు వస్తారు. ఈపని క్రమానుగతంగా జరుగుతుంది. ఈ పద్ధతి గ్రామస్థాయినుండి సబ్-డివిజను స్థాయికి, అక్కడినుండి జిల్లా స్థాయి వరకు ఒక గొలుసుకట్టు క్రమంలో సాగుతుంది.

ఈ నూతన ప్రయోగంక్రింద, గతంలో ఆర్థికాభివృద్ధి కార్యక్రమాలను సహితం అశ్రద్ధ వహించి సంక్షేమ కార్యకలాపాలకే ఎక్కువ ప్రాధాన్యత నిచ్చిన పద్ధతి పూర్తిగా మారిపోనున్నది. ఉత్పత్తి కార్యక్రమాలకు ప్రాధాన్యత నిస్తూ గ్రామ పంచాయతీలకు బాధ్యతలు అప్పగించబడ్డాయి. ఋణ, మార్కెటింగ్ సహకార సంఘాల అభివృద్ధిని త్వరితం చేయడం, చిన్నతరహా నీటివనర్ల నిర్మాణం, కుటుంబ నియంత్రణ పథకాలను బాగా ప్రచారం చేయడం ఈ గ్రామ పంచాయతీల బాధ్యతై వున్నది. గ్రామీణార్థికాభివృద్ధికై ప్రణాళికను రూపొందించుకోవడమనేది పంచాయతీల ప్రాథమిక బాధ్యత.

జిల్లా పరిషత్ అనేది అజమాయిషీ, సలహా, సమన్వయీకరణ సంస్థగా పనిచేస్తుంది. సమితులకు సూచనలు, సిఫార్సులు, తుదకు బడ్జెట్ విషయాలపైకూడా సూచనలు చేసేందుకు జిల్లా పరిషత్‌కు హక్కు ఉన్నది. అభివృద్ధి ప్రణాళికలు, పనులకూ సంబంధించిన విషయాలలో జిల్లాపరిషత్ ప్రభుత్వానికి, ప్రజలకూ మధ్య "లింకు"గా పని చేస్తుంది.

ఈ వికేంద్రీకృతాధికార విధానాన్ని అమలు పర్చడంలో ఆంధ్ర ప్రదేశ్ తగు సముత్సాహంతో ముందుకొచ్చింది. ఈ నూతన ప్రయోగం విజయవంతం గావడానికి ఈ రాష్ట్రంలో రాజకీయ, ఆర్థిక వాతావరణం తగినదిగా వుంది. వికేంద్రీకృతాధికారం అనే సూత్రం వెళ్ళాల్సినంత దూరం వెళ్ళదని ఈసూత్ర విమర్శకులు చెప్పొచ్చుగాక. కాని, జిల్లా పరిషత్తులకు, అధికారులకు పైకి ఎక్కువ అధికారాలుగా అవుపిస్తున్న అధికారాలను సంక్రమింపజేసినప్పటికీ, వాటిని ప్రాథమిక దశల్లోజాగ్రత్తకోసం అప్పగించిన రక్షణలుగా ఎంచాలి. అంతేగాని, అధికారాన్ని త్యజించడానికి ససేమిరా ఒప్పుకోని నిరంకుశాధికారానికి (బురాక్రసీ) సోపానాలుగా భావించరాదు. ఈ ప్రయోగ పథకం అసలు జరిగిన తీరు సంతృప్తికరంగా వున్నట్లయితే, అధికంగా అవుపిస్తున్న ఈ అధికారాలను వినియోగించాల్సిన అవసరంగాని, లేదా అధికారుల జోక్యంగాని అవసరం వుండదు. మరోవిధంగా చెప్పాలంటే, ఈ పథకం అమలుకు తోడ్పడ్డ ఉత్సాహమూ, దానిపై ఏర్పడ్డ సుసంప్రదాయాలే__ఈ వికేంద్రీకృతాధికార పథకం కేవలం కాగితంమీదనే వుండకుండా ఆచరణలో దాని విజయానికి గ్యారంటీ యిస్తాయి. ఈ పథకం అధికారాల బదలాయింపుకు, వికేంద్రీకరణకు మధ్యేమార్గంగా అవుపిస్తుంది. కాని ఈ పథకం పూర్తి వికేంద్రీకరణవైపే సాగిపోతుంది. ఏది ఏమైనప్పటికి ఈ ప్రయోగంయొక్క విజయంగాని, ఓటమిగాని, ఆర్థిక సమస్యాపరిష్కారానికి భారతదేశం ప్రజాస్వామిక మార్గాన్నే అనుసరించాలా లేక మరో ప్రత్యమ్నాయ మార్గాన్ని ఎంచుకోవాలో తేల్చివేస్తుంది, ఈదేశ ప్రజలకు భవిష్యత్తు వుంది. ఏ "నిజమైన స్వరాజ్య" సాధనకోసం మహాత్మా గాంధి కలలుకన్నారో ఆకలను, ఆ వాస్తవిక స్వరాజ్యాన్ని సాధించడంలో విజయమేగాని, అపజయం వుండబోదని నాయకులు నమ్మకంతో వున్నారు.

# ప్రజాతంత్ర వికేంద్రీకరణ : కొన్ని పరిపాలనాంశాలు

శ్రీ జి. ఆర్. రెడ్డి; ఎం. ఎల్. సి.
(ఎకనామిక్స్) లండన్
(లెక్చరర్, పబ్లిక్ అడ్మినిస్ట్రేషన్, ఉస్మానియా యూనివర్శిటీ.)

"నేటి ఆధునికయుగంలో అనేక పడికట్టు పదాలు వాడేనిమిత్తం మానవుడు తన ఆధునిక భావాలను ప్రదర్శించుకొనేందుకు, వాటిపట్ల ఉత్సుకత, గౌరవంచూపుతాడు వీటిల్లో నేడత్యంత శక్తివంతమైనపదంగా ప్రజాతంత్ర వికేంద్రీకరణ భాసిల్లుతోంది" అని శ్రీ ఎ. డి. గోర్వాలా ఒక సందర్భంలో చెప్పారు. ఒకానొక ప్రముఖ సివిల్ ఉద్యోగి చెప్పిన ఈ మాటలు నేడు ఆంధ్రప్రదేశ్‌లోనూ, మరికొన్ని యితర రాష్ట్రాల లోనూ కొనసాగుతున్న నూతన ప్రయోగం పట్ల ఎదుటివారికి ఏహ్య భావం కలిగిస్తాయి. కాని ప్రతీదీ ద్వేషించే స్వభావం గలవారు ఎటు వంటి నిర్మాణాత్మకమైన పనిని తలపెట్టరు. ఆధునిక సమస్యలను ఆధు నిక భావాలతోనే పరిష్కరించాలని మన విజ్ఞానం డిమాండ్ చేస్తోంది.

ఆంధ్రప్రదేశ్‌లో ఇటీవలనే ప్రజాతంత్ర వికేంద్రీకరణ "కార్య క్రమం ప్రారంభమైంది." "ప్రజాతంత్ర వికేంద్రీకరణ" అనే పదాన్ని 1957 లో సమాజాభివృద్ధి, జాతీయ విస్తరణ పథకాల పరిశీలనాబృందం తన నివేదికలో మొదటిసారిగా వాడింది. అప్పటినుండి ఈ పదం - ప్రజాతంత్ర వికేంద్రీకరణ - ప్రచారంలోకి వస్తోంది. అప్పుడే కొన్ని రాష్ట్రాలు ప్రజాతంత్ర వికేంద్రీకరణ కార్యక్రమాన్ని అమలు జరప డానికి చర్యలు తీసుకొన్నాయి కూడా. ఈ కొన్ని రాష్ట్రాలలో ఆంధ్ర ప్రదేశ్‌కు కూడా ఆ గౌరవం దక్కింది.

మొదట్లో మనం అసలు "ప్రజాతంత్ర వికేంద్రీకరణ" అన్న పదాన్నిగూర్చి కొంత తెలుసుకోవడం సమంజసంగా వుంటుంది, ఒక్కొక్కప్పుడు "వికేంద్రీకరణ" అన్న మాటను "బదలాయింపు", "ఒక్కచోట ప్రోగుపడకుండా వుండడం" అని తప్పుగా ర్థం చేసుకోవడం జరుగుతోంది, "బదలాయింపు" (డెలిగేషన్) జరిగినంత మాత్రాన, అధికారాలు బదలాయింపబడ్డ సంస్థగాని, వ్యక్తిగాని చేసే పనులన్నింటిని నిర్వహించాల్సిన తుదిబాధ్యత మాత్రం ప్రభుత్వానికి లేకుండా పోదు. ఆధునిక ప్రభుత్వ యంత్రాంగంలో "కార్యనిర్వాహక వర్గంయొక్క బదలాయింపు చట్టాధికారం" (పవర్ ఆఫ్ డెలిగేటెడ్ లెజిస్లేషన్) ఈరకం "బదలాయింపు" క్రిందకే వస్తుంది. అలాగాక "వికేంద్రీకరణ" అనేది ఒక రకమైన పాలనా పద్ధతి. ఈ పద్ధతి ప్రకారం, కొన్ని విధులనూ బాధ్యతలనూ ప్రభుత్వం పూర్తిగా వదలుకుంటుంది. వీటిని మరో అధికారానికి అప్పగిస్తుంది. అంటే అలా పూర్ణాధికారాలు లభించిన సంస్థ లేదా అధికారికిగాని ప్రభుత్వంనుండి పూర్తిస్వేచ్ఛ లభిస్తుంది. అత్యవసరమైన అజమాయిషీ అధికారాలు మాత్రమే ప్రభుత్వం చేతుల్లో వుంటాయి. దీన్నిబట్టి "బదలాయింపు"కు, "వికేంద్రీకరణ"కు మధ్యవున్నభేదం స్పష్టమైంది. అయితే మరల "వికేంద్రీకరణ"కూ, "ఒకేచోట ప్రోగుపడకుండా వుండడం" అన్న దానికీ బేధంవుంది. "ఒకేచోట ప్రోగుపడకుండా వుండడం" అనే పదం ఒకానొక ప్రత్యేక ఏజన్సీ విషయంలో అంతర్‌స్థాయీ లేదా కేంద్రకార్యాలయ రంగానికి మధ్యవున్న సంబంధబాంధవ్యాలకు సంబంధించినది. అలాగే కొన్ని కేంద్రప్రభుత్వవిధులను స్థానిక లేదా ప్రాంతీయ ఆఫీసరు లేదా అవుట్‌స్టేషన్‌లకు అప్పగించడమనేది కూడా దానిక్రిందకేవస్తుంది. వీటిపై సమయా సమయాలనుబట్టి కేంద్ర కార్యాలయాలు కంట్రోలువుంటుంది. అంటే, ప్రధానాధికారమనేది ఫీల్డు, రీజినల్ (ప్రాంతీయ) ఆఫీసులలోనే కేంద్రీకరింపబడివుంటుందన్న మాట. ఈసందర్భంలో పోష్టుఆఫీసుశాఖ నిర్మాణం చక్కనిఉదాహరణ. కేంద్రతంతి, తపాలాశాఖ, దేశంలోని అనేక ఫీల్డుఆఫీసులద్వారా పని చేస్తుంది. ఈ ఆఫీసులకు అనేక అధికారాలు సంక్రమించినా, అజమా

యిషి, సలహా సంప్రతింపులకోసం కేంద్ర (హెడ్ అఫీసు) కార్యాలయంవైపు చూస్తూంటాయి, ఇవి స్వపరిపాలనా సంస్థలుకావు, పైగా వికేంద్రీకరణ అంటే "స్థానికప్రభుత్వఏర్పాటు...."—అంటే, కేంద్ర ప్రభుత్వ లేదా రాష్ట్రప్రభుత్వాలు మినహా మిగతా సంస్థలకు స్వపరిపాలనాధికారాలను సంక్రమింప జేయడం అనిఅర్థం. కాని ఈ వ్యత్యాసాన్ని చాలామంది రచయితలు గుర్తించడంలేదు. "వికేంద్రీకరణ", "ఒకేచోట అధికారాలు ప్రోగుపడకుండా వుండడం" అన్న పదాలను రెంటినీ కలగాపులగం చేస్తున్నారు, ప్రస్తుతం మన చర్చకోసం "వికేంద్రీకరణ" అన్నపదాన్ని "రాష్ట్ర, కేంద్రప్రభుత్వాలకు మినహా తదితర సంస్థలకు" "స్థానిక ప్రభుత్వాధికారాన్ని యివ్వడం" అని అర్థంలో వాడుకుందాం.

ఇక "ప్రజాతంత్ర" అన్న విశేషణ మొకటువుంది: ప్రజాస్వామ్యం అంటే అదొక తరహా ప్రభుత్వమని, ఆ ప్రభుత్వంక్రింద ప్రజలచేతుల్లో అత్యున్నతాధి కారాలుంటాయని చెప్పబడుతోంది. అధికారాలు నిర్వహించే సంస్థలు ప్రజలకు బాధ్యతవహించేవిగావున్నాయి. అటువంటప్పుడు ప్రజాతంత్ర వికేంద్రీకరణ అంటే, ప్రభుత్వం కొన్ని బాధ్యతలూ, విధులనూ వదలుకొని, ప్రజలకు ప్రాతినిధ్యం వహించే "ప్రజాతంత్ర" సంస్థలకు ఆ బాధ్యతలను, విధులనూ అప్పగించడమన్నమాట.

ప్రజాతంత్ర వికేంద్రీకరణ అనేది గ్రామీణ ప్రాంతాలకు ప్రజాతంత్ర సంస్థలను విస్తరింపచేయడంతో సంబంధం వున్నది. కేంద్రంలోనూ, రాష్ట్రాలలోనూ ప్రజాస్వామిక ప్రభుత్వాలు ఏర్పడ్డ తరువాత ఇది అనివార్యమైన చర్యగా ముందుకొచ్చింది, ప్రజాస్వామ్యం అనేది ఉన్నతస్థాయీలలోనూ, క్రిందిస్థాయిలోనూ నిరంకుశాధికారాలూ చెలామణి అయినట్టయితే అది ప్రజాస్వామ్యానికి విరుద్ధం, అందుకనే భారతరాజ్యాంగంలోని ప్రభుత్వవిధానాలకు సంబంధించిన "చోదక సూత్రాలలో" (డైరెక్టివ్ ప్రిన్సిపిల్స్) దీని ప్రస్తావన వుంది. గ్రామ పంచాయతీలు స్వపరిపాలనాశాఖలుగా పనిచేయటంఅని మనరాజ్యాంగం

చెపుతోంది. గ్రామాలు, జిల్లాలలో స్వపరిపాలనా సంస్థల విషయమై రెండు పంచవర్ష ప్రణాళికలలోనూ ప్రత్యేకంగా నొక్కిచెప్పబడింది. ఇంతకుముందే చెప్పినట్లు మెహతాబృందం నివేదికలో ప్రజాస్వామ్య పునాదులు తుదిరూపం పొందాయి.

ప్రస్తుత వ్యాసంలో మనం ఆంధ్రప్రదేశ్‌లో ప్రజాతంత్ర వికేంద్రీకరణకు చెందిన కొన్ని అంశాల్ని గూర్చి ప్రధానంగా పరిశీలిద్దాం. ఆంధ్రప్రదేశ్‌లో ప్రజాతంత్ర వికేంద్రీకరణ పథకం, 1959 నాటి పంచాయతీ సమితుల జిల్లాపరిషత్తుల చట్టంతో అమలులోకి వచ్చింది.

## 2

"ప్రజాతంత్ర వికేంద్రీకరణ" అనే భవనానికి "ప్రజాసంస్థలు" అనే మూడంతస్థుల ప్రాతిపదిక ఒకటివుంది. అట్టడుగుస్థాయిలో గ్రామ పంచాయితీలుంటాయి. వెయ్యి, లేదా అంతకుమించి జనాభావున్న గ్రామాలన్నింటికి ఈ పంచాయతీలు ఏర్పడుతాయి. ఇంతకు మించి తక్కువ జనాభావున్న గ్రామాలను కొన్నింటినికలిపి పంచాయితీలు ఏర్పరుస్తారు. గ్రామపంచాయతీల బిల్లును రాష్ట్రశాసనసభ చర్చిస్తోంది. అందువల్ల వివరమైన చర్చ జరుపడం ఇప్పుడు మంచిదికాదు.

ప్రజాతంత్ర వికేంద్రీకరణ పథకానికల్లా కీలకం - పంచాయితీ సమితి. ఇది సమాజాభివృద్ధి బ్లాకుతో విస్తృత పాతిపదికపై ఏర్పడుతుంది, రాష్ట్రం మొత్తంమీద 227 బ్లాకులున్నాయి.

ఆంధ్రప్రాంతంలోని పంచాయితీసమితిలో పంచాయతీలఅధ్యక్షులుంటారు. తెలంగాణా ప్రాంతంలోని సమితులలో అన్ని పట్టణకమిటీల అధ్యక్షులూ, గ్రామపంచాయతీల ఎక్స్ - అఫీషియోలూవుంటారు. తాము ప్రాతినిధ్యంవహిస్తున్న నియోజకవర్గంలో ఏర్పడ్డసమితి సమావేశాలకు శాసనసభ్యులు హాజరుకావచ్చు. అయితే వారికి సమావేశ

చర్చనీయాంశాలపై ఓటువేసే హక్కులేదు. అంతేగాదు: సమితిలో ఒక మహిళాప్రతినిధి; షెడ్యూల్డ్ తరగతులు లేదా కులాలకు చెందిన ప్రతినిధి: సహకార సంఘప్రతినిధి: పరిపాలనా, ప్రజాజీవితంలోనూ లేదా సాంఘికసేవలోనూ అనుభవంవున్న ఇద్దరువ్యక్తులు వుంటారు. సమితిసభ్యులు అధ్యక్షుణ్ని, ఉపాధ్యక్షుణ్ని తమలోనుండే ఎన్ను కుంటారు.

బ్లాక్ పాలనా నిర్వహణాధికారాలు సమితిచేతిలో వుంటాయి. సమితి ప్రధాన కార్యనిర్వాహకాధికారిగా బ్లాక్ దెవలప్‌మెంటు ఆఫీసరు (బి: డి ఒ) పనిచేస్తారు. సమితీ, దాని సంఘాలు చేసే తీర్మానాలను అమలుపరచే బాధ్యత ఈయనకున్నది.

సమితిపైన జిల్లాపరిషత్ ఉంటుంది. ఇందులో జిల్లాలోని పంచా యతీ సమితుల అధ్యక్షులు, జిల్లాకలెక్టరు, ఆ జిల్లానుంచి ఎన్నికైన శాసనసభ్యులు, జిల్లానుండి లోక్‌సభకు ఎన్నికైన సభ్యులూవుంటారు. పోతే రాష్ట్రశాసనమండలినుండీ, రాజ్యసభనుండీ ప్రభుత్వం పరిషత్‌కు కొంతమంది సభుల్ని నామినేట్ చేస్తుంది. మహిళలకు, షెడ్యూల్డ్ కులాల, తరగతులవారికికూడా ఇందులో అవకాశం కల్పించబడింది.

పరిషత్ అధ్యక్ష ఉపాధ్యాక్షులును పరిషత్ సభ్యులు అనధికారుల నుండే ఎన్నుకుంటారు. ప్రభుత్వం నియమించే జిల్లాపరిషత్ కార్య దర్శి పరిషత్ సమావేశాలకు హాజరవుతూవుంటాడు. ఈ కార్యదర్శి పరిషత్ చర్చలలో పాల్గొనవచ్చుగాని, అతనికి ఓటింగు హక్కు మాత్రంలేదు. ప్రభుత్వం పేర్కొన్న జిల్లాఆఫీసర్లు పరిషత్ చర్చలలో మాట్లాడవచ్చు. కాని అచర్చలపై జరిగే ఓటింగ్‌లో పాల్గొనరాదు.

ఆంధ్రప్రదేశ్ చట్టం మెహతాబృందం నివేదికతో విభేదిస్తోంది. మన చట్టంలో చేసినమార్పులు మెహతానివేదికపై మెరుగ్గావున్నాయనే చెప్పాలి. పరిషత్ అధ్యక్షుడుగా కలెక్టరు వుండాలని, ఆయన ఉద్యో గులలో ఒకరు పరిషత్ కార్యదర్శిగా వుండాలనీ మెహతాబృందం నివేదిక సూచించింది. ఇదే సూచనను ఆంధ్రప్రదేశ్ చట్టంలో యిరి

కించి వున్నట్టయితే, పరిషత్‌పై కలెక్టర్‌కు విస్తృతమైన కంట్రోల్ లభించేదన్నమాట. అంటే, ప్రభుత్వఅధికారి, ఎన్నికకాబడిన సంస్థపై ఆధిపత్యం చెలాయించడం, మెహతాబృందం సిఫార్సునే అంగీకరించడమూ అంటే బ్రిటిష్‌కాలంలో కౌన్సిళ్ళస్థితి మనకు జ్ఞప్తికివస్తుంది. మరో విషయమేమంటే, పరిషత్‌లో వైద్య, ప్రజారోగ్య వగైరా జిల్లా స్థాయిలోవున్న ఆఫీసర్లు ఎక్స్ - అఫీషియో సభ్యులుగా వుండాలని కూడా మెహతాబృందం తన నివేదికలో సూచించింది. అంటే ఈ సూచనప్రకారం పరిషత్ ప్రజాతంత్ర విరుద్ధమైన, అర్థప్రభుత్వసంస్థగా తారుమారై వుండేది; దీన్నిబట్టి జిల్లాఅధికారులు పరిషత్‌ను తమ చేతుల్లో ఒకపేలుముద్దర సంస్థగాతయారుచేసి వుండేవారనడంలో విప్రతిపత్తిలేదు. అలా అనడానికి అవకాశంవుంది, పరిషత్ చర్చలలో వీరు పాల్గొనవచ్చునని, అయితే అటువంటి హక్కు వీరికిలేదని కూడా ప్రదేశ్‌చట్టం చెపుతోంది. ఈ అధికారులను ఏ హోదాలో ఏ స్థాయిలో వుంచాలో వారిని ఆ స్థాయిలోనే వుంచుతోందీ చట్టం. ఒకవైపున ఆంధ్రప్రదేశ్ చట్టం మెహతా బృందం నివేదికలోని కొన్నిసూచనలను అంగీకరించకపోయినా, అయిదు సంవత్సరాల అనంతరం సాధించాలని మెహతా బృందం నివేదిక భావిస్తూన్న కొన్ని అంశాలను మాత్రం చేర్చుకున్నది.

# 3

ఇప్పుడు నూతన ప్రయోగాన్ని గూర్చి సరైన అంచనా వేసుకోవడం భావ్యంగా వుంటుంది.

ఆంధ్రప్రదేశ్ చట్టంయొక్క విప్లవాత్మకమైన స్వభావాన్నిగూర్చి ఎట్టి అనుమానమూ వుండాల్సిన పనికాదు. కాని చట్టంలో కొన్ని ప్రజాస్వామిక సూత్రాలు లోపించాయని చెప్పాలి. ఉదాహరణకు ప్రజాతంత్ర వికేంద్రీకరణపు మూడంచెస్థులలోనూ-పరిషత్, సమితి, పంచాయతీలు-పంచాయతీ మాత్రమే ప్రజాతంత్ర సంస్థ. మిగతా రెండుసంస్థలూ అంటే, పరిషత్తూ, సమితిపరోక్షంగా ఎన్నికైనట్టివి; ఇవిరెండూ ఎక్స్-

అఫీషియో సంస్థలు; ఈసంస్థలద్వారా ప్రజాస్వామ్యం ఏరూపంలో ప్రతి బింబిత మవుతుందో అర్థం చేసుకోవడం కష్టంగా వుంది. అలాగే ఆయా ప్రాంతాల ప్రజల తరపున వ్యవహరించగల సంస్థలుగా ఇవి ఎలా మెలగుతాయో కూడా అర్థం చేసుకోవడం కష్టంగా వుంది. పరోక్షఎన్నికలవల్ల అనేక లోపాలున్నాయి.

ఇక రెండో విషయం; ఈ సంస్థలు అంటే పరిషత్తూ, సమితి గ్రామపంచాయతీల కార్యకలాపాలపై అజమాయిషీ, కంట్రోల్ అధికారాలు చెలాయించవచ్చు. (గ్రామ పంచాయతీ లనేవి ప్రజాతంత్ర సంస్థలు). ప్రజాప్రాతినిధ్య సంస్థలైన పంచాయతీలపై ఈ ఎక్స్—అఫీషియో సంస్థలకు కంట్రోల్ అధికార మివ్వబడింది. ఈ సంస్థలు, లోక్‌సభ కార్యకలాపాలపై అజమాయిషీ, కంట్రోల్ అధికారాలుచూసే హక్కుగల రాజ్యసభ లాంటివి. (అయితే ఈ పోలిక కొంత ఎక్కువ మోతాదులోనే వుందనుకోండి). గ్రామాలకెట్టి "హోంరూలు" లేదు.

ప్రజాతంత్ర వికేంద్రీకరణలోని ప్రోత్సాహ కరమైన అంశ మేమంటే, ఈ సంస్థలయొక్క పాత్రను మూడు స్థాయీలలో—జిల్లా, బ్లాక్, గ్రామస్థాయిలలో—మలుస్తుంది. ఇంతకుపూర్వం ఇవి కేవలం సలహా సంస్థలుగా మాత్రమే వ్యవహరించేవి. అసలైన అధికారాలన్నీ ప్రభుత్వ అధికారుల చేతుల్లోనే వుండేవి. కాని ఇప్పుడు అభివృద్ధి కార్యక్రమాలు అమలు జరగడమనేది ఎక్కువగా ప్రజలపైనే ఆధార పడి వుంటుంది. ఈ సంస్థలు సరిగ్గా పనిచేయక పోవడానికీ, ప్రభుత్వ విధానాలు అమలు జరుగక పోవడానికి కారణం నిరంకుశాధి కారులే నని (బురాక్రాట్లు) విమర్శించే రోజులు త్వరత్వరగా గతించి పోతున్నాయి.

జిల్లాలలోను, గ్రామీణ ప్రాంతాలలోనూ ప్రభుత్వాధికారులకూ ప్రజా ప్రతినిధులకూ మధ్య ఒక విధమైన పరిపాలనా సంబంధాలు ఏర్పడుతున్నాయి. బ్లాక్ పరిపాలనా వ్యవహారాలు సమితి చేతుల్లో వున్నాయి, ఎంతటి "క్రూరమైన బ్లాక్ డెవలప్‌మెంటు ఆఫీసరు (బి. డి. ఒ)" కూడా ఘోరంగా, క్రూరంగా వ్యవహరించలేడినాడు.

ఒకవేళ అలా క్రూరంగా ప్రవర్తిస్తే, అందుకు తగిన ప్రతిఫలం పొంది తీరుతాడు। ఎందుచేతనంటే బి. డి. ఓ. ప్రస్తుతం సమితి అధ్యక్షుని పరిపాలనా సంబంధమైన కంట్రోల్ క్రింద వుండాల్సివుంది. స్వాతంత్ర్య సముపార్జనానంతరం అటు ప్రభుత్వ స్థాయిలోనూ ఇటు జాతీయ స్థాయి లోనూ ఈ నిరంకుశాధికారవర్గం రాజకీయ వేత్తల కంట్రోలు క్రిందనే వుంటూ వచ్చారు. ఇది వాస్తవం. అయితే ఈపద్ధతి గ్రామీణ ప్రాంతాలలో అమలులో లేదు. గ్రామాలలో అధికార్లు హద్దూఅదుపూలేకుండా పాలించిన రోజులున్నాయి, వారు ఆడింది ఆట, పాడింది పాట. కాని ఇప్పుడు, 'అధికారం' అనేది నెమ్మదిగా ప్రజాసంస్థలకే సంక్రమిస్తోంది గాని వ్యక్తులకు గాదు. ఇది ముఖ్యంగా బ్లాక్‌స్థాయిలో మరింతగా సాగుతోంది. ఈ విషయంలో జిల్లా, గ్రామస్థాయిలలో జరిగే అభివృద్ధి యింకా వెనుకబడే వుందని చెప్పాలి.

పరిపాలనా ప్రాధాన్యతగల మరో విశేషముంది. జిల్లాకు, గ్రామానికి మధ్యనుండే స్థాయి—అదే బ్లాక్; ఆర్థికంగానూ, సమర్థవంతంగానూ ప్రధానమైన కార్యాలను నిర్వహించాలంటే గ్రామ స్తోమత చాల తక్కువగా వుంటుంది అలాగే ఈకార్యకలాపాలను చేపట్టడమూ అంటే జిల్లా స్తోమతుకు చాలనివని. మెహతా బృందం తన నివేదికలో చెప్పినట్లు, "ప్రజాస్వామ్యం అనేది నిర్దిష్టమైన కార్యనిర్వాహక యంత్రాంగం ద్వారా పనిచేసేది. అయితే తనకార్యనిర్వాహక యంత్రాంగం ద్వారా విస్తృతమైన ప్రాంతాలపై అధికారం చెలాయించే ప్రజాతంత్ర ప్రభుత్వానికి ఆయాప్రాంతాల స్థానికావసరా లేమిటో, ఏటి పరిస్థితు లేమిటో తగిన విధంగా లెక్కగట్టడం కష్టమైన పని".

అందువల్ల ఈ సమస్యా పరిష్కారానికి జిల్లాకు, గ్రామానికీ మధ్య ఒక మెట్టును—బ్లాక్ స్థాయివుండడం ఒక్కటే ఏకైక మార్గం. ఈ బ్లాక్ స్థాయిక్రింద కొచ్చే ప్రాంతం మరీ పెద్దదిగా వుండరాదు. ఏమంటే ఏ ఉద్దేశంతో ఈ స్థాయి ఏర్పాటైందో ఆ ఉద్దేశం పూర్తిగా విఫలమొందుతుంది, అలాగే బ్లాక్‌స్థాయి క్రిందకొచ్చే ప్రాంతం మరీ చిన్నదిగానూ వుండరాదు. ఎందుకంటే, మరీ చిన్నదిగా వున్నట్టయితే

ది దాని సామర్థ్యాన్ని, ఆర్థిక విషయాల్ని చక్కదిద్దుకోవడం కష్టంగా
ంటుంది. అందుచేత రెండు విషయాల్లోనూ అతిగావుండరాదు. గ్రామ
ంచాయతీ నిర్వహించలేని విధులను నిర్వహించగల పెద్దప్రాంతంగా
ాక్ వుండాలనీ, అలాగే గ్రామీణ చొరవను, వారి సేవను వినియో
ంచుకోడానికి తగ్గ చిన్నప్రాంతంగాగాని బ్లాక్ ఏర్పడాలని మెహతా
ృందం అభిప్రాయపడింది. ఈ మధ్యరకం స్థాయిని అంటే బ్లాక్‌ను
ర్పర్చడం అనేది సరైన చర్యయే. కాని బ్లాక్‌ను మధ్యరకం యూని
గా ఎన్నుకోవడం కొంతమందికి ఇష్టంలేదు. తన కిచ్చిన విధు
ల్నింటి నిర్వహణకు తగిన పరిపాలనా యూనిట్‌గా బ్లాకు ఉపక
స్తుందా లేదా అని ప్రొఫెసర్ ఆర్చి డాట్సన్ ప్రశ్నిస్తున్నాడు.
నిర్దిష్టమైన అవసరాలను నిర్ణయించుకోవడం ద్వారా సాధ్యమైనంత
క్కువ పరిపాలనా లాభాన్ని పొందడంకన్నా, ప్రస్తుతం అమలులో
న్న యూనిట్లనుండి ఎన్నికచేయడం బావుంటుందని మెహతాబృందం
ాచించింది." ఆంధ్రప్రదేశ్ చట్టం ఈ విమర్శకు గురైంది. మెహతా
ృందం నివేదికనూ, ఆంధ్రప్రదేశ్ చట్టాన్ని బలపరుస్తూ ఒక్క విష
యాన్ని చెప్పాల్సివుంది :-"సాధ్యమైనంత ఎక్కువ లాభకరంగావుండే
రిపాలనా యూనిట్ (ఆప్టిమమ్ ఎడ్మినిస్ట్రేటివ్ యూనిట్)" ఏదో నిర్ణ
యించడం చాలా కష్టమైన పని.

దీర్ఘంగా ఆలోచించాల్సిన మరో విషయం వుంది. స్థానిక
స్వపరిపాలనకోసం జిల్లాకూ, గ్రామానికీ మధ్య ఒకి స్థాయి (బ్లాకు)ని
సృష్టించినప్పుడు, తాలూకాను ఎందుకని యూనిట్‌గా పరిగణించలేదో
అనూహ్యంగా వుంది, ముఖ్యంగా తాలూకా ప్రస్తుతం డెవలెప్‌మెంటు
బ్లాకుతో సమానమేగదా. అటువంటప్పుడు తాలూకాను యూనిటుగా
పర్తించక పోవడానికి కారణం స్పష్టంగా తెలియడం లేదు. ఈ విష
యంలో మెహతా బృందం నివేదిక సంతృప్తికరమైన సమాధానం
ఇవ్వలేక పోతోంది. ఆంధ్రప్రదేశ్ చట్టం రూపొందించినవారు
కేవలం మెహతా బృందం నివేదిక సూచనలను మాత్రం అనుసరించ
డంతోనే సరిపెట్టుకున్నారు. ఇకపోతే తాలూకాలను తగు యూనిట్లగా

విస్మరించడానికి కారణం వాటిని నిర్వహించడం కష్టమనో, పెద్దవనో మాత్రమే సమాధానం ఏదైనా చెప్పగలిగితే చెప్పేది. కాని అన్ని తాలూకాలూ అంతపెద్దవీ, నిర్వహించడానికి అంతవీలుగానివీనా ? ఈ సమస్యను జాగ్రత్తగా పరిశీలించాల్సివుందని అభిప్రాయ పడుతున్నాను. అన్ని తాలూకాలూ సైజులో పెద్దవికావు.

ఇక్కడొక విషయాన్ని పేర్కొనాలి: ప్రజాతంత్ర వికేంద్రీకరణ పథకంక్రింద ప్రధాన బాధ్యతంతా సమితులమీదే పడుతుంది. అభివృద్ధి కార్యక్రమాల అమలు పర్చడంలో జిల్లా పరిషత్తు, పంచాయతీ సమితులంత ప్రధానమైనవి కావు. జిల్లా పరిషత్తు సమన్వయీకరణ సంస్థగావుంటే, పంచాయతీ అధికారాలు పరిమితంగా వుంటాయి.

ఏ వికేంద్రీకరణ పథకం క్రిందనైనా ప్రతీ పరిపాలనా స్థాయికి కొన్ని విధులను అప్పగిస్తారు. ఆ విధులకు దానిదే బాధ్యత. వాటికి కేటాయించబడ్డ రంగాలలో ఈస్థాయీలన్నీ కొద్దోగొప్పో స్వపరిపాలనా స్థాయిలుగానే వుంటాయి, ఉదాహరణకు ఫెడరల్ రాజ్యాంగాలన్నింటిలోనూ కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాల అధికారాలేమిటో నిర్వచించబడ్డాయి. కేంద్రరాష్ట్ర ప్రభుత్వాలు రెండూ ఒకదాని వ్యవహారాలలో మరొకటి జోక్యం కల్పించుకోరాదు. అలాగే రెండింటికీ కేటాయించిన విధులూ ఒకటికావు. వేర్వేరుగా వుంటాయి సమిష్టి జాబితా (రాజ్యాంగంలోని కరెంటులిస్టు) క్రింద తప్పితే, ఒకే రకమైన అధికారాన్ని సాధ్యమైనంతవరకూ తొలగిస్తారు. ఆంధ్రప్రదేశ్‌లోని ప్రజాతంత్ర వికేంద్రీకరణ సాధించనున్నది ఈ లక్ష్యాన్నే. గ్రామ పంచాయతీలకు కొన్ని విధులను అప్పగించారు. సమితులకు మరోరకమైన పనులు అప్పగించారు. అన్నిటికంటే పైనవుండే జిల్లా పరిషత్తు సమన్వయీకరణ సంస్థగా వ్యవహరిస్తుంది. స్థానిక పరిపాలన సక్రమంగా నడవాలంటే ఈ విధమైన విధుల, బాధ్యతల పంపిణీ చాల అవసరం. వివిధయూనిట్ల క్రింద ఆయా పనులను పంపిణీ చేస్తూనే, అవే అధికారాలు చర్విత చర్వణంకాకుండా, మించిపోకుండా వుండేటట్లు గూడా జాగ్రత్త వహించాలి. యూనిట్ల విధులూ, వాటి శక్తి సామర్థ్యాలసుబట్టి, సరైన పంపిణీ

ఆధారపడి వుంటుంది. అయితే సంక్రమించిన అధికారాలే మళ్ళీ రాకుండా ఆంధ్రప్రదేశ్ చట్టం నివారించలేక పోతున్నట్లు అవుపిస్తోంది. ఈ చట్టం క్రింద సమితికి దాదాపు పదిహేను రకాల పనులు అప్పగించింది. ఇవెంత విస్తృతంగా, అస్పష్టంగా వున్నాయంటే వీటన్నింటినీ సమితి నిర్వహిస్తుందా అన్న అనుమానం కలుగుతోంది, ఒకవేళ ఈ పనులన్నింటినీ నిర్వహించగలిగినా, సమితి కావిదమైన అధికారాలివ్వడం తగునా? కొద్దిపాటి ప్రాముఖ్యత గల కొన్ని పనులున్నాయి. వీటిని తప్పనిసరిగా పంచాయతీలకు అప్పగించాలి ఉదాహరణకు "మంచినీటి సౌకర్యాలు" గాని లేదా, "ఎరువుల పంపిణీ" లేదా "చెట్లు నాటడం" వగైరా చిన్నచిన్న పనులను పంచాయతీలకు అప్పగించవచ్చు. ఈ పనుల నిర్వహణకు గ్రామ పంచాయతీలు తగిన సంస్థలు. ఆంధ్రప్రదేశ్ గ్రామ పంచాయతీ బిల్లులో గ్రామ పంచాయతీలకు 39 విధులను కేటాయించారు. (వీటిలో 29 విధులను పంచాయతీకి యిష్టమైతే నిర్వహించవచ్చు, లేకపోతే లేదు.)

ఈ 29 విధులనూ పంచాయతీ నిర్వహించ దలచుకుంటేమాత్రం, అదిచేసిన పనినే చేయడమవుతుంది. ఇది అనవసరం. ఉదాహరణకు లైబ్రరీలను ఏర్పాటు చేయడం, వాటిని ప్రచారంలోకి తెచ్చేపనిని చట్టం సమితికి అప్పగించింది, ఇదే పనిని గ్రామ పంచాయతీలకూ అప్పగించింది, ఉత్పత్తిని పెంచడానికీ. గ్రామాలలో సహకార యాజమాన్యం క్రిందనున్న భూముల్ని ప్రోత్సహించి, సమిష్టి వ్యవసాయాన్ని ఏర్పాటు చేసే ఉద్దేశంతో సరైన సాగు పద్ధతి అమలులోకి తేవాలనీ బిల్లులో వుంది. వ్యవసాయోత్పత్తిని ఎక్కువ చేసేందుకై సమితి తనకు చేతనైన కృషి అంతా చేయాలి అని చట్టం చెపుతోంది, ఈవిధమైన అస్పష్టతా, రెండుచోట్ల ఒకే అధికారాలను సంక్రమింప జేయడంవల్లా పంచాయతీలూ, సమితులూ బాధ్యతా రహితంగా ప్రవర్తించే ప్రమాదం వుంది. ఏ ఒక్క సంస్థకూ సరైన బాధ్యతలేదు, అందువల్ల బాధ్యతను స్పష్టంగా పేర్కొనడం దృష్ట్యా, ఇటువంటి అవకతవకలను పంచాయతీ తుదిచట్టంలోనైనా తొలగించడం అవసరం.

చట్టంలో ప్రయోజనకరమైన ఒక అంశం వుంది:- సాంకేతిక నిపుణులకూ, సాధారణ ఆఫీసరుకూ మధ్యవుండే సంబంధం. వారి మధ్య నెలకొనాల్సిన సరైన సంబంధాలనుగూర్చి పెద్ద వివాదం వుంది. ఈ సాంకేతికజ్ఞులు సాధారణ ఉద్యోగులకు లోబడి వుండాలా లేక స్వతంత్రంగా వుండొచ్చా? సాధారణ వుద్యోగి తన పైనున్న సాంకేతిక సూపర్వైజర్లను ప్రత్యక్షంగా కలుసుకొని మాట్లాడవచ్చా లేదా? లేక సాధారణ ఉద్యోగి సూపర్వైజర్ద్వారా ఉత్తర్వులను పునఃపరిశీలించవచ్చునా? బ్లాక్ స్థాయిలో బి. డి. ఒ. సాధారణ ఆఫీసరుగా వ్యవహరిస్తాడు. బ్లాక్ స్థాయిలో వివిధ శాఖలకు చెందిన అనేకమంది సాంకేతిక ఆఫీసర్లు వుంటారు. ఉదాహరణకు కో - ఆపరేషన్ (సహకార) ఆఫీసరు; వ్యవసాయ ఆఫీసరు; వైద్యా ఆఫీసరు వగైరా సమిష్టిపని ప్రయోజనాలదృష్ట్యా చట్టం బి. డి. ఒ. బ్లాక్ కార్య నిర్వహణాధికారిగా వుండాలని, బ్లాక్స్థాయిలోని ఆఫీసర్లపై పరిపాలనా కంట్రోలు, అజమాయిషీ అధికారమూ కలిగివుండాలని (వైద్య ఉద్యోగితప్ప) చెప్తోంది ఇది అభ్యుదయకరచర్య అనే చెప్పాలి. ఎందుచేతనంటే అలా లేకపోతే బ్లాక్స్థాయిలో సమన్వయం అసాధ్యమవుతుంది. తన ఆధీనం క్రిందనున్న ప్రాంతంలోని ఆఫీసర్లపై పాలనాధికారివున్న బి. డి. ఒ. ద్వారా అభివృద్ధి ప్రణాళికల మధ్య సమన్వయం సాధింపబడుతుంది.

గ్రామస్థాయిలో వి. యల్. డబ్ల్యు. అనే ఆయన బహుకార్థ సాధక విషయాలను చూసే ఆఫీసరు వుంటారు. గ్రామస్థాయిలో సమన్వయీకరణ తేలిక.

జిల్లా స్థాయిలోమాత్రం సమన్వయస్పష్టంగా కాదు. జిల్లా కలెక్టర్ సర్వసాధారణ ఆఫీసరుగా వుంటారనేది వాస్తవమే. భారత దేశంలో ఈ స్థానాన్ని జిల్లా కలెక్టర్ అనేక సంవత్సరాలుగా నిర్వహిస్తున్నారన్న సంగతి అందరికీ తెలిసినదే. ఇటీవల ఈయనను జిల్లాలోని అభివృద్ధి కార్యక్రమాలుచూసే ఆఫీసర్ల (డెవలప్మెంటు ఆఫీసర్లు) బృందానికి నాయకుడుగా ఎన్నుకున్నారుకూడా. కాని

ప్రస్తుత ఆంధ్రప్రదేశ్ చట్టంలో ఈయన పాత్ర యేమిటో స్పష్టంగా పేర్కొనలేదు.

చట్టం ప్రకారం జిల్లా కలెక్టర్ అన్ని స్థాయీ సంఘాలకు ఎక్స్ - అఫిషియో అధ్యక్షుడుగా వుంటారు. అధ్యక్ష హోదాలో ఆయన ఆయా సంఘాలను నడుపుతూ వుంటారు. ఫలితంగా అధికారులూ, అనధికారులూ ఒకరికొకరు సన్నిహితంగా రావడానికి అవకాశం వుంది. చట్టంకింద, జిల్లాకలెక్టరు అధ్యక్షహోదాలో జిల్లాస్థాయిలో ఒక ప్రత్యేక స్థానాన్ని అలంకరిస్తారు. ఈ హోదా బ్లాక్‌స్థాయిలో బి. డి. ఓ.కు లేదు. కమిటీ అధ్యక్షుడే బ్లాక్ స్థాయిలో అధ్యక్షుడుకూడా. పైగా పైన వివరించినట్లు, బి. డి. ఓ. సమితి అధ్యక్షుని పరిపాలనా కంట్రోల్‌కింద వుంటారు. కలెక్టర్ పరిషత్ అధికారంతో నిమిత్తంలేకుండా స్వతంత్రంగా వ్యవహరిస్తారు. బి డి. ఓ. నూటికి నూరుపాళ్ళు డెవలప్‌మెంటు ఆఫీసరుగాబట్టి, జిల్లా కలెక్టరు ప్రధాన డెవలప్‌మెంటు అధికారియేగాకుండా శాంతి భద్రతలు నెలకొల్పే అధికారే కాకుండా అంతకన్న ఎక్కువ అధికారమున్న వ్యక్తి అవడంవల్ల బి. డి. ఓ, సమితి అధ్యక్షుని కంట్రోలుకు లోబడి వుండాలనడానికి ఒక కారణంగా చూపుతున్నారు. కలెక్టరు జిల్లాలో ప్రధాన రెవెన్యూ అధికారి. ఆ జిల్లాలో శాంతి భద్రతలు నెలకొల్పే అధికారిన్నీ, అన్నిటికంటేమించి జిల్లా అధికారి. అందువల్ల అటువంటి అధికారిని (కలెక్టరును) జిల్లా పరిషత్‌కు లోబడి వుండేటట్లు చేయరాదు. జిల్లాపరిషత్ అనేది ఈనాటున్న హోదాలో అభివృద్ధి సంస్థ. కలెక్టరుకు బదులుగా పరిషత్ కార్యదర్శి, పరిషత్ అధ్యక్షుని పరిపాలనాధికారానికి లోబడివుంటారు. చెప్పినవన్నీ అమలు జరిగిన పక్షంలో మరి కలెక్టరుకూ, పరిషత్‌కూ మధ్యవుండే సరైన సంబంధాలేమిటో చట్టంలో స్పష్టంగా పేర్కొనలేదు.

చట్టంలో మరో అస్పష్టతకూడా గోచరిస్తోంది. జిల్లా కలెక్టరుకూ పరిషత్ కార్యదర్శికీ మధ్య ఎటువంటి సంబంధా లుండాలి? పరిషత్ అధ్యక్షునికీ, జిల్లాకలెక్టరుకూ కార్యదర్శియే బాధ్యతగా వుండాలా?

అలా అయితే, జిల్లాకలెక్టరుకూ, పరిషత్ అధ్యక్షునకూ మధ్య అభి ప్రాయభేదం వస్తే, పరిషత్ కార్యదర్శి ఎవరిని నమ్మాలి ? ఎవరిమాట శిరసావహించాలి ?

పరిషత్, సమితి పనులలో చాలాభాగం వీటిస్థాయీ సంఘాల ద్వారానే జరిగిపోతుంది. పరిషత్, సమితులకు ఒక్కోదానికి అటువంటి స్థాయీ సంఘాలు అయిదు వుంటాయని చట్టంలోవుంది. ఈ సంఘాలు మితిమీరిన అధికారాలున్న సంస్థలుకావు. వీటికీ తగుమాత్రపు అధి కారాల బదలాయింపును చట్టంలో కల్పించారు. పనులు త్వర త్వరగా జరగాలంటే ఈవిధమైన అధికారాల బదలాయింపు అవసరం వీటికి నిర్దేశించన నిర్దిష్టమైన చట్టంలో ఈ స్థాయీ సంఘాలకు స్వతంత్రించి కేటాయింపులుచేసే అధికారం అప్పగించ బడింది. ఈ చట్టంతోనే ఈ సంఘాలు పనులు నెరవేరుస్తాయి. పథకాలు అమలు జరుపుతాయి. ఈ సందర్భంలో మాతృసంస్థలైన పరిషత్ సమితులనుండి విడివడి పూర్తి స్వతంత్ర సంఘాలుగావున్న వీటిపట్ల కొంత జాగ్రత్తవహించడం అవ సరం. సమితి స్థాయిలో అటువంటి ప్రమాదాన్ని తెచ్చిపెట్టడం సాధ్యం కాదు. అయితే జిల్లా స్థాయిలో మాత్రం, సమతి అధ్యక్షుడు జిల్లాకలె క్టరుగాబట్టి, పరిషత్‌కు సమితి పోటీగా తయారయే ప్రమాదంపుంది. ఈ విషయమై నిర్దిష్టంగా యిప్పుడేమీ మనం చెప్పలేము. ఈ రెండు సంస్థల — పరిషత్తూ, సమితి - వాస్తవ పరిస్థితి ఆచరణలో వాటి పని పాట్లను పరిశీలించిన మీదటగాని బయట పడదు. ఈ చట్టాన్ని అమలు పరచడానికి రెండు రకాల అధికారు లుంటారు. ఒకరకం: రాష్ట్రీ ఉద్యోగాలు; రెండోరకం: స్థానికసంస్థల్లో పనిచేసే ఉద్యోగులు జిల్లా కలెక్టరూ, జిల్లా పరిషత్ కార్యదర్శి, జిల్లా, బ్లాక్‌స్థాయిలో పనిచేసే బి. డి. ఒ. తదితర డిపార్టుమెంట్లు అధికారులూ రాష్ట్రీ ప్రభుత్వో ద్యోగులుగా వుంటారు. చట్టంలోని అంశాలను అమలు జరపడానికి, తాము అవసరమని భావిస్తే, ఆయా అధికారాలను, తదితర ఉద్యోగు లను ప్రభుత్వ అనుమతితో నియమించేందుకు పరిషత్తు, సమితికి అధికారాలు సంక్రమించాయి, రెండు రకాల ఉద్యోగులను సృష్టించే

కంటే, స్థానిక ప్రభుత్వాని కంతటికీ కలసి ప్రభుత్వం ఏకీకృత సర్వీసును నెలకొల్పడం మంచిది.

# 4

ఇవి ప్రజాతంత్ర వికేంద్రీకరణకు చెందిన పరిపాలనాంశాలలో కొన్ని మాత్రమే. పైన మనం జరిపిన చర్చ సందర్భంలో చట్టం లోని కొన్ని అస్పష్టతలనుగూర్చి ప్రస్తావించాం. ఈ అస్పష్టతవల్ల చట్టం యొక్క ప్రాధాన్యత ఎంతమాత్రమూ తగ్గబోదు. చట్టాన్ని సక్రమంగా తు.చ. తప్పకుండా అమలు జరిపినట్లయితే ఆంధ్రప్రదేశ్‌లో ప్రజా స్వామ్యం వెళ్ళూనేలా చేయడంలో ఈ చట్టం చాలా తోడ్పడుతుంది. ఈ చట్టంలో కొన్ని ప్రజాతంత్ర వ్యతిరేక అంశాలు వున్నాయి. ఉదహరణకు సమితి, పరిషత్తులకు జరిగే పరోక్ష ఎన్నికలు; స్థాయీసంఘాల అధ్యక్ష హోదాలో ఆసంఘాలతో జిల్లా కలెక్టరు కున్న సంబంధాలు. అలాగే పంచాయితీ విషయంలోనూ. ఈ పుస్తకంలోనే మరోచోట పేర్కొన్నట్లు గ్రామ పంచాయితీలపై ఇన్‌స్పెక్టరుకు విస్తృతాధికారాలు సంక్రమించాయి, కాని మన కివి తాత్కాలిక పధకాలులా కనపడుతాయి, చివరికి స్థానిక సంస్థలే దాదాపు స్వపరిపాలనా సంస్థలుగా మారుతాయనడంలో ఎట్టి సందేహములేదు.అప్పుడు మాత్రమే అధికార దర్పం పోతుంది. మెహతా బృందం నివేదికలో తెలిపినట్లు:- "పంచాయతీ సమితి నిర్వహణాను భవం ప్రాతిపదికగా ముస్ముందు పరిపాలనను యింకా స్త వికేంద్రీకృతం చేయడానికి నిర్ణయించడం సాధ్యమవుతుంది అలాగే జిల్లాపరిషత్ నిర్మాణం, దాని అధికారాలను మార్చడంకూడా అవసరమవవచ్చు. కలెక్టరు, తదితర ఆఫీసర్ల చేతుల్లోవుంచిన అధికారాలు ఉపసంహరింప బడవచ్చు." మెహతా బృందం నివేదికకన్నా ఆంధ్రప్రదేశ్ చట్టం అనేక విధాలుగా సంస్కరణ స్వభావం కలదిగావుంది. ఈ సంస్థలు సక్ర మంగా పనిచేయడం మీదనే ప్రతిదీ ఆధారపడివుంది.

ఈ చట్టాన్ని ప్రవేశపెట్టడంలో ప్రభుత్వం తొందరపాటు కనబర్చిందని భావించేవారు అనేకమంది లేకపోలేదు. మొత్తం విధానమంతా పేకమేడవలె కూలిపోకతప్పదని వీరు భావిస్తున్నారు. ఈ నూతన ప్రయోగంపై తీర్పు చెప్పడం ఇప్పుడప్పుడే సాధ్యంకాదని మేము అభిప్రాయపడుతున్నాం. అయితే మేమీమాత్రమన్నా చెప్పగలం:- ప్రస్తుత దశలో నియంతృత్వాలనే విశాలమైన ఎడారిలో భారతదేశం ఒక్కటే ఒయాసిస్సుగా వుంది.

ప్రాతినిధ్యసంస్థలద్వారా ఇక్కడ సాంఘిక, ఆర్థిక మార్పులను గొనిరావడానికి మనం ప్రయత్నిస్తున్నాం. ఇది చాల నత్తనడక. జాప్యానికి దారితీసే పద్ధతిన్నీ. ఈ ప్రయోగంలో మనం విజయం పొందామా, అది అమోఘమైన విజయం కాగలదు; లేక విఫలమైనామా, ప్రజాస్వామ్యమూ ప్రజాతంత్ర సంస్థలనేవి ఉన్నతవర్గాలవారి జల్సాలకు ఉపకరించే సంస్థలని విమర్శకులు వెలిబుచ్చే అనుమానాలు నిజమైనట్లే అవుతుంది. సమాజంలో అణగారినవారు దాన్ని సహించలేరు. అనేక నష్టాలు, చిక్కులనేకం.

చివరిమాటగా ఒక్క విషయం చెప్పాల్సివుంది : కేవలం సంస్థలే తమంత తాముగా "అద్భుతాలను" సృష్టించలేవు. ఈసంస్థలలో పని చేసే వారిదే ఎక్కువ ప్రాధాన్యత. మార్షల్ డిమోక్ యిలా వ్రాశారు : "పరిపాలనఅంటే, పాలనా నిర్వాహకులు" అని (Administration is administratos.) సంస్థ. నిర్మాణం, వాటి పద్ధతులుకూడా చాలా ముఖ్యమైనవే. అయితే ఇవి వ్యక్తుల తర్వాతనే. ప్రభుత్వ స్థానంలో వున్నవారి గ్రామీణ అనుభవం లేదా స్థాయిగాని తగినదిగా లేకపోయినా లేదా ఆయా వ్యక్తులందరూ అగౌరవనీయులై, స్వార్థపరులైనా సాంకేతిక రీత్యాగాని, యంత్రాంగం దృష్ట్యాగాని ఎంత అభివృద్ధి జరిగినా దానివల్ల ప్రయోజనం వుండదు, మన రాష్ట్రంలోని ఈ నూతన సంస్థల్లోని ఉద్యోగబృందానికి ప్రజాసేవ చేయాలన్న దృష్టి లేకపోయినట్లయితే, ప్రజాతంత్ర వికేంద్రీకరణ పథకం తన లక్ష్యాన్నే వదలు

కోవాల్సి వస్తుంది. అయితే అటువంటి లక్షణాలు అబ్బడానికి కొంత కాలం పడుతుంది.

సంస్థ లనేవి శూన్యంలో పనిచేయవు. వాటికి ఒక విధమైన సాంస్కృతిక పునాదులుంటాయి. ప్రజలు స్వపరిపాలనకు తగిన శక్తి సామర్థ్యాలను కలిగివున్నట్లయితే, అప్పుడు మాత్రమే స్వపరిపాలనా సంస్థలు బాగా వేళ్ళూనుకుపోతాయి. ఒక ఇంగ్లీషు సామెతలో చెప్పి నట్టు, "ప్రజలకు తగిన ప్రభుత్వం వారికి లభిస్తుంది" అనేది తాత్విక భావం. "లాస్కీ" చెప్పినట్లు ప్రజాస్వామ్యంఅంటే ప్రజలు పాల్గొనడం అని అర్థం. అంతేగాని 'మేధావులు పాల్గొనడం' అని గాని, గౌరవ నీయులు, పెద్దమనుషులు పాల్గొనడం అని గాని దగ్గర త్రోవ అంటూ లేదు.

# విద్యాద్వారా ప్రజలలో చైతన్యం

శ్రీ బి. ఎస్. రావు, ఎమ్. ఎ.

(ప్రిన్సిపాల్, రావ్స్ ట్యుటోరియల్ కాలేజి)

పంజాబ్ సింహమైన స్వర్గీయ లాలా లజపతిరాయ్ ఒకసారి యిలా చెప్పారు:—

"వయోజనులను ఆహారం, పిల్లలకు పాలు, అందరికీ విద్య." దీన్నిబట్టి భారతదేశంలో విద్యాసమస్య ప్రాధాన్యత ఏమిటో బోధపడు తుంది. ప్రభుత్వ విధానంలోని "చోదక సూత్రాలను" (Directive priniciples) బట్టి; రాజ్యాంగం అమలులోకి వచ్చిన 15 సంవత్స రాలలోపుగా అంటే 1965 నాటికల్లా దేశంలో నిరక్షరాశ్యతను నిర్మూ లించాల్సివుంది. కాని ఇప్పటికి కనీసం 20 శాతమన్నా అక్షరాస్యులు కాలేదు. ప్రజలలో పెద్దఎత్తున పేరుకుని ఉన్న నిరక్షరాస్యతను తొల గించడానికి ప్రతిబంధకంగా వున్నవాటిలో తగినన్ని నిధులులేకపోవడం ఒక పెద్ద అడ్డంకి అనడంలో సందేహంలేదు. ఈసమస్యపట్ల ఎక్కువ శ్రద్ధ చూపాల్సిన అవసరం వుంది. విజ్ఞానమంటే కేవలం అధి కారమే కాదు, విజ్ఞానమంటే ఆరోగ్యం. సంపదైశ్వర్యాలు కూడా. విద్య సర్వులహక్కన్నా. పౌరధర్మాన్ని పెంపొం దించాలంటేకూడా విద్య అవసరం. అయితే అమాయకత, నిరక్ష రాశ్యతా ఒకటికావు. మన గ్రామీణులకు అపారమైన ఇంగితజ్ఞానం వుంది. ఎటువాగిరితే తమరొట్టె నేతిలో పడుతుందో తెలుసుకోవడానికి వారికీ జ్ఞానం ఉపకరిస్తూంటుంది. అందువల్ల గ్రామ పునర్నిర్మాణానికి విద్య అవసరం యింకా చాలావుంది, సామర్థ్యం వుండాలన్నా కూడా కొంత అక్షరాస్యత అవసరం, యంత్రాలు, యంత్ర పనిముట్లు

ఉపయోగించడం ఆరోగ్య సూత్రాలు అమలుపర్చడం విషయాలతో ఆదేశాలనూ, సూచనలనూ నిరక్షరాస్యులైన రైతులు తెలివితేటలతో అమలు పరచలేరుగదా!

విద్యయొక్క ఉపయోగం రెండు రకాలుగా వుంటుంది; (1) ప్రత్యక్షం; (2) పరోక్షం. ప్రత్యక్షంగాచూస్తే, ప్రణాళికలు లేదా పథకాలను అమలు పర్చేందుకై పాఠశాలలద్వారా ప్రజా చైతన్యాన్ని ప్రదీప్తం చేయడంఅవసరం అలాగే పరోక్షంగా చెప్పాల్సివస్తే కేవలం వాగాడంబరంలోపడి ప్రజలు కొట్టుకుపోకుండా నివారించడంమే గాకుండా, తరతరాలుగావస్తున్న కులమత, అస్పృశ్యతా, బాల్య వివాహాలు, వరకట్నాలవంటి సాంఘిక దుర్నీతలనుండి తేరుకోవడానికి తోడ్పడ్డానికికూడా విద్య అవసరమైయుంది. దేశంలో ప్రజాస్వామ్యం బాగా వేళ్ళుతన్నుకునేలాచేయడమే గ్రామ పంచాయితీ పాలన ఉద్దేశం. గ్రామస్థాయిలో, స్థానిక పనులకు సంబంధించినంతవరకూ స్థానిక ప్రభుత్వ కార్యక్రమమూ ప్రణాళిక అమలు జరగడమూ అందుకు ప్రత్యక్ష సంబంధమున్న ప్రజలద్వారానే జరగాలి. ఇదే గ్రామ పంచాయతీ రాజ్యంలో అధికార వికేంద్రీకరణా, అధికారాల బదలాయింపూ అంటే. అయితే వికేంద్రీకరణ అనేది తనకు సంబంధించినంతవరకూ చెడ్డదీకాదు, మంచిదీకాదన్న సంగతిని గుర్తించాలి. కేంద్రీకృతాధికారం అనేది పైనున్న కొద్దిమంది చేతుల్లోనే అధికారమంతా పోగుపడి వుండటానికి దారితీసి, స్థానికంగావున్న చొరవను నాశనంచేసేదికాగా, వికేంద్రీకృతాధికారంలోకూడా లోపాలులేకపోలేదు. చిన్నచిన్న సంస్థలు చాల తేలిగ్గా ఒక ముఠా అధికారంక్రిందనో లేదా ఒకగ్రూపు వత్తిడికో లొంగిపోయే ప్రమాదం వుంది. గ్రామీణ జీవితం కులాలమయం. అందువల్ల వికేంద్రీకృత ప్రజాసామ్యం తుదకు వివిధ గ్రామాలలోని వివిధ కులాలకుచెందిన పాలనగా తారుమారయే ప్రమాదం వుంది. ప్రభుత్వాలు వూడడంలోనూ, గద్దెనెక్కించడంలోనూ వివిధపార్టీల ఆలోచనాధోరణుల్లో కుల ప్రస్తావనలు తలెత్తుతున్నప్పటికీ, సాంఘిక చైతన్యానికి సంబంధించినంతవరకూ గ్రామాలలోకన్నా పట్టణ

ప్రాంతాలలోనే ఈ కులతత్వం కొ_స్త తక్కువ మోతాదులో వుందని చెప్పడంలో విప్రతిపత్తిలేదు, అందువల్ల తదితర సాంఘికదురాచారాలతో పాటు కులంపైకూడా నిరంతరం ధ్వజమెత్తడం అవసరం. ఈ పనిని పాఠశాలలద్వారా సాధించవచ్చు. భారీఎత్తున వయోజన లేదా సాంఘిక విద్యాపథకాన్ని చేపట్టడం ఖర్చుతో కూడుకున్నపనేకావచ్చు. కాని గ్రామాలలో ఒక క్రమపద్ధతిలో చిత్రాలను,రేడియో ప్రసారాలను వ్యాప్తి లోకితేవాలి. ఇది ఎంతో అవసరం. ప్రచారం అనేది చెడుమాట. కాని ఆదర్శతన భావిలో మనం వర్గరహిత, వర్ణరహితమైన సమాజాన్ని ఏర్పర్చుకోవాలనుకున్నప్పుడు, పాఠశాల, ఫిల్ములు, రేడియోలద్వారా యోచనాపూర్వకమైన ప్రచారంచేయడం అవసరం. సంచార సినిమాలను (ట్రావెలింగ్ సినిమాలు) ప్రోత్సహించాలి. రాష్ట్రప్రభుత్వం వాటికి సబ్సిడీలు యివ్వాలి. గ్రామపంచాయతీలుకూడా గుడారాలలో సినిమా హాలులు కట్టవచ్చు. ప్రజలవద్దనుండి తక్కువ రేట్లను వసూలు చేయవచ్చు. రేడియోప్రచారంకన్న చిత్రాల(ఫిల్ములు)ద్వారా జరిగే ప్రచారం చాల శక్తివంతమైనది. ఎందుచేతనంటే, మనం కేవలం విన్నదానికన్నా మన కళ్ళారా చూసినప్పుడు మనలో కలిగే అభిప్రాయం గొప్పది.

కొత్తరకం పాఠ్యపుస్తకాలనుకూడా వ్రాయించడం అవసరం. ఈ పుస్తకాలలో కులరహితమైన సమాజా లక్ష్యాన్నిగూర్చి బాహాటంగా ప్రబోధించాలి. ఇది చాల సున్నితమైన పనేఅనడంలో సందేహంలేదు. ఏమంటే అనేకమంది సంఘసంస్కర్తల మనసుల్లో కులరహితమైన విధానమంటే అన్ని వర్గాల ప్రజలూ కలసి ఒక్కచోటకూర్చుని మాంసాహారం సేవించడమని భావిస్తారు. శాకాహారమనేది ఒక సిద్ధాంతం. దాన్ని మనం గౌరవించాల్సిందే. అంతేగాని కుల అడ్డంకుల్ని బద్దలు కొట్టడమంటే తాము చచ్చినట్లు మాంసం తినాలనిగాని లేక తమ ఆహార విహారాలకే కట్టుబడివుంటే నలుగురు కూర్చునేచోట తమకు సౌకర్యాలు లభించవనిగాని శాకాహారులైనవారు భావించేటట్లు ఒత్తిడి పనికిరాదు. అలా గాకుండా కులవ్యవస్థమీదనే ముఖాముఖి పోరాటం నడపాలి. గతంలో చాతుర్వర్ణ వ్యవస్థ అమలులో వుండేదని, ఇది పురోహిత,

సైనిక, వ్యాపార, నీచపు విధులక్రింద వర్గీకరించబడి వుండేదని, ప్రస్తుత కులవ్యవస్థకు ప్రాచీనకాలంలో స్థానముందనీ వాదించవచ్చు. కాని ప్రస్తుత దశలో "వర్ణాల" మధ్య గందరగోళం ఏర్పడింది. ఏమంటే, పురోహితవర్గానికిచెందిన అనేకమంది సేఠు హోటలు యజమానులుగానూ, రెస్టోరెంట్లులాంటి వ్యాపార కార్యక్రమాల్లో మునిగి పోతున్నారు. అటువంటప్పుడు కులమనేమాటకు లేదా వర్ణమనేమాటకు అర్థమంటూ ఏమీ లేదు.

అస్పృశ్యతా నివారణకు ఇంకా దృఢమైన చర్యలు తీసుకోవడం అవసరం. అయితే ప్రత్యక్ష ఒత్తిడి ప్రయోగించరాదు గాని, గ్రామ ప్రణాళిక, యిళ్ళ నిర్మాణం, హరిజనులకు ఇళ్ళవసతి వగైరా పథకాలన్నిటిలోనూ అంతర్గతమైన గ్రామపథకం ఒకటి అవసరం. "హరిజన పేటల"ని పేరువేసే దుష్ట పద్ధతికి వెనువెంటనే స్వస్తిచెప్పేట్లు చర్యలు తీసుకోవాలి. అన్ని రకాల వర్ణ భేదమూ అంతరించాలి. అదే సమయంలో పేద ప్రజానీకాన్ని, వెనుకపడిన ప్రజలనూ సుచికర మైన జీవితాన్ని గడిపేటట్లు విద్యావంతుల్ని చేయడం అవసరం. వారికి త్రాగు నీటిసరఫరా సౌకర్యాలను కల్పించడం అవసరం. ప్రజలకు సుచికరమైన, చౌక ధరలకు మంచి ఆహారాన్ని సరఫరా చేసేటందుకు పంచాయితీలు కాంటీన్లు తెరవాలి. అప్పుడు ఉన్నత కులాలనబడే వాటికి చెందిన పేదప్రజలూ, చౌకలో ఆహారం లభిస్తూన్నప్పుడు ఈ కాంటీన్లకు రాకుండా వుండడం అసాధ్యమైన పని అవుతుంది, అయితే వారికి సమాజంలోని యితర సభ్యులతోపాటు సమాన హోదా లభిస్తుంది.

గ్రామీణ మహిళల్లో విద్యా వ్యాప్తి ద్వారా, వారికి ఉద్యోగ వసతి కల్పించడం ద్వారా బాల్యవివాహాలు, కట్నాలకూ భరత వాక్యం చెప్పడానికి జరిగిన కృషి శూన్యం. వయస్సు మళ్ళిన మహిళలు సాంఘిక విద్యా కేంద్రాలకు వెళ్ళడానికి ఆసక్తిచూపక పోవచ్చు, కాని కొద్దో గొప్పో తమ కుమార్తెలు విద్యావంతు లవటాన్ని వారు మెచ్చుకుంటున్నారు. తిరిగి ఈవిషయంలోకూడా పిడివాదంకూడదు బాలికలకు

ప్రతీక పాఠశాలలు నెలకొల్పుకోవచ్చు. నేడు గ్రామాలలో కుటుంబ నియంత్రణ తక్షణ సమస్యగావుంది. భావాలు, ఉద్దేశాలూ వుంటే వాటికి రెక్కలేవి వుంటాయి. పాఠశాలల్లో ఎత్తుగడలతో కూడుకున్న ప్రచారం సాగితే మనకున్న తెలివి తేటల్ని కొంతవరకన్నా వినియోగించ గలిగితే, కొలదికాలంలోనే చాల విజయాలు సాధించ వచ్చు.

ఆర్థిక ప్రణాళికలు విజయవంతం కావడానికి తగిన పరిపాలనా ప్రాతిపదికకు గ్రామ పంచాయితీ విధానం అవకాశం కల్పిస్తోంది. అయితే ప్రణాళికల విజయానికి తగిన సాంఘిక ప్రాతిపదికకూడా అవసరం. కులం, అస్పృశ్యతా నివారణ, మహిళా విముక్తివల్లనే ఇది సాధ్యమవుతుంది. సమాజాభివృద్ధి కార్యక్రమాలలో ప్రజలంతా చొరవతో పాల్గొనేందుకు ప్రజలలో చైతన్యాన్ని పురిగొల్పడానికి మూడు ఉద్దేశాలున్నాయి. (1) ఆహారోత్పత్తి అధికంచేయడం, దానిని సాధారణ భూసంస్కరణలు, ఆర్థికనిర్మాణ కార్యక్రమంనుండి వేరు చేయవచ్చు, సేవా సహకార సంఘాలను (Service Co-opratives) సర్వే సర్వత్రా బలపరుస్తున్నారు. వీనిని సాధ్యమైనంత త్వరగా పెంపొందించాలి, సహకార వ్యవసాయం ప్రస్తుతం వివాదాస్పదంగావుంది. అందువల్ల సేవా సహకార సంఘాలు విజయం ఖాయపడిన తరువాతనే సహకార వ్యవసాయాన్ని చేపట్టడం మంచిది. (2) చిన్న తరహా పొదుపు కార్యక్రమాన్ని పెంపొందించాలి. బహుమతి పత్రాల (ప్రైజ్‌బాండ్స్) పద్ధతి మంచిదే. దీనిని సక్రమంగా నిర్వహించితే చిన్నతరహా పొదుపును యింకా ఎక్కువ చేయవచ్చు. వ్యవసాయోత్పత్తిని అధికం చేసినవారికి బహుమతులిచ్చే పద్ధతిని కూడా పంచాయితీ ప్రవేశపెట్టవచ్చు. పాఠశాలలకు వెళ్ళే పిల్లల్లో ప్రణాళికల పట్ల ఉత్సాహాన్ని చైతన్యాన్ని ఉద్దీపింప జేయడానికి, సాధారణంగా గ్రామీణ ప్రజలందరిలోనూ ఈ చైతన్యాన్ని పురి గొల్పడానికి, చివరకు 2, 3 రూపాయల కైనాసరే తపాలా ఆఫీసు లేదా ఖజానా నగదు సర్టిఫికేట్లనూ బహుమతి పత్రాల రూపంలో విడుదల చేయాలి. నిధులను సేకరించడమనేదే లక్ష్యంగా ఉండరాదు. దేశంలో ఏదో కొంత

మార్పు జరుగుతుందన్న భావం గ్రామీణుల్లో ఏర్పడేటట్లు చూడాలి: పథకాల అమలులో ఎక్కువ పాత్ర వహించేటట్లు గ్రామీణప్రజలను తయారు చేయాలి. అయితే యీపనిని స్వచ్ఛందంగా నెరవేర్చాలి. ఎక్కువ కృషిజరగాలంటే ధనం కూడా అవసరం. గ్రామాలలో నేడు మనకు "స్టఖనోవైట్" (విప్లవ దీక్షగల, కార్య దీక్షగల) కార్య కర్తలు అవసరం.

స్వాతంత్ర్య, రిపబ్లిక్ దినోత్సవాలు గ్రామీణులలో మంచి ఉత్సాహాన్ని ఉద్రేకాన్ని కలిగించలేకపోతున్నా యన్నమాట వాస్తవం. విద్యార్థి బృందాల ద్వారా ఉత్సాహోద్రేకాలను పెంపొందించడం అవసరం. ప్రజాకార్యకర్తలుకూడా ఈ పనిని సాధించవచ్చు. వీరంతా రాజకీయంగా ఎక్కువ చైతన్యంగల పట్టణ ప్రాంతాలనుండి గ్రామాలకు, గ్రామాలనుండి పట్టణప్రాంతాలకు ఊరేగింపుగా బయిల్దేరి, పట్టణాలలో జరిపే ఉత్సవాలలో పాల్గొనవలసిందిగా రైతు బృందాలను, భూములులేని వ్యవసాయ కార్మిక బృందాలను ఆహ్వానించడం వల్లనూ ఈ ఉత్సాహోద్రేకాల్ని పురిగొల్పవచ్చు.

(3) ఆశ్చర్యకరమైన ఎత్తుగడలద్వారా, బహుకొద్ది వ్యవధిలోనే ప్రజలలో నిరక్షరాశ్యతను రూపు మాపడానికి రాష్ట్రప్రభుత్వమూ, పంచాయతీలూ చర్యలు తీసుకోవాలి. అమెరికా విద్యావేత్త డాక్టర్ లాబిబీ పద్ధతిప్రకారం వయోజనుడైన నిరక్షరాశ్యుణ్ణి చిన్నపిల్లవాడికన్నా చాల తక్కువ వ్యవధిలోనే అక్షరాశ్యుడ్ని చేయవచ్చు. ఈయన ఫిల్పిపైన్స్‌లో ఈ పద్ధతిని ప్రయోగించి చూచాడు. ఈయన అనుభవాన్నిబట్టి, వయోజనుడ్ని విద్యావంతుడ్ని చేయడానికయ్యేఖర్చులో బాలుడ్ని విద్యావంతుడ్ని చేయడానికయేఖర్చులో అయిదింట ఒక వంతు మాత్రమే పడుతుందని తేలింది. ఒక రచయిత తెల్పినట్లు "బాలలకన్నా వారి తల్లిదండ్రులను విద్యావంతుల్ని చేయడానికి ప్రయత్నించడంవల్ల, ఆచరణరీత్యా చూస్తే మనం తక్కువ ఖర్చుతో ఒక తరాన్ని ముందుకు తీసుకువెళ్తున్నామన్నమాట, "ఈవిధమైన" సామాజిక నిర్బంధ" విధానాన్ని కొనసాగించడంలో, తాము సర్టిఫికేట్లు గాని లేదా

డిగ్రీలుగాని పొందే అర్హతకలిగే లోపుగా కొంతకాలంపాటు అధ్యాపక వృత్తిని కొనసాగించేందుకు హైస్కూలు విద్యార్థులు అవసరం రావచ్చు. ఇందుకోసమై వారికి జీవన వేతనం చెల్లించవచ్చు. నూతనంగా వెలిసే పాఠశాలలకయ్యే ఖర్చును పొదుపు చేసేందుకై ప్రస్తుతం వున్న పాఠశాలలు షిఫ్ట్ పద్ధతిలో పనిచేస్తుండాలి. తపాలా ఆఫీసుల్లాంటి ప్రభుత్వ కార్యాలయాల్లోనే కాకుండా, దేవాలయాలు, మసీదులు చర్చిలలోకూడా రాత్రిపూట పాఠశాలలు ప్రారంభించడం అవసరం. ఇంతకూ కావలసినది మిషనరీలకుండే చొరవా, ఫీల్డుపనీ అవసరం. అంతేగాని కేవలం ఊకదంపుడు ఆశయాలూ, ధర్మోపదేశం కాగితం మీద గిలకడమూ కాదు నేడు కావాల్సింది!

# కార్యనిర్వాహకవర్గ నాయకత్వం*

శ్రీ బి. యస్. రావ్, ఎమ్. ఎ.

కార్య నిర్వహణాధికారి తన కృషిలో సఫలీకృతుడు కావా లంటే, తన వ్యాపారంలో సఫలుడైన వ్యాపారికి ఏలక్షణా లుంటాయో అవన్నీ ఈయనకూ వుండాలి, అయితే వారిద్దరికి మధ్య ఒక భేదం మాత్రం వుంది. సఫలుడైన వ్యాపారి (అధికార వ్యామోహంకూడా వ్యాపారి కుండే లక్షణాలలో ఒకటని ఆధునిక మనస్తత్వశాస్త్రం చెపుతున్నా) ధనవ్యామోహోపరుడు. వాస్తవానికి ధనలక్ష్మి ముఖం మీదనే తాండవమాడే వ్యాపారం, ధనం తనకు యితర కార్యకలా పాలకు వినియోగపడ్డా. సమాజంలో ఉన్నత స్థానాన్ని పొందడానికి సంపదనే పరమ సత్యంగా ఎంచుకుంటాడు, అయితే కార్య నిర్వాహ ణాధికారి మాత్రం ఈ రకమైన ధనస్వభావం కలవాడుగా వుండడు, అతడు మంచి జీతం పొందడంతోపాటు, అధికార వ్యామోహం, పేరు ప్రతిష్టలు పొందాలనే ఆకాంక్ష ప్రజాసేవ చేస్తున్నామన్న సంతృప్తి కూడా అతనిపై పెద్ద ప్రభావం కలిగిస్తాయి. ఒక గొప్ప వణిక్ ప్రముఖుడు పరిశ్రమకు కెప్టెన్‌గా ఎలా పిలువ బడుతున్నాడో అదేవిధంగా ప్రముఖ పరిపాలనా నిర్వాహణాధికారికూడా పరిపాలనా కెప్టెన్‌గా పిలువబడు తున్నాడు.

అందువల్ల సఫలుడు కాగల కార్య నిర్వహణాధికారి మంచి తెలివితేటలూ, బహుముఖ విజ్ఞానంకలవాడై వుండాలి. వ్యక్తిత్వం వున్నవాడై వుండాలి. స్వీయ ప్రతిభ వుండాలి. నిర్మాణశక్తి వుండాలి. అన్నివర్గాల ప్రజలతోనూ, అన్ని పరిస్థితులలోనూ కలిసి మెలసి

---

* శ్రీ రావ్‌గారు వ్రాస్తున్న "ఎస్సెన్స్ ఆఫ్ పబ్లిక్ అడ్మినిస్ట్రేషన్" అన్న గ్రంథంనుండి.

తిరుగగల శక్తి సామర్థ్యాలు గలవాడై వుండాలి. పనిచేయడానికి ప్రజలలో ఉత్సాహన్ని పురిగొల్పే శక్తి ఆయన కుండాలి. సద్గుణ సంపన్నుడై వుండాలి. గుణం లోపిస్తే, తనలో ఇతర్లకు నమ్మకం ఉండదు. ఫలితంగా వారినాతడు ఉత్సాహ పర్చ లేడు. కార్యనిర్వహణ విషయంలో ఎంత గట్టిగా వుండాలో అతడు ఇతరులపట్ల అంత ఔదార్యంతోనూ, సానుభూతితోనూ వ్యవహ రించాలి. ప్రజలను కేవలం యంత్రాలుగా భావించే వైఖరి నిరంకుశాధి కారవర్గం (బురాట్లు) లో ఎక్కువగా వుంటుంది. కాని ప్రజల నెదుర్కొనే వింతైన చిక్కులను అర్థంచేసుకుని సానుభూతితో వ్యవ హరించే శక్తి కార్యనిర్వాహణాధికారికి వుండాలి. పరిపాలనా రంగంలో మానవ శక్తిని అతడు విస్మరించ జాలడు. అదే సమయంలో అతడు అవసరమైతే ఇతర్లకు కష్టం కలిగినా జంకకూడదు. భయమూ, సానుకూల్యత లేని పద్ధతిలో అతను పరిపాలన సాగిం చాలి. అతడెల్లప్పుడూ చైతన్య ప్రదీప్తుడై వుండాలి. ఉత్తర్వులు జారీ చేసేముందు అతడు తన ముందున్న ఫైళ్ళన్నింటినీ క్షుణ్ణంగా అధ్యయనం చేయాలి. అస్తు బిస్తుగాని భావోద్రేకత కలిగివుండాలి. సహనాన్ని కోల్పోకుండా వుండాలి. ప్రతీకార వైఖరి కూడదు. మంచి కార్యనిర్వాహణాధికారి ఎప్పుడూ ఎట్టి అసూయలేకుండా తనక్రింది ఉద్యోగుల పనిని మెచ్చుకొనడం కద్దు.

పరిపాలనా దక్షతగలవా డెప్పుడూ నాయకత్వ లక్షణాలు కూడా కలిగివుండడం ముఖ్యం. నాయకత్వ లక్షణాన్ని నిర్వచించడం కష్టంగాని. నాయకుడంటే ఇతరుల నిల్లై ఆకట్టుకోగలిగేవాడై వుండా లని చెప్పవచ్చు. నాయకుడు ఉత్సాహంతో ఇతరులను ఉద్రేక పర్చ గలగాలి, నాయకత్వం అనేది మానవ సంబంధాలను సాపుచేసే ఒక రకమైన కళ అని చెప్పబడుతోంది. అంటే మంచినాయకునికి వివేక ముండాలి. కార్యనిర్వాహణా కౌశలం వుండాలి. ఈ గుణాలు అతనికి చిక్కుల నెదుర్కొవడంలో దోహదం చేస్తాయి. అందుచేత కార్య నిర్వాహణాధికారికి ఆకర్షణీయమైన వ్యక్తిత్వం అవసరం. అతడికి మర్యాదా వుండాలి; అదేసమయంలో నిక్కచ్చిగానూ వుండాలి. అతను

స్వంత అభిప్రాయాలు కలిగి వుండటమే కాదు: ఇతరుల అభిప్రాయలనూ, ఉద్దేశాలనూ అవసరమైతే స్వీకరించే శక్తికూడా అతనికి వుండాలి. కాలానుగుణంగా మారుతూవుండడం అవసరం. పోతే పరిపాలకుడికి వుండాల్సిన చివరి లక్షణం -- పథకం వేయడం. నిర్వహణ సమస్య సమన్వయీకరణకుతగ్గ పరిపాలనా దక్షత, సామర్థ్యతా వుండాలి. మంచిపరిపాలకుడెవరూ తన అసిస్టెంట్లకూ, తనక్రింద నున్న ఉద్యోగులకూ అధికారాలను బదలాయించ డానికి జంకడు. సరైన వ్యక్తులను ఎన్నుకుంటాడు. వారికి అనేక విధులను అప్పగిస్తాడు. ఈ విషయంలో తనకన్నా తెలివితేటలూ, మంచీ మప్పిదం, విజ్ఞానం, సామర్థ్యతా గలవారెవరూ లేరని అతడు భావించడు. మంచి పరిపాలకుడైన వాడు పొదుపుకోసం కృషిచేస్తూ వుంటాడు. ఒక్కమాటలో చెప్పాలంటే, అందరికీ ఆమోదయోగ్యమైన వ్యక్తిత్వమూ: ప్రజలతో కలసి మెలసి తిరిగే శక్తీ; చొరవ, ప్రతి నాలుగు కేసుల లోనూ మూడింటిలో సక్రమమైన నిర్ణయాలు తీసుకొనే సామర్థ్యత మున్నగు లక్షణాలుండడం కార్యనిర్వహణాధికారి తన ధర్మాన్ని విజయవంతంగా నిర్వర్తించడానికి అత్యవసరం.

అయితే సమస్యల్లా అటువంటి పరిపాలకులు స్వతహాగా పుడతారా లేక తయారవుతారా? అన్నది. అటువంటి పరిపాలనా దక్షత పుట్టుకతోనే వస్తుందని కొందరంటారు. కాని కొంతమందిలో ఈ విషయం నిజమని అనుకున్నా, పరిపాలకుల్లో అసంఖ్యాకులు క్రమేణా తయారైనవారేనని మనం అంగీకరించి తీరాలి, పోటీ పరీక్షలు (competetive examinations) లేదా అందుకు తగిన పరీక్షలు జరిపి తద్వారా ఆయా వ్యక్తులలోవున్న అవసరమైన తెలివితేటల్ని కనిపెట్టడంద్వారా ఈ పరిపాలకులు తయారవుతున్నారు. ఈ పరీక్షలు నిష్పాక్షికమైన, స్వతంత్రమైన సంస్థ పబ్లిక్‌సర్వీస్ కమీషన్ ద్వారా జరుపబడతాయి. ఆ తరువాత వారి మేధో, పరిపాలనా శక్తి యుక్తులను తగిన తరిఫీదు యివ్వడంద్వారా అభివృద్ధి చేయవచ్చు.

కార్యనిర్వాహక నాయకత్వంలో తరిఫీదు యివ్వాలిసిన ఆవశ్య కతను ఎక్కువచేసి చెప్పడం సాధ్యమైన విషయం కాదు. షిఫ్నర్ మాటల్లో చెప్పాలంటే, సంస్థ పెద్దదైన కొలదీ కొద్దిమంది చేతుల్లో కంట్రోలును కేంద్రీకరించే ధోరణి ఎక్కువవుతుంది. రాబర్ట్ మైఖేల్ ప్రకారం ఇది, కొద్ది మంది చేతుల్లో తయారైన ఇనుపచట్రంగా వుంటుంది. నాయకత్వం అంటే - నిర్వహణ, సమన్వయీకరణ, వ్యక్తులను చలింపజేసే శక్తి, వాంఛించిన లక్ష్యాల సాధనకు గ్రూపు లను సమాయత్తం చేయడం వగైరా కళగా నిర్వచించవచ్చు. ఇందుకు గాను మాట నేర్పరితనమూ, మేధావి తనమూ, సాంఘిక నేర్పూ అవసరం. షిఫ్నర్ నాయకత్వాన్ని, ఆజ్ఞాధికారాలుగల "కమాండ్"తో పోల్చుతాడు. ఆజ్ఞ లేదా ఉత్తర్వు అనేది బలప్రయోగంపై ఆధారపడి వున్నది. కాని నాయకత్వం ఎదుటవారిని ఒప్పించి తనవైపుకు తిప్పు కునే నేర్పరితనంపై ఆధారపడివుంది. ఏది ఏమైనప్పటికీ నాయకత్వాన్ని గూర్చి సంప్రదాయ సిద్ధంగా వస్తున్న భావాలు ఇటీవల సాంఘిక పరి శోధనలవల్ల కొంత మార్పు చెందాయి. నాయకత్వం అంటే వ్యక్తి గతమైనది గాదని, అది గ్రూపుకు సంబంధించినదన్న భావం వెల్లి డైంది. అంటే నాయకుడూ, అతని క్రింద వున్న అనుయాయులు ఒకరిపై ఒకరు ప్రభావం కలిగివుంటారన్నమాట. నాయకత్వం అనేది "స్థితిజనితం" (situational), అంటే, నాయకత్వం ఏ ఒక వ్యక్తి యొక్క వ్యక్తిగత లక్షణాలమీదనో గాక, ఆ ప్రత్యేక స్థితి, లేదా పరిస్థితి లక్షణాలపైన ఆధారపడి వుంటుంది. నాయకత్వంయొక్క గ్రూపు లక్షణానికి ఉదహరణగా, ఇంగ్లాండు ప్రధానిగా లేబర్ నాయ కుడు అట్లీని ఎన్నుకోవడాన్ని పేర్కొనవచ్చు. అట్లీ ఏదో పెద్ద శక్తి యుక్తులున్న వాడూకాదు; లేదా అంత గొప్ప మేధావీకాదు. కాని పరి స్థితిని చక్కగా అంచనా వేయగల సమర్థుడు. ఒక పని నిర్వహించా లంటే అందుకు తగ్గ వ్యక్తులను ఎన్నిక చేసుకోగలవాడున్నూ. పైగా ఆతను ఉద్యోగుల కార్యకలాపాల మధ్య సమన్వయాన్ని సాధించగల వాడున్నూ, తనకు అనుయాయులుగావున్న వారిపై తన అభిప్రాయా లను బలవంతంగా రుద్దేవాడే నాయకుడన్న పాత భావాలకు కాలం

చెల్లుతోంది. నీతి, నిజాయితీ, సహకారం, ఉత్పాదకశక్తి, వనర్లూ బాధ్యతయుతమైన ప్రజాస్వామిక నాయకత్వంక్రింద అభివృద్ధి చెందు తాయనేది ఇప్పుడు గ్రహించబడింది. చివరకు ప్రయివేట్ వ్యాపారంలోకూడా నాయకత్వం అనేది చాలవరకు రాక్‌ఫెల్లర్, ఫోర్డు లేదా ఎడిసన్‌లాంటి పాతరకపు వాణిజ్యవేత్తలనుండి కొత్త తరహా నాయకత్వానికి మారింది. ఇది యాజమాన్య రూపంలో వచ్చిన విప్లవం, ఫలితంగా బురాక్రటిక్ నాయకత్వం వృత్తిరీత్యా స్థిరపడిపోయింది. ప్రొఫెసర్ ఫిఫ్నర్ చెప్పినట్లు, సమన్వయం అనేది కార్యనిర్వాహణాధికారి ప్రధానవిధులలో ఒకటి. సమన్వయీకరణను, సహకారాన్ని సాధించాలంటే జాతికి వలెనే ఒక సంస్థకూడా, అందరినుండి బలమైన తోడ్పాటు పొందడానికి, అందరికీ అందుబాటులోవుండే విలువలూ, ఉద్దేశాలూ వుండాలి.

* * *

"ప్రజలు రాజకీయమైన తప్పిదాలు చేస్తారని వాదించడం శుద్ధ తెలివి తక్కువ పని. వారు ఘోరమైన తప్పులు చేయగలరు, చేస్తారు. అది వారికి తెలుసు. అందుకు ప్రతిఫలమూ పొందుతారు. కాని ప్రతి నిరంకుశాధికారంక్రిందజరిగే తప్పిదాలతో పోల్చుకుంటే ప్రజల తప్పిదాలు అంత ప్రాధాన్యమైనవి కావు."

— కాల్విన్ కాలిడ్జ్.

# గ్రామ స్వరాజ్యం

— గాంధీజీ

మహాత్మాగాంధీ జీవిత తత్వమూ, ఆయన జీవిత పోరాటాన్నీ ఒక్క మాటలో చెప్పాలంటే, "అణగారిన ఆర్తుల సముద్ధరణే" ఆయన పరమలక్ష్యం, ఆయన భావించిన స్వరాజ్యం కేవలం విదేశీ పాలననుండి భారతదేశానికి స్వాతంత్ర్యం సాధించడమే కాదు; విపరీత కేంద్రీకృతాధికారం నుండికూడా భారతదేశానికి విముక్తి కలిగించడం, ఆయన యావద్భారతావనికి స్వాతంత్ర్యంతోనే సంతృప్తి చెందలేదు. ఆయన కోరుకున్నది, భారతదేశంలోని ప్రతి ఒక్క గ్రామానికి స్వాతంత్ర్యం అందుకనే ఆయన గ్రామ పరిపాలన పంచాయతీల ద్వారా జరపాలని సూచించారు. తమకున్న ప్రాచీన సంప్రదాయాన్ని పుణికి పుచ్చుకున్న గ్రామ పంచాయతీలు, గ్రామాలను బీదరికంనుండీ, అంటు వ్యాధులనుండి, సోమరితనంనుండీ విముక్తిచేసి గ్రామానికొక నిర్దిష్టమైన రూపాన్ని నిర్మాణాన్ని యివ్వగలవు అని గాంధీజీ భావించారు. అందువల్లనే ఆయనెప్పుడూ, భారత స్వాతంత్ర్యం అనేది గ్రామాలనుండే ప్రారంభం కావాలని నొక్కి చెపుతూ వచ్చారు. 1941 జూలై 22న "హరిజన" పత్రికలో గ్రామరాజ్యాన్ని గూర్చి తన అభిప్రాయాలను గాంధీజీ యిలా వెల్లడించారు: "గ్రామస్వరాజ్యం అంటే నా ఉద్దేశం - గ్రామం సంపూర్ణ రిపబ్లిక్‌గావాలి. తన ప్రధానమైన కోర్కెలకోసం అది ఇతరులతో ప్రమేయం లేకుండా స్వతంత్రంగా వుండాలి. అయితే అనేక విషయాలలో ఒకదానిపై ఒకటి ఆధారపడి వుండాలి. ఈ విషయంలో ఇతర్లపై ఆధారపడ్డం తప్పని సరి. ఆ విధంగా గ్రామంయొక్క ప్రథమ కర్తవ్యం తనకు అవసరమైన ఆహార పంటలను, తనకు కావాల్సిన బట్టకు సరిపడా పత్తిని పండించుకోవాలి. గ్రామంలో ఆ గ్రామంలోని పశువులకు అవసర

పైన రిజర్వులు వుండాలి. వయోజనులకు, పిల్లలకూ వినోదానికీ, ఆట పాటలకు స్థలాలుండాలి. ఆ తరువాత యింకా అదనపు భూమి మిగిలితే, వాణిజ్యపంటలు వేసుకోవచ్చు. గంజాయి, పొగాకు, నల్లమందు వగైరాలను త్యజించవచ్చు, ప్రతి గ్రామమూ ఒక థియేటర్, పాఠశాల పబ్లిక్ హాలు నెలకొల్పు కుంటుంది. పరిశుభ్రమైన నీటి సరఫరాకోసం గ్రామం స్వంతంగా వాటర్ వర్క్స్ ఏర్పాటు చేసుకుంటుంది. ఈ పనిని కంట్రాక్టు బావులు, లేదా చెరువులద్వారా సాధించవచ్చు. తుది బేసిక్ విద్యవరకూ విద్య నిర్బంధంగా వుంటుంది. సాధ్యమైనంతవరకూ ప్రతి కార్యక్రమమూ సహకార ప్రాతిపదికపై నిర్వహింపబడుతుంది, గ్రామ గార్డు సర్వీసు తప్పని సరిగా వుంటుంది. గ్రామ రిజిష్టరు ప్రకారం ఈ గార్డులు (దళాలు) వరుసవారీగా ఎన్నిక చేయబడతారు. గ్రామ పరిపాలన పంచాయతీ ద్వారా జరుగుతుంది. ఈ పంచాయతీలో ప్రతి ఏటా గ్రామ వయోజనులుచే ఎన్నుకోబడ్డ అయిదుగురు సభ్యులుంటారు. వీరు తగిన కనిష్ఠ అర్హతలు కలిగివుంటారు, అవసరమైన అధికార ఆధిపత్యాలను వారు చెలాయిస్తారు. మనం మామూలుగా అనుకునే శిక్షలు విధించే పద్ధతి ఏదీ పంచాయతీలో వుండదు. కాబట్టి, ఈ పంచాయతీయే శాసన కర్తగా, న్యాయ, కార్యనిర్వాహక సంస్థగా తాను అధికారంలో వున్నంతకాలమూ వ్యవహరిస్తుంది. ఏ గ్రామమైనా అటువంటి రిపబ్లిక్‌గా రూపొందవచ్చు. ఇక్కడే వ్యక్తి స్వేచ్ఛపై ఆధారపడ్డ సిసలైన ప్రజాస్వామ్యం వుండేది. వ్యక్తి తన ప్రభుత్వానికి నిర్మాత వంటివాడు. అహింసా సిద్ధాంతం అతనినీ, ప్రభుత్వాన్నీ శాసిస్తుంది. వ్యక్తిని, అతని గ్రామ ప్రపంచమంతా కలసినా ఓడించలేరు. ప్రతి గ్రామీణుణ్నీ శాసించే సూత్ర మేమిటంటే, తన గౌరవాన్ని, తన గ్రామీణుల గౌరవ ప్రపత్తులనూ రక్షించుకోడానికి తుదకు అతను తన ప్రాణాలనైనా పణంగా పెడతాడు."

— ఇదీ, గాంధీజీ కలలుగన్న గ్రామ స్వరాజ్యం.

# వినోబాభావే ఆశించే "గ్రామీణ కుటుంబాల యుగం"

గత కొలది సంవత్సరాలుగా ఆచార్య వినోబాభావే చెపుతున్న మాటలు అనేకమంది మనస్సుల్లో ప్రతిధ్వనిస్తున్నాయి. భూదానోద్యమ కార్యక్రమ సందర్భంలో గ్రామీణ సమస్యలపట్ల ఆయన సమన్వయ పూర్వక వైఖరి అవలంబిస్తూ వచ్చారు. ఈ వైఖరి అత్యంత దీనావస్థలోవున్న మన గ్రామాలను సమూలంగా పునర్నిర్మించే విషయమై పరిశీలించేందుకు సాధ్యమైన సక్రమ చర్య అని ఇప్పుడు అతివాదులు సహితం అంగీకరిస్తున్నారు. వినోబా సాగించిన భూదాన పాద యాత్రలు తన లక్ష్యమైన "రాజ్యాంగరహిత వర్గరహిత సమాజాన్ని" సాధించేందుకు వినియోగిస్తున్న సాధనాలు. మరోవిధంగా చెప్పాలంటే ఈ వర్గరహిత సమాజం అనేది, సమిష్టి కుటుంబంగా వర్ధిల్లే స్వయం పోషకమైన స్వతంత్ర గ్రామం అని పేర్కొనవచ్చు. సాగు భూమి విషయంలో వ్యక్తిగత యాజమాన్యం రద్దయి, దానిస్థానే సమిష్టి యాజమాన్యం అంటే సమాన పని, సమానహక్కులు కలిగివుంటూ, తామునివసించే గ్రామాధికారంక్రిందకువచ్చే యావత్తు భూమిపైన సమిష్టి బాధ్యతవహించే యావత్తు గ్రామప్రజల యాజమాన్యం ఏర్పడినప్పుడు మాత్రమే పైన చెప్పిన "గ్రామీణ కుటుంబాల యుగం" ఆవిర్భవిస్తుందని శ్రీ భావే ఊహిస్తున్నారు. ఈ విషయమై శ్రీ భావే యింకా యిలా చెపుతున్నారు:—

"జీవితానికి ఆధారం భూమి. అందువల్ల ఆ భూమి కోరుకున్న వారి అందరికీ స్వేచ్ఛగా అందుబాటులో వుండాలి. దాన్ని ఉపయోగించ గలిగిన వారందరికీ అందుబాటులో వుండాలి. ఈ రోజున ప్రతిదీ డబ్బు రూపంలో విలువ కడుతున్నారు. డబ్బు రూపంలో విలువ కట్టలేని పదార్థాలుకూడా కొన్నివున్నా యన్న సంగతి మనం మరచి

పోరాదు. అటువంటి వెలలేని వస్తువుల్లో భూమి ఒకటి. కావాలని కోరుకున్న ప్రతి ఒక్కరికీ భూమి కావాలని కోరుకోడానికి హక్కు వుందనీ, అతడికి భూమి యివ్వడం సంఘం ధర్మమని అందరూ గుర్తించాలి. దప్పికగొన్నవాడికి నీరు అడిగే హక్కు ఎలావుందో, సాగుదారుడికికూడా భూమి కావాలనడానికీ అంత హక్కువుంది. అందువల్ల దప్పికగొన్నవాడికి మనం మంచినీళ్ళిచ్చినట్లే, కష్టపడి సాగుచేసుకునేవాడికీ అలాగే భూమిని యివ్వాలి. భూములు వ్యక్తుల పరం కాకూడదు. అవి గ్రామ ప్రజలసొత్తు. కాయకష్టం చేయడానికి సిద్ధపడనిదే భూమి ప్రతిఫలం యివ్వదు. భూమికోసం తహతహ లాడుతున్నారంటే అర్థం, జీవితంలో ప్రతి ఒక్కడికీ డిమాండ్ చేయ డానికి హక్కున్న పనికోసమన్నమాట. పని కావాలని అడగడం అతడి జన్మహక్కు."

ఈ లక్ష్యాల సాధనకు వినోబా వికేంద్రీకృతాధికారం కావాలని అంటున్నారు. కేంద్రీకృతాధికారం చెడుగుల్ని శ్రీ వినోబా మాటల్లోనే చెప్పాలంటే, "దేశంయొక్క నాయకత్వమంతటినీ నలుగు రైదుగురికే వదలితే, వారు వ్యక్తిగతంగా చేసే తప్పులన్నింటివల్ల వచ్చే ఫలితాలనూ యావద్దేశమూ అనుభవించక తప్పదు. అందువల్ల ఒక గ్రామం తప్పిదంచేస్తే, మరో గ్రామం అదే తప్పును చేయదు. కాబట్టి అధికారాన్ని ప్రతి గ్రామానికీ పంపిణీచేయాలి. "వికేంద్రీకృతాధి కారం అమలులోకి రావాలి,"

# 'నెహ్రూ - ఏకైక నాయకుడు'

నవభారతదేశంలో జాతీయ నాయకుడుగా ప్రధాని నెహ్రూ అద్వితీయమైన పేరు గడించుకున్నారు. అయితే ఎదురులేని స్వీయ ప్రతిభతో కూడుకున్న నాయకత్వాన్ని చేపట్టడానికి నెహ్రూకు దోహదంచేసిన శక్తి ఏది అని ప్రశ్నించుకున్నప్పుడు అందుకువచ్చే సమాధానం - ఆయన వ్యక్తిత్వమూ, నిజాయితీ, నిస్వార్థతా, దయార్ద్రతా, నిక్కచ్చితనం, నిష్కల్మషమైన భావాలూ, సహచరులపట్ల అణకువ, సమ్మిన దానికి జీవితాన్ని అంకితం చేయడమూ ఆయనా కాపేరు తెచ్చిపెట్టాయి. యింకా అలాంటి అసాధారణ లక్షణాలు ఎదుటవారిని ఆదర్పగల లక్షణాలూ అందుకు దోహదంచేశాయి. నెహ్రూకు గురువుల్యులు గాంధీజీ. గాంధీజీ ఆయనకొక ప్రేరణశక్తి. భారతప్రజల దారిద్ర్యాన్ని తుదముట్టించడానికి ఉద్యుక్తుడైన తిరుగులేని నాయకుడుగా ప్రఖ్యాతిగన్నారు. తన మాతృదేశంపట్ల నిర్వర్తించాల్సిన బాధ్యతలను నిర్వహిస్తూనే శ్రీ నెహ్రూ, తన కాలాన్ని సంపదనూ వెచ్చించారు.

ఒకసారి నెహ్రూ యిలా అన్నారు: "ప్రజా నాయకుడు ఎలా ప్రవర్తించాలి? అతడు నాయకుడైతే, నాయకత్వం వహించాలి. కేవలం ప్రజలు చెప్పినట్లే నడచుకోవడం తగదు. ఒకవేళ అలాచేస్తే అతడు నాయకుడేకాదు. సరైన అభ్యుదయపథంవైపు యితరులను ఎక్కువ దూరం నడిపించలేడు. తను దర్శించినరీతినే తానొక్కడై ప్రవర్తిస్తే, తాను ఎవరికి నాయకత్వం వహించాలనుకున్నాడో వాళ్ళనుండి వేరుపడిపోతాడు. ఇతరుల అవగాహన స్థాయికే ఒకవేళ అతను దిగజారితే, అప్పుడు తను వ్యక్తిత్వం కోల్పోయినట్లే. తన భావానికి, ఉద్దేశానికి న్యాయం చేకూర్చుకోలేడు. రాజీ పడతాడు. ఒక్కోసారి అటువంటి రాజీమార్గం తొక్కాడా, అటువంటి రాజీలకు అంతూ పొంతూ వుండదు. అప్పుడు దారి జారుడుగావుంటుంది. ఏదైనా

జారిపోవచ్చు. అప్పుడు అతను చేసేదేమిటి? ఈ విషయాన్ని అతడు ఇతరులుకూడా గ్రహించేటట్లుచేయడంలో సఫలీకృతుడుకావాలి."

నెహ్రూ నాయకునికిచ్చిన నిర్వచనాన్ని, నాయకత్వంపట్ల వెలిబుచ్చిన అభిప్రాయాన్నే జాతీయ నాయకత్వాన్ని రూపొందించడంలో ఆయన పాత్రకు అనువర్తింపజేసినట్లయితే, ఆయన చెప్పిన మాటల్లో ఏ ఒక్కటీ ఆయన చర్యల్లో లోపించడం లేదనేది మనకు తెలుస్తుంది, "ఆయన చాలాచాలా పవిత్రమైన ప్రజాస్వామ్యవాది". జాతీయ విషయాలలో ప్రజలంతా పాల్గొనాలని ఎప్పుడూ నొక్కి చెపుతూఉండే నాయకుడాయన. కేవలం గుడ్డెద్దు చేలోపడ్డట్లు కాల ప్రవాహంలో పడి కొట్టుకుపోకుండా తన ప్రజలను 20వ శతాబ్దపు జాతి జనులుగా పునరుద్ధరించేందుకై శ్రీ నెహ్రూ స్వాతంత్ర్యం రాకముందు తానేర్పరచుకున్న లక్ష్యాలకు రూపు రేఖలు దిద్ద యత్నిస్తున్నారు. "నెహ్రూ ఒక రాజకీయ జీవితచరిత్ర" అన్న తన పుస్తకంలో శ్రీ మైఖేల్ బ్రీచర్ వ్రాసినట్లు: "ఆచరణయుక్తంగావున్న నేటి పార్లమెంటరీ ప్రజాస్వామ్యానికి ఆయన పునాదులు వేశారు. ప్రణాళికా యంత్రాంగాన్ని తీర్చి దిద్దినవారు, ప్రణాళికలద్వారానే భారతదేశానికి భౌతికాభ్యున్నతి సుసాధ్యమన్న భావాన్ని నూరిపోసినవారున్నూ, వ్యక్తిగత హక్కులుండాలని నొక్కిచెపుతూనే భారత నూతన రాజ్యాంగాని కొక తాత్విక దృక్పథాన్ని సమకూర్చి పెట్టినవారు శ్రీ నెహ్రూ. లౌకికమైన, సమానత్వ వైఖరితో కూడుకున్న నవ సమాజ నిర్మాణం జరగాలన్న లక్ష్యానికి దేశమంతటా అంగీకారాన్ని పొందడంలో ఆయన విజయం సాధించారు. భారతదేశానికి స్వధర్మంపై నమ్మకాన్ని పునఃప్రతిష్ఠాపించడమే కాకుండా, ప్రపంచ దేశాలలో భారతదేశానికొక ఉన్నత స్థానాన్ని సంపాదించగలిగారు."

ఇదీ, జాతీయ నాయకుడుగా శ్రీ నెహ్రూ వహించిన పాత్ర. ఈనాడు దేశానికి కావలసింది అటువంటి చోటా నెహ్రూలు. దేశంలో పంచాయతీ రాజ్యాన్ని పునరుద్ధరించాలంటే కోట్లాది గ్రామీణులకి నాయకత్వం వహించి వారిలో ఉత్సాహాన్ని రేకెత్తించాల్సిన ధర్మం వారిపైవుంది.

# సమాజాభివృద్ధి

## ఆచరణలో దాని తత్వం

గ్రామీణ ప్రాంతాల అభివృద్ధి అనేది గతంలో ప్రభుత్వాల నెదుర్కొన్న ప్రధాన చిక్కు సమస్యల్లో ఒకటి. ఈ సమస్యా పరిష్కారానికై తీసుకున్న చర్యలుకూడా డిపార్ట్‌మెంటల్‌గా వుండేవి. అందుకని ఈ చర్యలు సహజంగానే అనుకున్న ఫలితాలనిచ్చేవికావు. ప్రభుత్వ శాఖలు (డిపార్ట్‌మెంట్లు) ఏనాడూ గ్రామీణ ప్రజలతో ప్రత్యక్ష సంబంధాలేర్పరచుకున్న పాపానపోలేదు. అంతేగాదు, వాటన్నిటికిమించి శాఖల అధికారులు గ్రామాభివృద్ధి కార్యక్రమాలపట్ల ఆసక్తి చూపేవారూకాదు; అభివృద్ధి కార్యక్రమాలనుగూర్చిన విజ్ఞానమూ వారి కంతగా వుండేదీకాదు. అందువల్ల ఈ విధమైన ప్రభుత్వ 'చొరవ'వల్ల గ్రామీణవసర్లు గ్రామాభివృద్ధి ని ...త్తం అభివృద్ధిచెంద టానికిగాని, వాటి సమీకరణగాని సాధ్యమయేదికాదు. కాబట్టే ఆయా ప్రాంతప్రజల ఆర్థిక, సాంఘిక పునరుద్ధరణకు అవసరమైన బహుముఖా వసరాలను ఆదుకునేందుకై అనేక రకాల సాధనాలను, మార్గాలను కని పెట్టడం అనేది పరిపాలకుల దృష్టిని ఆకర్షించింది. అందుకనే వారు ఈ విషయమై ఎల్లప్పుడూ సుదీర్ఘంగా ఆలోచిస్తున్నారు.

భారతప్రభుత్వం "అధికారోత్పత్తి విచారణ సంఘాన్ని" నియమించడంకూడా గ్రామీణాభివృద్ధికై ప్రభుత్వంచేసే ప్రయత్నాలలో ఒకటి. ఇతరత్రా ప్రయత్నాలకన్నా ప్రభుత్వంగైకొన్న ఈ చర్య దేశానికి భవిష్యద్దవకాశాలు ప్రసాదించింది. మరోవిధంగా చెప్పాలంటే, భారతీయ గ్రామాల సర్వతోముఖాభివృద్ధికి ఈ సంఘం గ్రామాలలో గొనిరావాల్సిన శాంతియుత విప్లవానికి సాధనాలను సూచించింది.

మొత్తం దేశమంతటా ఏడెనిమిది సంవత్సరాలలోగా "జాతీయ విస్తరణ" ఉద్యమాలను (National Extension movements) ప్రారంభించాలని అధికాహారోత్పత్తి విచారణ సంఘం సిఫార్సుచేసింది. ప్రణాళికా సంఘం ఈ సూచనను అంగీకరించింది. వెంటనే దేశమంతంతటా సమాజాభివృద్ధి కార్యక్రమానికి (community development programme) పూనుకున్నది. ఈ కార్యక్రమం మొదటిసారిగా 1952, అక్టోబర్ 2న (మహాత్మాగాంధీ జన్మదినోత్సవం నాడు) 55 ప్రాజెక్టు ప్రాంతాలలో ఒకేసారి ఆరంభింపబడింది. మూడు సంవత్సరాలలో బహుముఖ కార్యక్రమాల అమలుకుగాను ఈ సమాజాభివృద్ధి పథకాలు ఉద్దేశింపబడ్డాయి. అయితే గ్రామీణాభివృద్ధి అనేది నిత్యమూ వుండే కార్యక్రమం. అందువల్ల సమాజాభివృద్ధి ప్రాజెక్టులకు తోడుగా జాతీయవిస్తరణ కార్యక్రమాన్నికూడా జత చేర్చారు. ఈ విస్తరణ పథకాలకు సమాజాభివృద్ధి పథకాలకన్న తక్కువ స్థాయిలో పనులు, కొద్దిపాటి డబ్బును అప్పగిస్తారు. ఈ కార్యక్రమాన్ని, సమాజాభివృద్ధి పథకానికి ప్రారంభోత్సవం జరిగిన వెంటనే అంటే మహాత్మాగాంధీ జన్మదినోత్సవం మరునాడే దేశమంతటా ప్రారంభింపబడింది.

సమాజాభివృద్ధి ప్రాజెక్టుల, జాతీయ విస్తరణ కార్యక్రమాల లక్ష్యాలూ, ఉద్దేశాలూ ఒకటే. అయితే జాతీయ విస్తరణ కార్యక్రమం అనేది ప్రాథమిక అంశం. ఇందులో అధికారులూ, అనధికారులూ, కొద్దిపాటి ద్రవ్య అంశాలూ ప్రధానపాత్ర వహిస్తారు. సాధ్యమైనంత ఎక్కువ ప్రజా సహకారంతో పనిచేయడంద్వారా ఈ సంస్థ అనుకున్న ఫలితాలను సాధించగలిగితే, జాతీయ విస్తరణ ప్రాజెక్టులను సమాజాభివృద్ధి ప్రాజెక్టు హోదాకు పెంచుతారు. అప్పుడు దానికి మూడేళ్లకు సరిపడా ఎక్కువ అభివృద్ధి కార్యక్రమాలను అప్పగిస్తారు. ద్వితీయ ప్రణాళికా కాలంలో జాతీయ విస్తరణ పథకాలక్రిందకు దాదాపు మొత్తం గ్రామీణ ప్రాంతాలన్నీ రావాలని ఉద్దేశించబడింది. ఇందులో కనీసం 40 వంతులన్నా బహుముఖ సమాజాభివృద్ధి పథకంక్రిందకు రావాలని లక్ష్యంగా పెట్టుకోవడం జరిగింది.

రాష్ట్రస్థాయిలో అభివృద్ధి పథకంయొక్క నిర్మాణ స్వరూపం ఎలావుంటుందో చూద్దాం :— జాతీయ విస్తరణ పథకాల అమలుకు అవసరమైన మూలవిధానాన్ని రూపొందించేందుకు ఒక "అభివృద్ధి సూచన సంఘం" వుంటుంది. ఇందులో ముఖ్యమంత్రి, అభివృద్ధి కార్యక్రమాలనుచూచే మంత్రులూ, సభ్యులుగా వుంటారు. రాష్ట్ర డెవలప్‌మెంట్ కమిషనర్ ఈ సంఘానికి కార్యదర్శిగా వ్యవహరిస్తారు. సమన్వయీకరణ నిమిత్తం, డెవలప్‌మెంట్ కమీషనర్ అధ్యక్షతన ఒక కమిటీ పనిచేస్తూంటూంది. ఇందులో ప్రభుత్వశాఖల అధిపతులూవుంటారు. అనుకున్న పద్ధతుల్లో మొత్తం రాష్ట్రప్రణాళిక అంతా జరిగిపోయేటట్లు చూడ్డం వారివిధి. వివిధశాఖల సాంకేతిక అధికారులు అభివృద్ధి కార్యక్రమాల నిర్వహణాధికారికి సహాయపడుతూవుంటారు. సమాజాభివృద్ధి కార్యక్రమ నిర్వహణ సిబ్బందిలో గ్రామస్థాయిలోవుండే కార్యకర్త కీలకమైన వ్యక్తి. అతడే పరిపాలన అనే గొలుసులో ఆఖరి లింకుకూడా. ఈ గ్రామీణ కార్యకర్త, గ్రామీణుల నెదుర్కొనే సమస్యలన్నింటిలోనూ వారికి మొదటి సహాయకుడుగా వుంటాడు. వ్యవసాయం, విస్తరణ, ఆరోగ్య, పారిశుధ్య వ్యవహారాలలో గ్రామీణుల కితడు సలహాయిస్తాడు. వయోజన విద్యాకేంద్రాలు, పాఠశాలలు, సమాజ కేంద్రాలు నెలకొల్పడంలోనూ, సహకార సంఘాల ఏర్పాటులోనూ సహాయంచేస్తాడు. ఒక్కమాటలో చెప్పాలంటే గ్రామీణ కార్యకర్త అన్నవాడు బహుముఖ ప్రయోజనకారి।

సమాజాభివృద్ధి కార్యక్రమం వివిధ రకాల కార్యకలాపాలకు చెందినటువంటిది. గ్రామాలలో సాంఘికార్థికాభివృద్ధిని సాధించేందుకు ఇవి తోడ్పడతాయి. తాము పాల్గొనే కార్యక్రమం ప్రాధాన్యతగలది గానూ, అందుకు బాధ్యత వహించేటట్లు ప్రజలను తయారుచేయడం ద్వారా ఈ అభివృద్ధి ఆ గ్రామీణుల స్వంత చొరవవల్లనే జరగాలి. వుంది. ఆయా స్థానిక ప్రాంతాలలో నివసించే ప్రజలందరికీ ఆ సానికాభివృద్ధి కార్యక్రమంలో ఆసక్తి జనింపజేసేందుకు ఈ పథకం ప్రయత్నిస్తుంది. "సమాజాభివృద్ధి కార్యక్రమమనేది ఒక పద్ధతి.

దీనిద్వారా గ్రామీణుల సాంఘికార్థిక జీవిత పరివర్తన దశకు నాందీ పలకడానికి పంచవర్ష ప్రణాళిక యత్నిస్తుంది" అని సమాజాభివృద్ధి పథకాన్నిగూర్చి ప్రణాళికా సంఘం ప్రథమ పంచవర్ష ప్రణాళికలో వర్ణించింది. కాబట్టి, అభివృద్ధి ప్రాధాన్యతను ప్రజలచే గుర్తింపజేసి, ప్రజల స్థానిక ప్రజాతంత్ర, సహకార సంస్థలద్వారా కార్యక్రమాన్ని అమలుజరిపే బాధ్యతను గుర్తింపజేసేందుకే ఈ కార్యక్రమాన్ని అమలుపరచడంలో ప్రజలలో ఆసక్తిని, చొరవను పురిగొల్పాల్సిన అవసరం వచ్చింది. ఈ పద్ధతివల్ల, ఏ రాజ్యాంగమైతే మన ప్రజాస్వామ్యం విధానాలపై ఆధారపడివుందో ఆ ప్రజాస్వామ్య పునాదులు బాగా బలపడుతాయి. తద్వారా సమాజాభివృద్ధి, అభ్యున్నతీ, ప్రజాస్వామ్యమూ ఒకదానికొకటి చెట్టపట్టాలు కట్టుకుని బలోపేత మవుతాయి.

శ్రీ బల్వంతరాయ్ మెహతా కమిటీని భారతప్రభుత్వం నియమించింది. సమాజాభివృద్ధి పథకాలూ, జాతీయవిస్తరణ కార్యక్రమమూ ఎలా అభివృద్ధి చెందుతున్నదీ పరిశీలించి, నివేదిక తయారుచేసేందుకై ప్రభుత్వం ఈ కమిటీని నియమించింది. పొదుపరితనాన్ని, సామర్థ్యాన్ని సాధించడంకూడా ఈ కమిటీపని. 1957 నవంబరులో సమర్పించిన నివేదికలో ఈ కమిటీ ఇలా సూచించింది :- "తన అధికారంక్రిందనున్న గ్రామ సంస్థకు ప్రభుత్వం, అభివృద్ధి పనులకు సంబంధించిన బాధ్యతలనూ, విధులనూ పూర్తిగా వదలివేయాలి. ప్రభుత్వం వాటిపై అజమాయిషీ, నిర్వహణాధికారాలు మాత్రమే వహించాలి. బ్లాక్ స్థాయిలలోవున్న గ్రామ పంచాయితీలనుండి పరోక్ష ఎన్నికలద్వారా పంచాయతీ సమితులను ఏర్పర్చాలి. అభివృద్ధి బ్లాక్‌తో సరిసమానంగానే దీని అధికారంకూడా వ్యాపించివుంటుంది. ప్రణాళిక వేయడంలోనూ, సమాజాభివృద్ధి కార్యక్రమాన్ని అమలు జరిపించడంలోనూ ఒకవైపున ప్రభుత్వం విశాలమైన లక్ష్యాలను పెట్టుకుంటుంది. ప్రణాళిక సాధారణ స్వరూపం ఎలావుండాలో నిర్ణయిస్తుంది. ద్రవ్య, సాంకేతిక, సూపర్వైజరీ సహాయం వగైరా ఎంతవరకు లభ్యమయేదీ అంచనావేస్తుంది. పోతే మరోవైపున, ప్రణాళిక వివరాలను రూపొం

దించి వాటిని అమలుజరపడం సిబ్బంది సాయంతో స్థానిక ప్రజాప్రతినిధులు నెరవేర్చాల్సిన విధి. సాధించాల్సిన లక్ష్యాలు నిర్ణయించడంలో సమిష్టి బాధ్యతలను విస్పష్టంగా నిర్వచించుకోవాలి. అయితే ఒకదానికొకటి సంబంధంవుండేలా చూచుకోవాలి. ప్రజాతంత్ర -కేంద్రీకరణకు సంబంధించిన ఈ ప్రయోగం సాధ్యమైనంత ఎక్కువ ఫలితాలను యివ్వాలంటే, వికేంద్రీకరణ పథకంయొక్క మూడంచస్తులూ-అంటే పంచాయతీ, పంచాయతీ సమితులు, జిల్లాపరిషత్తూ ఒకేతఫా ప్రారంభంకావాలి. జిల్లా అంతటిలోనూ ఒకేతఫా అమలు జరగాలి"

పరిపాలనలో ప్రజాతంత్ర వికేంద్రీకరణను ప్రవేశపెట్టేందుకై చేయబడిన ఈ సూచనలన్నీ గ్రామీణాభివృద్ధికి ప్రాథమిక అవసరం. అందుచేతనే ఈ సూచనలను మన దేశంలోని అన్ని వర్గాలవారూ ఆహ్వానించారు. ఈ విషయంలో రాజస్థాన్‌తోకలసి మన ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం, అవసరమైన బిల్లును తేవడంద్వారా సూత్రప్రాయంగా ఈ సూచనలకు బలాన్ని ఇవ్వడంలో నాయకత్వం వహించింది.

అప్పటినుండి 235 బ్లాకులలో పంచాయతీ సమితులు ఏర్పడ్డాయి. వాటిలో సమాజాభివృద్ధి పథకాలు అమలు జరుగుతున్నాయి. 20 జిల్లా పరిషత్తులు ఆంధ్రప్రదేశ్‌లోని అన్ని జిల్లాలలోనూ ఏర్పడ్డాయి. దీనితో తమ ఆర్థిక సాంఘిక పరిస్థితులను తమకు అవసరమైన రీతిలో తమకు సాధ్యమైనంత త్వరలోనే అభివృద్ధి చేసేందుకై గ్రామీణ ప్రజలకు ఒక మార్గం ఏర్పడిందన్నమాట.

## ఆంధ్రప్రదేశ్‌లో పంచవర్ష ప్రణాళికలూ సమాజాభివృద్ధి ప్రాజెక్టులూ

1952 అక్టోబరు 2వ తేదీన భారతదేశమంతటా ప్రారంభమైన 55 సమాజాభివృద్ధి ప్రాజెక్టులలోనూ నాలుగు ఆంధ్రప్రదేశ్‌కు కేటాయించబడ్డాయి. ఇవి: తూర్పుగోదావరి జిల్లాలోని కాకినాడ-పెద్దాపురం ప్రాజెక్టు; కర్నూలు-కడప జిల్లాలక్రిందకొచ్చే కర్నూలు-కడప కాల్వ ప్రాజెక్టూ; నిజామాబాద్ జిల్లాలోని నిజాంసాగర్ ప్రాజెక్టూ; వరంగల్ జిల్లాలోని ములుగు బ్లాక్. ప్రథమ పంచవర్ష ప్రణాళిక

పూర్తయేనాటికి ఆంధ్రప్రాంతంలో రెండు సమూజాభివృద్ధి ప్రాజెక్టులూ, 13 సమాజాభివృద్ధి బ్లాక్‌లూ; 22 జాతీయ విస్తరణ సేవా బ్లాక్‌లూ వున్నాయి. వీటన్నింటిక్రింద 11,281 చదరపుమైళ్ళ ప్రాతం వుంది. జనాభా 41 లక్షలకు పైగావుంది. మొత్తం గ్రామాలు 2 828 గ్రామాలు. తెలంగాణా ప్రాంతంలో 10 జాతీయ విస్తరణసేవా బ్లాక్‌లూ; 7 సమూజాభివృద్ధి బ్లాక్‌లూ; ఒక సమాజాభివృద్ధి ప్రాజెక్టు కేంద్రమూ వున్నాయి. వీటిక్రింద 6,352 చదరపు మైళ్ళ ప్రాతంవుంది, ఇది 1818 గ్రామాలకు చెందినది. జనాభా 16 లక్షలకు పైచిలుకు వుంటుంది.

ప్రథమ ప్రణాళికా కాలంలో సాగిన ఈ ఉద్యమం ద్వితీయ ప్రణాళికా కార్యక్రమాన్ని తేలిగ్గా, ఉత్సాహపూరితంగా రూపొందించడానికి పనికివచ్చింది. ద్వితీయ ప్రణాళికా కార్యక్రమం ప్రకారం, ఆంధ్రప్రదేశ్‌లోని ఆంధ్ర ప్రాంతంలో మొత్తం 303 బ్లాక్‌లూ; తెలంగాణాలో 144 బ్లాక్‌లూ వుంటాయి.

ఈ కార్యక్రమాన్ని విజయవంతంగా అమలు జరపడానికి తగినంత తరిఫీదువున్న ఉద్యోగ బృదం అవసరం. అందుచేతనే ప్రణాళికలో ఇప్పుడున్న సంస్థలకు తోడుగా మరోనాలుగు సంస్థలను గ్రామస్థాయిలో పనిచేసే కార్యకర్తల శిక్షణ నిమిత్తం నెలకొల్పాలని నిర్ణయించారు. రిఫ్రెషర్ కోర్సులు నడిపేందుకై మరో మూడు కేంద్రాలను నెలకొల్పాలని తలపెట్టారు, వీటన్నింటిని కలుపుకుని మొత్తం మీద 4,200 మంది గ్రామకార్యకర్తలూ, 260 మంది గ్రామసేవక్‌లనూ 1225 గ్రూపు లెవెల్ వర్కర్స్‌గా; 200 మంది కళాకారులూ తరిఫీదు కానున్నారు.

రాష్ట్రంలో సమూజాభివృద్ధి కార్యక్రమాల అమలుకై ద్వితీయ ప్రణాళికా కాలంలో కేటాయించిన మొత్తం రు. 1539.736 లక్షలు. ఇందులో ఆంధ్రపాంతానికి రు. 1044,943 లక్షలూ, తెలంగాణాకు రు. 494.740 లక్షలూ పంపిణీ చేస్తారు. కేటాయించబడ్డ డబ్బు మొత్తంలో రు, 483.342 లక్షలూ కేంద్రంనుండి అప్పుల రూపం

ల నూ. రు. 695.809 లక్షలు సబ్సిడీ రూపంలోనూ లభ్యమవుతుంది. పోతే మిగిలిన రు. 394.585 లక్షలూ రాష్ట్రం వాటా.

## 1959 మార్చి 31 నాటికి ఆంధ్రప్రదేశ్ లో బ్లాక్ ల పంపిణీ

| జిల్లా పేరు | 1 వ దశ | 2 వ దశ | సమా. అభి. | బహుముఖ | ప్రీ - ఎక్స్ట | మొత్తం |
|---|---|---|---|---|---|---|
| **ఆంధ్రలో:** | | | | | | |
| శ్రీకాకుళం | 9 | 1 | 2 | — | 2 | 14 |
| విశాఖపట్నం | 7 | — | 4 | 2 | 2 | 15 |
| తూ. గోదావరి | 6 | 9 | 1 | — | 1 | 17 |
| ప. గోదావరి | 8 | 2 | 2 | — | 1 | 13 |
| కృష్ణా | 9 | 2 | 1 | — | 1 | 13 |
| గుంటూరు | 11 | 2 | 1 | — | 2 | 16 |
| నెల్లూరు | 9 | 1 | 1 | — | 2 | 13 |
| చిత్తూరు | 8 | 4 | 1 | — | 2 | 15 |
| కడప | 8 | 4 | — | — | 1 | 13 |
| అనంతపురం | 8 | 1 | 3 | — | 1 | 13 |
| కర్నూలు | 6 | 2 | 7 | — | 1 | 16 |
| మొత్తం | 89 | 28 | 23 | 2 | 16 | 158 |
| **తెలంగాణా** | | | | | | |
| హైద్రాబాద్ | 5 | — | 3 | — | — | 8 |
| వరంగల్ | 4 | 1 | — | 1 | 2 | 8 |
| మెదక్ | 4 | — | 3 | — | 1 | 8 |
| నల్గొండ | 5 | — | 3 | — | 2 | 10 |

| జిల్లాపేరు | 1 వ దశ | 2 వ దశ | సమా. అభి. | బహూముఖ | ప్రీ - ఎక్స్ | మొత్తం |
|---|---|---|---|---|---|---|
| ఖమ్మం | 3 | — | 3 | — | — | 6 |
| మహబూబ్ నగర్ | 8 | — | 1 | — | 2 | 11 |
| కరీంనగర్ | 5 | — | 1 | — | 1 | 7 |
| ఆదిలాబాద్ | 5 | — | 2 | 1 | 2 | 10 |
| నిజామాబాద్ | 2 | 5 | — | — | — | 7 |
| మొత్తం | 41 | 6 | 16 | 2 | 10 | 75 |
| రాష్ట్రం మొత్తం | 130 | 34 | 39 | 4 | 26 | 233 |

పథకంలో రెండే రెండు దశలుండాలని మెహతా బృదం చేసిన సూచనల ననుసరించి, ఒకటవ దశలో విస్తృతాభివృద్ధి దశ. రెండవ మెట్టులో ఆ తరువాతి దశ; జాతీయ విస్తరణ కేంద్రాలూ 1958 ఏప్రిల్ 1 నాటికి అవి ప్రారంభమైన నాటినుండీ ఒకటవదశ బ్లాక్‌గా వర్గీకరింపడ్డాయి. ఆ తరువాతి విస్తృత బ్లాక్‌లన్నీ 1958 ఏప్రిల్ 1 వ నాటికి రెండవదశ బ్లాక్‌గానూ వర్గీకరింప బడ్డాయి. 1958 ఏప్రిల్ 1 వ తేదీకి పూర్వం సమాజాభివృద్ధి కేంద్రాలుగా మారిన బ్లాక్‌లు పునఃరచింపబడ్డ పథకంవల్ల మారవు. ఇకముందుకూడా అవి సమాజాభివృద్ధి బ్లాక్‌లు (సి. డి. బ్లాక్‌లు)గానే వుండిపోతాయి. మూడో సంపత్సర పథకపుకాలం పూర్తయితేగాని ఇవి రెండోదశ క్రిందకురావు.

# ఆంధ్రప్రదేశ్ ఆర్థిక వ్యవస్థలో కుటీర పరిశ్రమల పాత్ర

డాక్టర్ :- ఆర్. వి. రావ్, ఎమ్. ఎ., పి. హెచ్. డి.,
జాయింట్ డైరెక్టర్, కాటేజ్ ఇండస్ట్రీస్, అండ్ ఇండస్ట్రియల్ కో-ఆపరేటివ్స్, ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం.

ఆంధ్రప్రదేశ్ ఆర్థిక వ్యవస్థలో కుటీర పరిశ్రమలు ప్రముఖ పాత్ర వహిస్తున్నాయి. వ్యవసాయమే ప్రధానంగాగల ఆర్థిక వ్యవస్థలో వ్యవసాయకుని తలసరి ఆదాయాన్ని, గ్రామీణ ప్రాంతాలలో తగిన కుటీర పరిశ్రమలను అభివృద్ధి చేయడంద్వారా మాత్రమే పెంచగలం. భూమిమీద ఒత్తిడినీ తగ్గించగలం. వ్యవసాయంలో సాగుదారుడూ, వ్యవసాయ కార్మికుడూ సంవత్సరంలో చాలకాలం పనులులేక గోళ్ళు గిల్లుకుంటూ కూర్చోవాల్సి వస్తూన్న సంగతి స్పష్టమేగదా! వృధాగా పోతున్న ఈ మానవశక్తిని ఉత్పత్తి కార్యక్రమాలలో వినియోగించుకుని, ఉపయోగకరమూ, అందమైన వస్తువుల్ని ఉత్పత్తి చేసేందుకు వారికి తర్ఫీదు యిచ్చినట్లయితే వారు తమ సంపాదనా శక్తినీ, తమ జీవనస్థాయినీ పెంచుకోవడమేగాదు; జాతీయ సంపదను తగినంతగా అభివృద్ధి చేయడానికికూడా దోహదం చేయగలరు.

ఈ పరిస్థితి అనుసరించడంవల్ల గ్రామీణ ప్రాంతాల్లో లభ్యమయ్యే ముడి వస్తువులను దప్పనిసరిగా వినియోగించుకోవడం సాధ్యమవుతుంది. ప్రాథమిక జీవితావసర వస్తువులైన చేనేతబట్ట, సిల్కు-చీరలు, బెల్లం, పంచదార, ఇటుకలు, పెంకులులాంటి గృహనిర్మాణావసరవస్తువులు, కొయ్య, గృహోపకరణాలు, ఆహార పదార్థాలు వగైరా ప్రజలకు అందించాలంటే వీటి ఉత్పత్తిని నెమ్మదిగా అధికం చేయాల్సివుంది.

కుటీర పరిశ్రమలద్వారా గ్రామీణ ఆర్థిక వ్యవస్థను పునర్నిర్మి
చేందుకు పెద్ద ఎత్తున ఉద్యమం ప్రారంభించడం ఎంతైనా అవసర
దీనికితోడు భూసంస్కరణలుకూడా అమలు జరిపితే ఈ సమ
అత్యంత ప్రాధాన్యతగలదిగా ముందుకొస్తుంది. వ్యవసాయంపైన
పూర్తిగా ఆధారపడడాన్ని తగ్గించాలి. బహుముఖ ఆర్థిక వ్యవ
ద్వారా ప్రజల సర్వతోముఖాభివృద్ధికి అవకాశం కల్పించాలి.

## చే నే త ప రి శ్ర మ

చేనేత పరిశ్రమ రాష్ట్రంలోని ప్రధాన కుటీర పరిశ్రమ
రాష్ట్రంలో దాదాపు 5 లక్షల చేనేత మగ్గాలున్నాయి. ఇందులో
శాతం సహకార రంగంలోవున్నాయి. ఆంధ్రప్రదేశ్‌లో తయార
చేనేత గుడ్డకు మంచి పేరూ, గిరాకీ వుంది. ఇందుకు కారణం బ
ఉపయోగంతోపాటు నాణ్యంకలదికూడా. ఈ బట్టకు విదేశా
మార్కెట్టు వుంది. చేనేతబట్ట నమూనాలను అభివృద్ధి చేయడాని
కొత్త కొత్త అమ్మకం కేంద్రాలను తెరవడానికి, వినియయదార్ల అవ
రాలతో సంబంధాలుంచుకోవడానికీ ఎప్పటి కప్పుడు కృషి జరు
తూంది. గుంతకల్లువద్ద ఒక సహకార నూలుమిల్లు పనిచేస్తోం
ఇదిగాక సికింద్రాబాద్‌లో ఒకటి, మరొకటి చీరాలలోనూ ద్వితీ
ప్రణాళిక పూర్తయేలోగా ఏర్పడనున్నాయి. ఈ సందర్భంలో పీవ
చేతిలో వడకిన నూలునే సాధ్యమైనంతవరకు వినియోగించేట
చూడ్డానికి మంచి కృషి జరగాలి.

## ఉ న్ని ప రి శ్ర మ

ఆంధ్రప్రదేశ్‌లో దాదాపు 14 వేల ఉన్ని నేతమగ్గాలున్నా
భారతదేశంలో ఇంకే రాష్ట్రంలోనూ ఇన్ని మగ్గాలులేవు. వీటి
అత్యధికభాగం సహకార రంగంలోనే పనిచేస్తున్నాయి. ముడి ఉ
రాష్ట్రంలోనే ఉత్పత్తి అవుతోంది. ఇక్కడ తయారైన కంబళ్ళ
నీలగిరి, సింహళం వగైరా దేశాలలోకూడా మంచి గిరాకీవుం
ఈ పరిశ్రమాభివృద్ధికిగాను ఒక కేంద్ర (ఎపెక్స్) సంస్థ పనిచేస్తోం

రాష్ట్రంలో ఉన్ని పరిశుభ్రంచేసే పరిశ్రమ ఒకటి చాల అవసరం. ఇందుకై తగిన చర్యలు తీసుకోబడ్డాయి.

## సిల్కు పరిశ్రమ

సిల్కుబట్ట నేసే ప్రధానమైన కేంద్రాలు :- ధర్మవరం; పెద్దాపురం; వెంకటగిరి; ఆరమూర్; సిద్దిపేట; యింకా మరికొన్ని ప్రదేశాలు. ముడిసిల్కుకూడా రాష్ట్రంలోనే ఉత్పత్తి అవుతోంది. గ్రామాలలోని వీవర్లకుగాను సహకార సంఘాలు ఏర్పడ్డాయి.

## తోళ్ళ పరిశ్రమ

తోళ్ళ లేదా చర్మకార పరిశ్రమ చాల ప్రధానమైన లఘు, గ్రామీణ పరిశ్రమల్లో ఒకటి. ఆంధ్రప్రదేశ్‌లో పెద్దఎత్తున తోళ్ళు, చర్మాలూ ఉత్పత్తి అవుతూంటాయి. వీటిల్లో అధికభాగం ఎగుమతి అవుతున్నాయి. చర్మాన్ని ఒలిచే కేంద్రాలతో జతచేసి గ్రామీణ తోళ్ళ పరిశ్రమలను ప్రధాన ప్రాంతాలలో నెలకొల్పుతున్నారు. ముడి సరుకు లభ్యమయే చోటనే వీటిని నెలకొల్పుతున్నారు. ప్రతి గ్రామీణ తోళ్ళ పరిశ్రమ నిర్మాణానికి రు. 1?,500 లు ఖర్చు అవుతుంది. తోళ్ళ కుట్టు యంత్రాలూ, అభివృద్ధిచేసిన పనిముట్లనుకూడా ప్రధాన కేంద్రాలకు సరఫరా చేస్తున్నారు. నిపుణత్వంతో కూడుకున్న (చమ్కీ వగైరా నగిషీలుయిచ్చే) చర్మకార పనికూడా బాగా అభివృద్ధి చెందుతూన్నది. చర్మకార పరిశ్రమాభివృద్ధికి ఆంధ్రప్రదేశ్‌లో అద్భుతమైన అవకాశాలున్నాయి. పైగా ఈ పరిశ్రమ మనకు డాలర్లు సంపాదించిపెడుతోంది.

## పట్టు పరిశ్రమ

పట్టు పరిశ్రమ ప్రస్తుతం ప్రాథమికదశలో వున్నప్పటికీ దాని అభివృద్ధికి మంచి అవకాశాలున్నాయి. ఈపరిశ్రమాభివృద్ధికై ప్రభుత్వం హిందూపు ం ప్రాంతంలో దాదాపు లక్షరూపాయలు ఖర్చుపెడుతోంది. ప్రస్తుతం పామనారువద్దనున్న కేంద్రాన్ని రాష్ట్ర పరిశ్రమల శాఖవారు

పునర్నిర్మించేందుకు అవసరమైన చర్యలు తీసుకుంటున్నారు. రు. 40 వేలు ఖర్చుచేసి ఒక నూలుపంచె (కండి) పరిశ్రమను నెలకొల్పడానికి ప్రయత్నిస్తున్నారు. తృతీయ ప్రణాళికాంతానికి ఒక ఫైలేచర్ ఫ్యాక్టరీనికూడా నెలకొల్పడం సాధ్యమని భావిస్తున్నారు. రొక్కం చెల్లించి పట్టుపురుగు కాయలను ఇప్పుడు కొంటున్నారు.

## బెల్లం: ఖండసారి

గ్రామస్థాయిలో చెరకు బెల్లం, తెల్లపలుకు పంచదార లేదా ఖండసారీ అభివృద్ధికిగాను ఒక పథకాన్ని అఖిలభారత ఖాదీగ్రామీణ పరిశ్రమల మండలి (ఇప్పుడిది కమిషన్‌గా రూపొందింది.) 1955 లో ప్రారంభించింది. ఈ పథకాన్ని భారతప్రభుత్వం అంగీకరించింది. ఈ పథకాన్ని ఆంధ్రలో అమలు పరిచేందుకై కేంద్రప్రభుత్వం 1956-57 రాష్ట్రప్రభుత్వానికి రు. 60 వేలు మంజూరుచేసింది. రాష్ట్రప్రభుత్వం 1955 డిసెంబర్‌లో కేంద్రంనుండి ద్రవ్యసహాయం తీసుకున్నది. అప్పట్లో ఆంధ్రకు చట్టబద్ధమైన ఖాదీమండలి లేదు. అందువల్ల ఈ పథకాన్ని అమలుపరిచే బాధ్యతను రాష్టపరిశ్రమల శాఖకు అప్పగించడం జరిగింది. ప్రస్తుతం రాష్టంలో బెల్లం ఉత్పత్తికేంద్రా లన్నింటిలోనూ ఈ పథకాన్ని అమలుజరిపారు.

ఆంధ్రలో చెరకుక్రిందనున్న మొత్తం భూమి 2లక్షల ఎకరాలు. ప్రస్తుతమున్న చక్కెర ఫ్యాక్టరీలు ఉత్పత్తి అయే చెరకులో 20 శాతం మాత్రమే వాడుకుంటున్నాయి. మిగతా చెరుకంతా బెల్లం ఉత్పత్తి చేయడానికి వినియోగిస్తున్నారు. ఆంధ్రలో ఉత్పత్తి అయె చెరకులో అత్యధికభాగం 19 తాలూకాలలో ఉత్పత్తి అవుతోంది. ఈ పథకానికయే ఖర్చునంతా ఖాదీకమీషనే భరిస్తోంది.

తెలంగాణా ప్రాంతంలో ఈ పథకాన్ని రాష్ట్ర ఖాదీమండలి (హైద్రాబాద్) వారు అమలు జరుపుతున్నారు.

## ఖాదీ గ్రామీణ పరిశ్రమలు

ఖాదీ ఉత్పత్తికి · ఆంధ్రప్రదేశ్ పెట్టింది పేరు, 1921 లో డి. ఐ. సి. దేశమంతటా 20 లక్షల చర్కాలను ప్రవేశపెట్టాలని నిర్ణ

యించారు. ఆ తరువాత ఖాదీ నిర్మాణ కార్యక్రమంలో ప్రధాన అంశంగా అంగీకరింపబడింది.

వాస్తవానికి బహుముఖ, విస్తృతాభివృద్ధి పథకాల ద్వారా ఖాదీని అభివృద్ధి చేసేందుకై 1944లో కృషి జరిగింది. 1955 నుండి ఖాదీ అభివృద్ధి కార్యక్రమాన్ని ఖాదీ కమిషన్ చేపట్టింది, అంబర్ చర్కా కార్యక్రమం నేడు ఆంధ్రజిల్లాల్లో బ్రహ్మాండంగా అభివృద్ధి చెందుతోంది.

హైదరబాద్ ఖాదీ గ్రామీణ పరిశ్రమల మండలిని ఆంధ్రప్రదేశ్ ఖాదీ, గ్రామీణ పరిశ్రమల మండలితో విలీనం చేశారు, అప్పటినుండీ అది చాలమంచి పనులు చేసింది. ఖాద్యతైలాలు కాని నూనెలనుండి సబ్బులు తయారు చేయడం, తేనెటీగల పెంపకం, ఖాదీఉత్పత్తి వగైరా గ్రామీణ పరిశ్రమలను అభివృద్ధి చేసింది. సాగుదార్లకు వ్యవసాయ తరుణం కాని సమయాలలో ఉపఉపాధి సౌకర్యాలను కల్పించి. నిరుద్యోగ సమస్యను పరిష్కరించడానికి ఈగ్రామిణ పరిశ్రమలే తోడ్పడతాయి, రాష్ట్ర మండలులకు నిధులను మంజూరు చేయడంలో ఖాదీ గ్రామీణ పరిశ్రమల కమిషన్ ఉదారంగా వ్యవహరిస్తోంది.

## చేతివృత్తులు

ఆంధ్రప్రదేశ్ చేతివృత్తులకు పేరెన్నిక గన్నది. కరీంనగర్ వెండిపూత వస్తువులు, నిర్మల, కొండపల్లి, తిరుపతికి చెందిన చూడ ముచ్చట గొల్పే ఆటబొమ్మలు, హైద్రాబాద్ బీదర్ సామానులు, వరంగల్, ఏలూరు తివాచిలు, నర్సపూర్ లేసు వస్తువులు, నాణ్యానికీ, మన్నికకు పేరుమోసిన చేనేతవస్త్రాలూ, ఆంధ్రప్రదేశ్ చేతివృత్తి పనిముట్లలో ఎన్న దగినవి. వీటికి ప్రపంచమంతటా పేరు వచ్చింది. ఇప్పటికీ విదేశాలలో వాటి గిరాకీ తగ్గలేదు.

వ్యాసంముగిస్తూ ఈసందర్భంలో ఒక్క విషయాన్ని చెప్పాలి: ఆంధ్రప్రదేశ్‌లో కుటీర పరిశ్రమల అభివృద్ధికి అనంతావకాశాలున్నాయి. వాటిని సహకార పద్ధతిపై నిర్మించి, అప్పులిచ్చి అభివృద్ధి చేసేందుకు రాష్ట్ర పరిశ్రమల శాఖ అవసరమైన చర్యలు తీసుకుంటోంది. సమస్యలా చాలపెద్దవి, పోతే కావాల్సిందేమిటి? సమన్వయ

పూర్వకమైన కృషి. సమాజాభివృద్ధి కేంద్రాలలో కూడా కుటీర పరిశ్రమల అభివృద్ధికై అవసరమైన చర్యలు తీసుకోబడు తున్నాయి. మన అవసరాలు చాలా పెద్దవి. వనర్లు తక్కువ. అయితే కుటీర పరిశ్రమలకు తక్కువ పెట్టుబడి చాలు. రంగు తిరగడానికి కొద్దిపాటి ఖర్చు చాలును. ఈ పరిశ్రమాభివృద్ధికి సాంకేతిక పరిజ్ఞానం కూడా పెద్దగా అవసరం లేదు. ఈనాడు స్థానికంగా లభ్యమయ్యే ముడి పదార్థాలలో చాలాభాగం కేవలం వృధా అవుతున్నాయి.

అందువల్లనే కుటీరపరిశ్రమలను అభివృద్ధిచేసి, గ్రామీణప్రాంతాలలో నవజీవనాన్ని తొణకిసలాడించి, వికేంద్రీకృత ఆర్థిక వ్యవస్థకు మార్గాన్ని సుగమం చేసేందుకు చర్యలు తీసుకోవడం తెలివైన పని అవుతుంది.

# గ్రామీణ ప్రాంతాలలో వ్యవసాయశాఖ పాత్ర

(వ్యవసాయశాఖ డైరక్టర్ - ఆంధ్రప్రదేశ్)

వ్యవసాయశాఖ విస్తరణ కార్యక్రమాలను రూపొందించేందుకు పరిశోధనావకాశాలను చూచుకోవడం ప్రాధమిక అవసరం. ఆంధ్ర ప్రదేశ్‌లో, దాదాపు అన్ని జిల్లాలకూ కలపి, మొత్తం 58 పరిశోధనా కేంద్రాలూ, సంస్థలూ ఉన్నాయి. ధాన్యం, నూనె విత్తనాలు, పప్పు ధాన్యాలు, జొన్న, చెరకు, ప్రత్తి, పండ్లు, కాయగూరలు వగైరాలకు తగిన రకాలను సృష్టించేందుకుమాత్రమే పరిశోధనా కార్యక్రమం పరిమితమై వుండదు, భూసారం, ఎరువులు, క్రిమి సంహారక మందులు చెట్ల తెగుళ్ళ నివారణ మందులు వగైరా వాటిపైకూడా పరిశోధనలు సాగుతాయి.

పరిశోధనా కేంద్రాలలో వ్యవసాయ సమస్యలపై జరిగిన పరిశోధనలను, సాధించిన విజయాలనుగూర్చి వ్యవసాయశాఖ విస్తరణ కేంద్రాలద్వారా సాగుదార్లకు ప్రచారంచేయ బడుతుంది. డిపార్టుమెంటల్ సిబ్బందిలో దాదాపు మూడింట రెండు వంతులమంది విస్తరణ కార్యక్రమంక్రింద జరిగే కార్యకలాపాలలో పాల్గొంటారు. ఈ కార్యక్రమం ఆంధ్రప్రదేశ్‌లోని 20 జిల్లాలలోనూ అమలు జరుగుతూంటుంది. గ్రామాలలో వ్యవసాయ కార్యక్రమపుపని గ్రామ కార్యకర్తలు, ఫీల్డు కార్యకర్తలు, డిమాన్‌స్ట్రేటర్ మెజిస్ట్రేటులు, లేదా కాంమ్గార్ల సహాయంతో అమలు జరుగుతూ వుంటుంది. జిల్లాలో పనికి వ్యవసాయశాఖకు చెందిన 7 గురు ప్రాంతీయ డిప్యూటీ డైరక్టర్లు అజమాయిషీ వహిస్తారు. వీరి కేంద్ర కార్యాలయాలు విశాఖ, ఏలూరు, గుంటూరు, కడప, వరంగల్ హైద్రాబాద్, నిజామాబాద్‌లలో

వుంటాయి. ప్రతి డిప్యూటీ డైరెక్టరూ రెండు, మూడు జిల్లాలలోని ప్రాంతాలను చూస్తాడు.

వ్యవసాయ శాస్త్రానికి చెందిన సిద్ధాంత, ఆచరణపూర్వకమైన పరిజ్ఞానాన్ని అభివృద్ధి చేసేందుకై ఆంధ్రప్రదేశ్‌లోని బాపట్ల, హైద్రాబాద్, వ్యవసాయ కళాశాలలకు "వ్యవసాయ క్షేత్రాలను" అనుబంధంగా ఏర్పరిచారు. డిగ్రీకోర్సులకు ఏర్పడ్డ ఈ కళాశాలతోపాటు, వ్యవసాయ శాఖవారు రాజేంద్రనగర్ తదితర సంస్థలలో వ్యవసాయదారునికి శిక్షణా తరగతులుకూడా నడుపుతున్నారు. ఆయిల్ యింజన్లు, తోటల పెంపకం పనులలో వ్యవసాయదార్ల బిడ్డలకు తరిఫీదు యిచ్చేందుకై శిక్షణావకాశాల్ని కల్పించారు. వారికి నెలకు రు. 20 నుండి రు. 30 వరకూ స్టైపెండుకూడా యిస్తారు.

చైతన్యవంతులైన సాగుదార్లలో శాస్త్రీయమైన వ్యవసాయ పద్ధతులనూ, ఆధునిక వ్యవసాయ పనిముట్లను గూర్చిన విజ్ఞానాన్ని ప్రచారం చేసేందుకై రాష్ట్ర వ్యవసాయ శాఖవారు తెలుగులో కరపత్రాలు, పుస్తకాలు, మొదలైన వివిధ ప్రచురణలనూ, గ్రామీణుల గైడ్ క్యాలండర్, "పాడి పంటలు" అనే మాసపత్రికనూ ప్రచురిస్తున్నారు. వివిధ వ్యవసాయాభివృద్ధి పనులను ప్రదర్శనలు, రేడియో ప్రసారాలు, చిత్రాలద్వారా సాగుదార్లకు తెలియజేస్తున్నారు.

వ్యవసాయ శాఖవారు అనేక పంటలకు సంబంధించిన అనేక అభివృద్ధికరమైన కొత్త విత్తనాలను కనిపెట్టారు, ఈ కొత్త పంటలవల్ల, సాధారణంగా రైతులు సాగుచేసే స్థానిక విత్తనాల కన్నా కనీసం 10 నుండి 15 శాతం పంటైనా ఎక్కువ పండుతుంది. ఈ కొత్తరకం విత్తనాలను నిల్వపోసేందుకై ప్రతీ బ్లాక్‌కు ఒక కేంద్రంలో విత్తనాల గిడ్డంగుల్ని నిర్మిస్తున్నారు. ధాన్యం, జొన్న, ప్రత్తి, వేరుశెనగ, ఆముదము వగైరాలకు చెందిన మేలురకం విత్తనాలను రైతులు తమకు కావలసినంత మేరకు ప్రధాన కేంద్రాలలో ఏర్పాటు చేయబడ్డ వ్యవసాయశాఖ గిడ్డంగులద్వారా పొందవచ్చును.

వ్యవసాయశాఖవారి నిరంతరకృషి. రాష్ట్రంలోని వ్యవసాయదార్లు ఎరువుల వాడకాన్ని బాగా గుర్తించేటట్లు చేయడంలో ఫలిం

చింది. అనేక రకాల ఎరువులు, రసాయన ఎరువులు కావాలన్న డిమాండ్ ఏడాది కేడాదికీ పెరుగుతోంది. ప్రస్తుతం కేంద్రప్రభుత్వం మనకు కేటాయించే ఎరువులకోటా ఆంధ్రప్రదేశ్ అవసరాలలో సగపాలన్నా తీర్చలేకుండా వుంది. ఆంధ్రప్రాంతంలో నత్రజని ఎరువులు 1 లక్ష 51 వేల టన్నులు, తెలంగాణాలో 52 వేల 350 టన్నుల ఎరువులూ పంచాలనీ కోటా నిర్ణయించారు. రసాయన ఎరువులను రొక్కంమీదా, ఋణంమీదాకూడా సాగుదార్లకు పంచుతున్నారు.

ఆకుపచ్చ ఎరువు చాల చవుక. వరికి మంచి ఎరువుకూడాను. ఇర్రిగేషన్ సౌకర్యా లున్నచోట ఆ పద్ధతి మంచిదని సిఫార్సు చేయబడింది. సన్‌కెంప్ డైన్‌ఛా, సెస్బేనియా పిల్లిపెసరా మున్నగునవి బాగా వాడకంలోవున్న ఎరువులు. తగిన రకాలకు చెందిన పచ్చఎరువు విత్తనాలను వ్యవసాయశాఖ డిపోలలో అమ్ముతారు. ముందుగా పచ్చఎరువు పంట పండించడానికి ఎక్కడ తగిన సౌకర్యా లుండవో, అక్కడకు దగ్గరలోవుండే అడవులనుండి పచ్చాకు తెచ్చి పొలంలో చల్లమని రైతులకు సలహా యివ్వాలి.

8 నయాపైసలు ఖరీదుచేసే 4 ఔన్సుల పాకెట్లలో పచ్చ ఎరువు విత్తనాలను పంపిణీ చేసే పథకం అమలులోవుంది. వరిచేల గట్లపైన ఎక్కువ వైశాల్యంలో పచ్చ ఎరువు చెట్లను బాగా పెంచేందుకై ఈ పథకం ఉద్దేశింపబడ్డది. ఫలితంగా రైతులు తమకు అవసరమైన పచ్చ ఎరువు విత్తనాలను తామే ఉత్పత్తి చేసుకోగలుగుతారు, తద్వారా ఈ రకపు విత్తనాల విషయంలో వారు స్వయంపోషకత్వాన్ని సాధించగలరు.

ప్రస్తుత ఎరువుల ఉత్పత్తిస్థాయిని పెంచే ఉద్దేశంతోనే, కేంద్ర ప్రభుత్వం గ్రామాలలోనే ఎరువులను ఉత్పత్తికై స్థానిక వనర్లను పెద్ద ఎత్తున చాకచక్యంతో వినియోగించేందుకుగాను ఒక పథకాన్ని రూపొందించింది. ప్రస్తుతం పెద్ద పశువు తల ఒక్కింటికి ఒక టన్ను ఎరువు గ్రామాలలో లభ్యమయ్యే స్థానిక వనర్లనుండి ఉత్పత్తి అవుతోందని అంచనా వేశారు. ఈ ఉత్పత్తిని పెద్దపశువు తల ఒక్కింటికి రెండు

టన్నులకు పెంచాలనీ, అదేసమయంలో నత్రజని పాళ్ళను 0.5 శాతం నుండి 1.0 శాతానికి పెంచడంద్వారా మేలురకం ఎరువులను అభివృద్ధి చేయడమే ఈ పథకంయొక్క లక్ష్యం. సమాజాభివృద్ధి, జాతీయ విస్తరణ బ్లాక్‌ల క్రిందనున్న గ్రామాలనుండి 100 మంది వ్యవసాయ దార్లను ఎన్నుకుంటారు. ప్రతి జిల్లాలోనూ వీరికి ఒక వారం రోజుల పాటు కంపోస్ట్ (ఎరువుల) ఇన్‌స్పెక్టర్లు శిక్షణ యిస్తారు.

పెరిగిపోతున్న అవసరాలకు సరిపడా తగినంత పశువుల ఎరువు లభ్యం కానందున గ్రామీణ, పట్టణ ప్రాంతాలలోని కంపోస్టు ఉత్పత్తి అధికం చేయడానికి వ్యవసాయశాఖ గట్టి చర్యలు తీసుకొంటోంది. గ్రామాల్లోని కంపోస్టు, ఎరువు - కలుపుమొక్కలు, గొడ్లచెత్త, చెట్ల నుండి రాలే ఆకూ అలమూ, దుబ్బు, ఆకులు, వగైరా సేంద్రియ పదార్థాలను, గొడ్డపెంటను నీటితో తొక్కించి, బాగా కుళ్ళపెట్టిన తరువాత తయారయ్యే ఎరువు, ఇందుకుగాను, తగుమాత్రపు కొలతలతో 3 అడుగులలోతున గుంటలు త్రవ్వుతారు. పొరలుపొరలుగా ఈ సేంద్రియ పదార్థాన్ని (Oraganic matter) 9 అంగుళాల ఎత్తు వరకు ఒకే రీతిగా వెదజల్లుతారు. ప్రతీ పొరపైనా గొడ్డపేడను, నీటిని జల్లుతారు. ఒకపొర బూడిదకూడా వేయొచ్చు ఈ పద్ధతి భూమి ఉపరి తలానికి ఒక అడుగు ఎత్తువరకూ గుంట నిండేంతవరకూ సాగు తూండాలి. దానిపై 2 అంగుళాల పొరను మట్టితో కప్పివేయాలి. దీనిని నాలుగైదు మాసాల తరువాత తీస్తే, అప్పుడది పొలాలకు బాగా పనికి వస్తుంది. పట్టణాల్లో వీధుల్లో వుండే చెత్త చెదారంతో, రాత్రుళ్ళప్పటి మల మూత్రాదులతోకూడుకున్న మట్టితోనూ మున్సిపాలిటీలు కంపోస్టు తయారు చేయడాన్ని ప్రోత్సహించవచ్చు. మున్సిపాలిటీలూ, పంచాయ తీలు కంపోస్టు ఎరువును పాటకైనా పెట్టవచ్చు, లేదా ఇంత ధర అని అయినా నిర్ణయించి రైతులకు అమ్మవచ్చు.

యంత్రాలద్వారా భూమిని సాగులోనికి తెచ్చేపద్ధతి బాగా ప్రచారంలోకి వస్తోంది. ఇందుకై వ్యవసాయ శాఖకొక వ్యవసాయ యింజనీరింగ్ ఉపశాఖ ఏర్పడింది. ఇది అవసరమైన సలహాలు

ఇస్తుంది. వ్యవసాయ శాఖవద్దకూడా అనేక ట్రాక్టర్లూ, బుల్ డ్రోజర్లు వుంటాయి. లోతుదుక్కికి, భూమిని చదును చేసేందుకు, అడవుల్ని నరికి వేయడానికి వీటిని అద్దెకు యిస్తారు. ట్రాక్టర్లనూ, బుల్ డ్రోజర్లనూ వాటి యంత్రాల అశ్వశక్తి (హార్స్‌పవర్)పై ఆధారపడి అద్దెకు యిస్తారు. అలాగే ఆయిల్ యింజను పంపుసెట్లనుకూడా డ్రైవర్లతో సహా అద్దెకు సప్లయి చేస్తారు. ఇవిగాక, గొట్టపుబావుల త్రవ్వకానికి బోరింగ్ సెట్లనుకూడా సప్లయి చేస్తారు.

అన్నింటికంటే భూమి ఉపరితలంపైనున్న పొర చాల ముఖ్యమైన భాగం. ఎందుచేతనంటే అందులోనే ఎక్కువ పోషక పదార్థాలుంటాయి. అందుచేతనే అటువంటి భూమి గనుక ఏ వరదలకో, ఉప్పెనలకో కొట్టుకుపోతే పంట ఉత్పత్తికి పెద్ద ప్రతిబంధకమన్నమాట. కాబట్టే, అటువంటి ఉపరితలపు పొరలు లేచిపోకుండా కాపాడుకోడానికి సర్వ చర్యలూ తీసుకోవాలి. ఈ చర్యలన్నింటినీ కలిపి "భూసార సంరక్షణ" అంటారు. ఈ విధంగా భూసార సంరక్షణ అనేది జాతీయ నిర్మాణ కార్యక్రమంలో ఒక ముఖ్యమైన భాగం. ఏమంటే అది వర్షపు ప్రాంతాలలో పంట రాలుబడిని పెంచడమేకాదు ముందుతరాల వారికికూడా భూమిని రక్షించి పెడుతుంది. భూసార సంరక్షణకోసం వినియోగించే వివిధరకాల పద్ధతులు: పంట మార్పిడి; క్రాద్దికాద్ది మళ్ళల్లో పంట వేయడం, వలయాకారంలో కట్టలుపోయడం వగైరా

రాష్ట్రంలోని వివిధ జిల్లాలలో వ్యవసాయ శాఖవారు ఈ భూసార సంరక్షణ చర్యలను పరీక్షించి చూచారు. రాష్ట్రంలోని కరకట్టలను పోసిన ప్రాంతాలనూ యితరచోట్ల చేసిన ప్రయోగాలవల్ల, కరకట్టలు పోయడంవల్లనే కరకట్టలులేని ప్రాంతాలమీద 20 శాతం అదనంగా పంట పండిందని తేలింది. అప్పుడీ పద్ధతిని మెట్టసాగు పద్ధతులైన - సీజనులో నాట్లు, ఎరువులు, వగైరా పద్ధతులతో జత పరిస్తే, తక్కువ వర్షపాతం వున్న ప్రాంతాలలో పంట రాలుబడిని తగినంతగా పెంచవచ్చు.

అనంతపూర్, కర్నూలు, విశాఖ జిల్లాలలోనూ తెలంగాణా ప్రాంతం అంతటా ఈ వరద కరకట్టలు, తదితర భూసార సంరక్షణ చర్యలను వ్యవసాయశాఖ చేపట్టింది. కరకట్టల నిర్మాణాని కయ్యే ఖర్చును సాగుదార్ల నుండే తేలిక వాయిదాలలో వసూలు చేస్తారు.

## చిన్నతరహా నీటిసాగు
## (మైనర్ ఇర్రిగేషన్)

ఆహారోత్పత్తిని అధికం చేయడంలో మైనర్ ఇర్రిగేషన్ ప్రాధాన్యతను తక్కువ అంచనా వేయరాదు. పెద్దపెద్ద ప్రాజెక్టులద్వారా పెద్దపెద్ద కేంద్రాలను ఇర్రిగేషన్ క్రిందకు తీసుకురావాల్సివున్నా, వ్యవసాయదారునకు సాయం చేయడంలోనో తన పటలకు తగిన నీటి సౌకర్యాలు అందించడంలోనూ మైనర్ ఇర్రిగేషన్ పథకాలుకూడా ప్రధాన పాత్రవహిస్తాయి.

చెర్వులు, కుంటలు బాగుచేతలకు చెందిన పథకాలు, ఆయిల్ యింజను పంపుసెట్లు, ఎలక్ట్రిక్ మోటార్లు కొనడానికి రుణాలమంజూరు చేయడం, బావుల త్రవ్వకం వాటి బాగుచేతలు, ఫిల్టర్ పాయింట్లు వగైరా త్రవ్వకాలకు సంబంధించిన పథకాలన్నీ మైనర్ ఇర్రిగేషన్ పథకాల క్రిందనే వస్తాయి. వీటిని వ్యవసాయశాఖ చూస్తుంది. ఈ శాఖ ఆయిల్ యింజన్లను, ఎలక్ట్రిక్ (విద్యుచ్ఛక్తితో నడిచే) మోటార్లను ఆంధ్ర ప్రాంతంలో అయితే అద్దె - కొనుగోలు పద్ధతిపైన, తెలంగాణా ప్రాంతంలో అయితే తక్కావీ పద్ధతిపైన సప్లయిచేస్తుంది. ఆంధ్ర ప్రాంతంతో అయిల్ ఇంజన్లు విషయంలో ఒకొక్కరికి రు. 4,000 ల గరిష్ట మొత్తాన్ని మంజూరుచేస్తారు. ఎలక్ట్రిక్ మోటార్ల విషయంలో రు. 2,000 ల గరిష్ఠ మొత్తంవరకూ మంజూరు చేస్తారు. ఈ మొత్తాన్ని ఆయిల్ ఇంజన్లు విషయంలో 7 వాయిదాలపైన మోటార్ల విషయంలో 5 వాయిదాలపైన చెల్లించుకోవచ్చు. తెలంగాణా ప్రాంతంలో ఆయిల్ యింజన్లు కొనుక్కోడానికి తక్కావీ అప్పులపై రు. 2,000ల వరకూ గరిష్ట మొత్తాన్ని మంజూరుచేస్తారు. ఈ మొత్తాన్ని 8 అర్ధసంవత్సర వాయిదాలలో చెల్లించుకోవచ్చు.

ఆహార పంటల క్రిందనున్న భూమి విస్తీర్ణం ఎక్కువచేయ డానికి బావి ఒక్కింటికి రు. 2,500 ల గరిష్ట మొత్తం మేరకు రైతులకు కొత్త బావులను త్రవ్వకోడానికి, పాతబావులను బాగుచేసుకోడానికి రు. 7 0 లనూ తక్కావీ రుణాలు యిస్తారు. ఈ రుణాలను 6¼ శాతం వడ్డీతోసహా 10 అర్ధసంవత్సర వాయిదాలలో తిరిగి చెల్లించవచ్చు. మంజూరైన అప్పు పూర్తిగా చెల్లింపబడేవరకూ అటువంటి బావుల లోని నీటిని వినియోగించుకుంటూ సాగుదార్లు ఆహారపంటలను మాత్రమే పండిస్తూ వుండాలి.

ఫిల్టర్‌పాయింట్ 6 అడుగులు పొడవుగల బెజ్జపు గొట్టాం. ఇది వలాకారంలో వుండే వైరుతో కప్పబడి వుంటుంది. పోత యినుప ముక్కోణాకారపు పాయింట్ అమర్చబడి వుంటుంది. సముద్రపు ఆటు పోటులకు గురయే పీఠభూములనూ. నదీ గర్భాలలోనూ దీనిని వినియో గిస్తారు, దీని సహాయంతో బాగా లోతట్టునవుండే నీటిని భూమి ఉపరి తలం పైకి తోడవచ్చును. ఫిల్టర్‌పాయింట్ పంపుసెట్టు, ఖరీదుతో కలుపుకుని ఒక్కొక్కదానికి రు. 2500 ల చొప్పున అప్పులను మంజూరుచేస్తూ వ్యవసాయశాఖ ఫిల్టర్‌పాయింట్ల త్రవ్వకాలను ప్రోత్స హిస్తోంది. ఈ మొత్తాన్ని 5 సమానవాయిదాలలో తిరిగి చెల్లించవచ్చు.

## అభివృద్ధి చెందిన వ్యవసాయ పద్ధతులు

జపాన్ వరిసాగు పద్ధతి అనేది ఒకటి అమలులోవుంది. ఇది డిపార్టుమెంటు సూచించినట్లు - మేలురకం విత్తనాలు, తగిన ఎరువులు వగైరాలను వరుస క్రమంలో నాట్లు వేయడం వగైరా అభివృద్ధిచెందిన పద్ధతులతో కలిపి ఉపయోగించడం. ఈ జపాన్ వరిసాగు పద్ధతిని మన రాష్ట్రంలో మొట్టమొదటిసారిగా 1952 - '53 లో ప్రయోగించి చూశారు. ఫలితంగా అధికపంటలు పండినందువల్ల ఈపద్ధతిని యింకా ఎక్కువ ప్రచారంలోకి తేవడానికి వ్యవసాయశాఖ 1953-'54 నుండి ప్రత్యేక కృషిచేసింది. అప్పటినుండీ ఈ పద్ధతి నెమ్మదిగా ప్రసిద్ధిలోకి వచ్చింది. నానాటికి ఎక్కువమంది వ్యవసాయదార్లు ఈ పద్ధతిని వాడు తున్నారు. జపాన్ వరిసాగుపద్ధతిలో కలుపుతీత యంత్రం వాడడంవల్ల

చాల శ్రమతప్పుతుంది. మామూలుకన్న ముందుగానే దుక్కులు సాగుతాయి. అందువల్లనే దీనిని పరిపంప్రాంతాలన్నిటికీ సిఫార్సుచేశారు. ఈ పనిముట్టును వ్యవసాయశాఖ గిడ్డంగులద్వారాఅమ్ముతారు. ప్రదర్శనకు పెట్టాలన్నా ఈ పనిముట్టు దొరుకుతుంది. అద్దెకూ యిస్తారు. 195~-53 సంవత్సరంలో 8 లక్షల 65 వేల 441 ఎకరాలలో జపాన్ వరిసాగు పద్ధతిని ప్రవేశపెట్టారు, 1958-59 లో 12 లక్షల 38 వేల ఎకరాలను ఈసాగుక్రిందకుతెచ్చారు. 1959-60 సంవత్సరంలో 17 లక్షల 50 వేల ఎకరాలలో ఈపద్ధతి అమలులోకి రానున్నదని అంచనా.

వ్యవసాయం సక్రమ పద్ధతుల్లో విజయవంతంగావడానికి ఇతర విషయాలతోపాటు పంటలు తెగుళ్ళపాలుగాకుండా రక్షించుకోడానికి తీసుకునే ఈ చర్యలపై ఎక్కువ ఆధారపడుతుంది. ఇందుకోసమై వ్యవసాయోత్పత్తిని ఎక్కువచేసే ఉద్దేశంతో చేసే ప్రతి ప్రయత్నమూ పైరెండు అంశాలవల్ల కలిగే నష్టాన్ని రూపుమాపేందుకు యత్నించాలి, ఎందుచేతనంటే ఆ విధంగా దక్కే పంట ఉత్పత్తి కానున్న ఆహారానికి మరింత దోహదం చేసినట్లవుతుందన్నమాట. మొక్కల రక్షణకై తీసుకొనే చర్యలకు సాగుదార్లు బాగా అలవాటు పడుతున్నారు.

ప్రస్తుతం రాష్ట్రంలో వ్యవసాయ శాఖకు చెందిన డిపోలూ, గిడ్డంగులు పలు ప్రాంతాల్లో బాగా వ్యాప్తిలో వున్నాయి. వీటిల్లో తగినన్ని క్రిమిసంహారకమందు నిల్వలువున్నాయి. సాగుదార్లకు కావాల్సిన చీడపురుగు, తెగుళ్ళ నివారణ మందులను ఈ డిపోలలో అమ్ముతారు. ఈ మందులను పరికరాలను, కొనుక్కోడానికి తక్కావీ రుణ సౌకర్యాలుకూడా ఏర్పాటైనాయి.

ప్రస్తుత దశలో ఈ మందులను కరీఫ్, రాబీ (రెండు) పంట కాలంలో 50 శాతం సబ్సిడీ రేట్లకు రైతులకు అమ్ముతున్నారు,

కంట్రోలు చర్యలు పగడ్బందీగా వుండాలి. పొదుపరితనం అవసరం. ఇందుకుగాను ఆచరణలో సరైనపద్ధతి అనుసరించటంఅవసరం. అవసరమైన రసాయన పదార్థలను చేలల్లో వినియోగించడానికి మందు చల్లె పనిముట్లను, డస్టర్లనూ ఉపయోగించినప్పుడే ఇది సాధ్యం.

చేతితో కొట్టె మందు జల్లడా లేదా డస్టర్‌ను కొనుక్కోవలంటే మామూలు రైతు ఆర్థిక పరిస్థితి అందుకు తగినదిగా లేదు. అందువల్ల వ్యవసాయ శాఖవారు డిపార్టుమెంటల్ డిపోలలోనే ఎక్కువ సంఖ్యలో చేతిమందు జల్లిడలను, డస్టర్లనూ వుంచుతున్నారు. ఎప్పుడు అవసరమైతే అప్పుడు వ్యవసాయదార్లు వీటిని వినియోగించుకోవచ్చు. ఆంధ్ర ప్రాంతంలో మొక్కల తెగుళ్ళనివారణ యంత్రాలకై డిమాండ్ జాస్తిగా వుంది, సరైన ప్రాతిపదికపై వీటి సరఫరాను నియమబద్ధం చేయాలంటే ఒక పద్ధతి వుంది. ఈపద్ధతి ప్రకారం, యంత్రాలను లేదా పనిముట్లను మామూలు రేట్లకు అద్దెకు తీసుకోవచ్చు. పోతే తెలంగాణా ప్రాంతాల్లో మాత్రం ఈ పరికరాలను ఉచితంగా అద్దెకిస్తారు.

సాగుదార్లు స్వంత తెగుళ్ళనివారణ పనిముట్లు కలిగి వుండేం దుకై వారికి సహాయం చేసే వుద్దేశ్యంతో చేతిజల్లిడలు, డస్టర్లు కొనుక్కో డానికి తక్కావీ రుణాలు యిస్తారు. అయిదెకరాలు అంతకన్న మించి వున్న ప్రతీ కుటుంబానికి ఒకచేతి మందు జల్లెడ వుండడం అవసరం. తెగుళ్ళనివారణ కార్యక్రమం సందర్భంలో మందులు పగడ్బందిగా వినియోగించేందుకై సాగుదార్లకు అద్దెకు విద్యుచ్ఛక్తితో నడచే స్ప్రేయర్లనూ, డస్టర్లనూకూడా సప్లయి చేస్తారు.

తెగుళ్ళ చీడను పూర్తిగా నిర్మూలించే వుద్దేశంతో వ్యవశాయ శాఖ వాలుగు సంచారవాన్ల [Mobile vans]ను తయారు చేయించ డానికి ఏర్పాటు చేసింది. ఈవ్యాన్లకు పవరు స్ప్రేయరు చేతితో ఉపయో గించే స్ప్రేయర్లు (జల్లెడ), డస్టర్లూ, మామూలు వాడకంలో వున్న తెగళ్ళ మందు పనిముట్లూ అమర్చబడి వుంటాయి. స్వల్ప కాలంలోనే ఈ సంచార వాన్లు తెగళ్ళు లేదా చీడపట్టిన పొలాల వద్దకు హూటాహూటిని వెళ్ళి, మొక్కలకు పట్టిన రోగాలను సమర్థవంతంగా కంట్రోలు చేయ గల స్థితిలో వుంటాయి. అటువంటి వాన్లు ప్రస్తుతం కాకినాడ, బాపట్ల, కడప, హైద్రాబాద్‌లలో వున్నాయి. మొక్కలకు పట్టిన తెగుళ్ళ నివా రించే కార్యక్రమాన్ని ఇవిత్వరగా నెరవేరుస్తాయి. తెగుళ్ళ సీజనులో అవ సరమైన గ్రామాలకు వెళ్ళి అక్కడి రైతాంగానికి సహాయ పడేందుకై

ఇవి మందులూ, పరికరాలూ, నిపుణులైన ఉద్యోగులనూ వెంట తీసు కెళ్తాయి. ప్రతి వానూ అనుభవంగల మొక్కల సంరక్షణ అసిస్టెంట్ ఉద్యోగి ఆధిపత్యం క్రింద వుంటుంది. గ్రామీణులు తాలుకా డిపోలకు వెళ్ళకుండానే గ్రామ ప్రాంతాలలో తిరిగే ఆ సంచారవాన్ల వద్దనే మామూలు ఖరీదుకు తెగళ్ళ నివారణ మందులను కొనుక్కోవచ్చు.

## అప్పులు

సాగుదార్లకు ద్రవ్య సహాయంచేసే నిమిత్తం వ్యవసాయ శాఖ రుణాలు మంజూరు చేస్తుంది.

ఈ క్రింది పనులకుగాను వ్యవసాయశాఖ తక్కావీ రుణాలు మంజూరు చేస్తుంది.

(1) విత్తనాలు, ఎరువులు రు. 120 లకు లేదా కిస్తీకి 15 రెట్లుకు మించకుండా కొన్నుక్కునేందుకూ, (2) వ్యవసాయ పనిముట్లను కొనుక్కునేందుకు రు. 100 లేదా కిస్తీకి 6 రెట్లు మించకుండా గరిష్ట మొత్తాన్ని అప్పుగా మంజూరు చేస్తారు. ఈరుణాలపై వడ్డీ 5½ శాతం. ఈ మొత్తాలు ఒక్క సాంవత్సరిక వాయిదా పైన తిరిగి చెల్లించాలి.

స్వల్పకాలిక రుణాలను కూడా వ్యవసాయశాఖ వ్యవసాయ దార్లకు మంజూరు చేస్తుంది, ఈ రుణాలు ధాన్యపుపంటకు లేదా జొన్న పంటకైతే ఎకరానికి రు. 35 లు, పండ్లతోట, లేదా కాయగూరల పెంప కానికైతే ఎకరాకు రు. 70 లు, చెరకు తోటలకైతే రు. 100 లు, వ్యక్తులకైతే రు. 500 లు గరిష్ట మొత్తాన్ని రుణంగా మంజూరుచేస్తారు. ఈ మొత్తాలను ఏడాది 4½ శాతం వడ్డీచొప్పున ఒక్కవాయిదాలోనే చెల్లిం చాలి. రసాయన ఎరువులుకొన్నప్పుడు మాత్రమే ఈరుణాలను రైతులు వస్తురూపంలో చెల్లించవచ్చు.

రాష్ట్రంలో పండ్లఉత్పత్తిని పెంచేందుకై వ్యవసాయశాఖ కొత్త తోటలను వేసేందుకు గాను సాగుదార్లకు దీర్ఘకాలిక రుణాలను కూడా మంజూరు చేస్తోంది. నిమ్మతోటల విషయంలో ఎకరానికి రు. 300 లు మొదలుకొని రు. 3,000 ల వరకూ మంజూరు చేస్తారు. మిగతా పండ్ల పంటకుమాత్రం ఎకరానికి రు. 150ల నుండి రు. 1,500ల గరిష్ఠ

మొత్తం వరకూ మంజూరు చేస్తారు. ఈ రుణాలను పంపిణీ చేసిన ఆర్థ సంవత్సరం లగాయతూ 10 సాంవత్సరిక వాయిదాలలో వడ్డీతో సహా చెల్లించాలి. ప్రస్తుతమున్న తోటలను పునర్నిర్మించేందుకుగాను డిపార్టుమెంటువారు ఎకరానికి రు. 250 నుండి రు. 450 వరకూ స్వల్పకాలిక రుణాలను మంజూరు చేస్తారు. ఈ మొత్తాన్ని వడ్డీతోసహా 18 మాసాలలో చెల్లించవచ్చు. రాష్ట్రంలో జీడిపప్పు ఉత్పత్తిని పెంచేందుకై వేరే ఒక పథకంకూడా వుంది. దీని ప్రకారం, ఈ పంట అభివృద్ధికై ఎకరానికి రు. 100 లు మంజూరు చేస్తారు.

## వ్యవసాయ మార్కెట్లు

మధ్యదళారీలను తొలగించి కొనుగోలుదార్లతో రైతులకు ప్రత్యక్ష సంబంధాలు ఏర్పాటుచేసే ఉద్దేశంతో వ్యవసాయశాఖవారు ఇంత వరకూ తెలంగాణాలో 40 వ్యక్తిగత మార్కెట్ కేంద్రాలుఏర్పర్చారు. ఆంధ్రప్రాంతంలో నెల్లూరు మినహా మిగతా చోట్ల ప్రతిఒక్క జిల్లాకు పదేసి మార్కెట్టు కమిటీలు ఏర్పడ్డాయి. ప్రతి కమిటీకి మొత్తం జిల్లా అంతటపైన అధికారం వుంటుంది.

## పంచాయతీ సమితులు

రాష్ట్రంలో ఇటీవల కాలంలోనే పంచాయతీ సమితుల, జిల్లా పరిషత్తుల చట్టాన్ని ప్రవేశ పెట్టారు. దీనితో ఇంతవరకూ వ్యవసాయ శాఖ నిర్వహిస్తూ వచ్చిన కొన్ని అధికారాలు, విధులూ చట్టబద్ధ సంస్థలుగా ఏర్పడ్డ పంచాయతీ సమితులకు బదలాయింపబడ్డాయి. మేలురకం విత్తనాలను ఎక్కువ తయారుచేసి పంచటం, మొక్కల సంరక్షణ రుణాలు, ఎరువు పంపకము మొదలైన ప్రధాన విధులను వ్యవసాయశాఖ సమితులకు బదలాయిస్తోంది.

# ఆంధ్రప్రదేశ్

## ముఖ్య విశేషాలు

భారతదేశంలో పునర్వ్యవస్థీకరింపబడ్డ రాష్ట్రాలలోకల్లా ఆంధ్రప్రదేశ్ అయిదవ పెద్ద రాష్ట్రం. జనాభారీత్యా చూస్తే దేశంలోకల్లా నాలుగో పెద్ద రాష్ట్రం.

రాష్ట్రం మొత్తం వైశాల్యం: ఒక లక్ష, 6 వేల 41 చదరపు మైళ్ళు. ఇది భారతదేశ వైశాల్యంలో 8.4 శాతం వుంటుంది. బంగాళాఖాతం పొడవున 540 మైళ్ళ నిడివిగల సముద్రతీర ప్రాంతం వుంది. ఆంధ్రప్రదేశ్, ఉత్తరంగా 15°, 20°ల మధ్య అక్షాంశరేఖకూ తూర్పున 78°. 85°ల ధృవాంశరేఖకూ మధ్య ఉంది, సంవత్సరంలో ఎక్కువకాలం వాతావరణం వేడిగా వుంటుంది. తెలంగాణా ప్రాంతంలో మామూలు వర్షప్రాంతం 76.74లు, ఆంధ్రప్రాంతంలో 34.64లు, రాష్ట్రంలో 1 కోటి 40 లక్షల 26 వేల ఎకరాల మేర అడవు లున్నాయి. ఇది రాష్ట్ర భౌగోళిక వైశాల్యంలో 21 శాతం వుంటుంది. రాష్ట్రంలో అన్ని రకాల పంటలక్రిందనున్న సాగుభూమి 2 కోట్ల 93 లక్షల 81 వేల ఎకరాలు, లేదా మొత్తం వైశాల్యంలో 44.4 శాతం వుంటుంది. రాష్ట్రంలో సగటు భూకమతం షుమారు 8.1 ఎకరం వుంటుంది.

మైసూర్ రాష్ట్రం తరువాత, ఆంధ్రప్రదేశ్‌లోనే అనేక రకాల అడవి జంతువులు, పక్షులూ వున్నాయి రాష్ట్రంమొత్తంమీద పశుగణం దేశం మొత్తంమీదనున్న సంఖ్యలో 9.6 శాతం వుంటుంది.

రాష్ట్ర జనాభా 3 కోట్ల, 12 లక్షల 60 వేల 133 మంది. ఇందులో 1 కోటి 55 లక్షల 42 వేల 912 మంది పురుషులూ, 1 కోటి 55 లక్షల 17 వేల 221 మంది స్త్రీలూ. చదరపు మైలు ఒక్కాం

టికి 295 మంది నివసిస్తున్నారు. ప్రతి వెయ్యిమందికి 896 స్త్రీలు. రాష్ట్రం మొత్తంమీద గ్రామీణ జనాభా 2 కోట్ల 58 లక్షల 21 వేల 679 మంది. వీరు మొత్తం జనాభాలో 82.6 శాతం అన్నమాట. మొత్తం వ్యవసాయం చేసేవారి సంఖ్య: 2 కోట్ల 10 లక్షల 40 వేల 324 మంది. వీరు మొత్తం జనాభాలో 67.3 శాతం వున్నారు. మొత్తం జనాభాలో 37.48 శాతం మాత్రమే ఆర్థికంగా బాగున్నారు.

రాష్ట్రం మొత్తంమీద 20 జిల్లాలున్నాయి. ప్రతి జిల్లాకుసగటు వైశాల్యం 5,303 చదరపు మైళ్ళు. మొత్తం 183 తాలూకాలున్నాయి. వెయ్యి రెవెన్యూ సర్కిల్స్ వున్నాయి. 293 పట్టణాలు, నగరాలూ వున్నాయి. రాష్ట్రంలో 26,550 గ్రామాలున్నాయి.

ఆంధ్రప్రదేశ్‌లో మొత్తం రైల్వేమార్గం 2,902 మైళ్ళుంది. ఇందులో 1633 బ్రాడ్-గేజ్‌లైన్లు; 1251 మైళ్ళు మీటర్‌గేజ్ లైన్లు; 25 మైళ్ళు ఇంత తక్కువ వెడల్పుగల లైనూ వుంది.

రాష్ట్రంలో 1309 మైళ్ళు పొడవున జాతీయ రహదార్లున్నాయి. 2072 మైళ్ళ రాష్ట్ర రహదార్లున్నాయి. 8,527 మైళ్ళమేరకు ప్రధానమైన జిల్లా రోడ్లు; 3,48; మైళ్ళు తదితర జిల్లారోడ్లూ వున్నాయి.

28,000 స్కూళ్ళు, 47 కళాశాలలు, 31 వృత్తి విద్య కళాశాలలు వున్నాయి. జనాభాలో 13.1 శాతం మాత్రమే అక్షరాస్యులు. అఖిల భారత శాతం 16.6.

రాష్ట్రంలో 776 ఆస్పత్రులున్నాయి. మొత్తండాక్టర్లు 923,నర్సుల సంఖ్య 1,224, మంత్రసానులు 538 మంది వున్నారు.

ఆంధ్రప్రదేశ్ జాతీయాదాయం 1956 - 56 నాటి లెక్కలను బట్టి, రు. 823.105 లు. మొత్తం ఆదాయంలో వ్యవసాయరంగనుండి, చిన్నతరహా పరిశ్రమలునుండి వచ్చే ఆదాయం రు. 557 కోట్లు లేదా 68 శాతం వుంటుంది.

